# 1

హైదరాబాదు నగరంలో పంజాగుట్టను ఆనుకొని పడమరదిశగా వ్యాపించిన కొండలను బంజారాగుట్టలనే వారు. ఒకప్పుడు ఆగుట్టలన్నీ బంజారాలకు (లంబాడీలకు) నివాసస్థానాలుగా వుండేవి. ఆనాడు బంజారాలు ఆ గుట్టలమీద ఆవులను, మేకలను మేపుకుంటూ కట్టెలు, పండ్లు అమ్ముకుని జీవితాలు గడిపేవారు. కొన్ని తరాలు గడిచాయి.

నైజాం నవాబుగారి జూబ్లీ వుత్సవాలసందర్భంలో ఆ గుట్టలకు జూబ్లీహిల్స్ అని నామకరణం చేసి వాటిని తన సామంతులకు, జాగీర్దార్లకు, అనుచరులకు పంచి పెట్టారు నవాబుగారు.

కొద్దికాలంలో ఆ గుట్టలమీద పెద్ద పెద్ద భవనాలు వెలిశాయి. చక్కని తారురోడ్లు నిర్మించారు. మంచినీటి పంపులు, విద్యుచ్ఛక్తి, టెలిఫోన్ సౌకర్యాలు యేర్పాటు

చేశారు. పాపం బంజారాల వృత్తి పడిపోయింది. వారి జీవితాలు గడవడం దుర్భరమైంది. చాలా కుటుంబాలు దూరప్రాంతాలకు తరలిపోయాయి. కొద్దిమందిమాత్రం ఆ గుట్టలనే అంటిపెట్టుకుని అక్కడక్కడా చిన్న చిన్న కుటీరాలు నిర్మించుకొని కూలీనాలీ చేసుకుని బ్రతుకులు వెళ్ళబుచ్చుతూన్నారు.

ఒక ఘరానా నవాబుగారి నాలుగు అంతస్తుల భవనానికి వందగజాల దూరంలో డబ్బారేకులతో కప్పిన రెండు చిన్న కుటీరాలు వున్నాయి. వాటిలో మొదటిది రామానాయక్‌ది. రెండవది ఘనేనాయక్‌ది. రామానాయక్ కుటీరం కంటే ఘనేనాయక్ కుటీరం వైశాల్యంలో పెద్దది. ఆ కుటీరాలకు తలుపులు, దర్వాజాలు లేవు. ఇంటికి నాల్గు వైపులా రాళ్ళుగోడల్లా పేర్చి పైన మట్టిపూశారు. లోపల ప్రవేశించడానికి ఒకే ఒకదారి. వెదురుపేళ్ళ తడికెలతో ఆ దారి మూస్తారు.

రామానాయక్ యువకుడు. పాతిక సంవత్సరాలు వయస్సు. సన్నగా, బారుగా, యెర్రగా, నాజూకుగా వుంటాడు. అతనికి క్రొత్తగా వివాహమైంది. భార్య అంగూర్ అంటే అతనికి యెంతో మక్కువ. అప్పట్లో అతను తాజ్‌గ్లాసు ఫ్యాక్టరీలో పనిచేస్తున్నాడు. ఉదయం ఎనిమిది గంటలకుపోయి సాయంకాలం అయిదు గంటలకు తిరిగి యింటికి వచ్చేవాడు. ఫ్యాక్టరీలో సంపాదించిన

రూపాయిపై చిలుకు డబ్బులు తెచ్చి తల్లి మున్నీబాయ్ చేతిలో పెట్టేవాడు.

క్రొత్తగా కాపురానికి వచ్చిన అంగూర్‌ను కూలికి నాలికి పంపడానికి రామానాయక్ వ్యతిరేకించేవాడు. పైగా అంగూర్ అందాల రాణి. ఆ అందాలభరిణపై ఎవరికైనా మోజు కలుగుతుందేమోనని అతని భయం. రామానాయక్‌కి తండ్రిలేడు. తల్లి, చెల్లెలు, మరోతమ్ముడు మాత్రం వున్నారు. చెల్లెలు జమునకు యుక్తవయస్సు వచ్చింది. ఇంకా పెండ్లికాలేదు. తమ్ముడికి చిన్న వయస్సు.

అంగూర్ కూలికి, నాలికి పోకపోయినా వారికుటుంబం కొద్దికాలం సాఫీగానే సాగిపోయింది. కాని ఒకనాడు అకస్మాత్తుగా రామానాయక్‌ను పనిలోనుండి తొలగించారు. యేపూట కాపూట తిండికి వెతుకోవలసి వచ్చింది. ఆ స్థితిలో తల్లి మున్నీబాయ్ రామానాయక్‌ను, అతని భార్యను తనతోపాటు తాపీ పనిలోకి పోదాము రమ్మనమని పిలిచింది. పొరుగింటి ఘనేనాయక్‌తో చెప్పింది. కాని రామానాయక్ తల్లి సలహాలను పట్టించుకోలేదు. "వారంరోజుల్లో నాకు అల్విన్‌లో పని యిస్తారు." అని చెప్పాడు.
"అయితే నేను యెక్కడికైనా వెళ్ళిపోతాను" అంది తల్లి.

"యెక్కడికిపోవద్దు అమ్మా. నేను త్వరలో పనిలో పోతాను అని చెపుతున్నానుగా" అన్నాడు రామానాయక్.

“యేమిటి నువ్వు చేసేపని? మీసం మెలిపెట్టు కుంటూ పెండ్లానికి యెదురుగా కూచుంటావు. అంతట మించిన పని నీ కేమీ దొరకదు. నా రెక్కలమీద వచ్చే మూడుపావలాల డబ్బులతో యెట్లా బ్రతుకుతాం!” అంది తల్లి.

రామానాయక్ చిన్నగా నవ్వి అక్కడనుండి లేచి పోయాడు. తల్లి మూటాముల్లె సర్దుకుని తనబిడ్డలనిద్దరిని తీసు కుని వెళ్ళిపోయింది. వెళ్ళేటప్పుడు కోడలు అంగూర్‌తో ఒక్కమాటైనా చెప్పలేదు. చీకటిపడిన తరువాత రామా నాయక్ ఇల్లుచేరాడు. ఇంట్లో భార్యామాత్రమేవుంది. అతను భార్యను ప్రశ్నించాడు.

“అంగూర్! అమ్మావాళ్ళు యేరీ?”

“మీ అమ్మ మూటలుసర్దుకుని పిల్లలనిద్దరినీ తీసుకొని వెళ్ళిపోయింది.”

“యెక్కడికి పోయిందీ నీకు తెలుసునా.”

“నాకు చెప్పలేదు”

అతను వెనకకుతిరిగి ఘనేనాయక్ ఇంటికి పోయాడు. ఘనేనాయక్ చుట్టకాలుస్తూ వాకిట్లో కూచునివున్నాడు. రామానాయక్‌ను చూస్తూనే అతను లేచి నిలబడి “అరే! రామ్ మీ అమ్మ పిల్లలను తీసుకుని మీ చిన్ననాయన దగ్గరకు పోయిందిరా!” అన్నాడు.

“నాకు మాట మాత్రంచెప్పలేదే! యెందుకుగాను అక్కడకు పోయినట్లు భాంభా!”

"యెందుకు అంటావేమిటిరా! ఇక్కడ నీకు పని లేదయ్యే. పిల్లాజెల్లా అయిదుగురు బ్రతకాలంటే కష్టంగా వుందిగా. మీ నాయన పోయినాక మీ అందరినీ మీ చిన్నాయన తీసుకుపోతానన్నాడు. కాని ఆనాడు మీ అమ్మ ఒప్పుకోలేదు. ప్రస్తుతం పరిస్థితులను బట్టి మీ అమ్మకు వెళ్ళక తప్పలేదు. అయినా మీ నాయన పోయినాక మిమ్మలను సాకవలసిన బాధ్యత మీ చిన్నాయన మీద వుంది కదరా! అందుకే మీ అమ్మ అక్కడకు పోయింది." అన్నాడు ఘనేనాయక్.

"ఇక్కడనుండి కామారెడ్డికి పోవాలంటే రైలు చార్జీలు కావాలిగదా! మా అమ్మకు డబ్బు ఎక్కడిది?"

ఘనేనాయక్ చిన్నగా నవ్వుకున్నాడు. "హా, బేటా! డబ్బువిషయంలో మీ అమ్మ ముందుగానే జాగ్రత్త పడింది. లోగడ యెప్పుడో నాదగ్గర యిర్వై రూపాయలు దాచుకుంది. దానిలో పదిహేను రూపాయలు ఆమె తీసుకు పోయింది. మిగిలిన అయిదు రూపాయిలు నీకు యిమ్మన మని చెప్పింది." అంటూ అతను బొడ్డులో దోపిన అయిదు రూపాయలు తీసి రామ్ చేతిలో పెట్టాడు.

రామ్ నిర్ఘాంత పోయాడు. అతని కళ్ళల్లో నీళ్లు తిరి గాయి. అతను మారుమాట చెప్పకుండా తన ఇంట్లోదూరి మంచంమీద పండుకున్నాడు. భార్యా అంగూర్ అతనిని ఒకటి రెండు సార్లు పలకరించింది. కాని అతను సమాధానం చెప్పలేదు.

బాగా చీకటి పడింది. అంగూర్ చిన్నబుడ్డి వెలిగించి మంచం ప్రక్కనే ఒక చాప పరచి దానిమీద పడుకుంది.

రామ్ యోచనలు పరిపరి విధాలపోయాయి. అతనికి పదహారేళ్లప్పుడు తండ్రి చనిపోయాడు. తండ్రి వుండగా తమకు అయిదారు ఆవులు, పాతిక మేకలు, వుండేవి. తను ప్రొద్దుటే లేచి యింత చద్దితిని మరికొంత మధ్యాహ్నానికి మూటకట్టుకొని ఆవులను, మేకలను గుట్టల మీదికి తోలుకుపోయి మేపుకువచ్చేవాడు. సాయంకాలం యింటికి రాగానే తల్లి వేడి వేడి రొట్టెలు, పప్పు అందించేది. అవి తృప్తిగా తిని మళ్లీ చదువుకోడానికి పంజా గుట్టలో నైటు స్కూలుకు పోయేవాడు. రాత్రి బాగా ప్రొద్దుపోయిన తరువాతగాని ఇంటికి తిరిగివచ్చేవాడు కాదు. అప్పటికి ఇంట్లో అంతా నిద్రలో వుండేవారు. తను చప్పుడు కాకుండా ఇంట్లో ఒకమూల గోనె పరుచుకుని నిద్రపోయేవాడు. యెప్పుడైనా తండ్రి మెలకువతో వుండగా తను ఇంటికి వస్తే ఆరోజున తమ ఇద్దరిమధ్యా ఘర్షణ తప్పేదికాదు. అనేకసార్లు తండ్రి తనను దాక్షిణ్యంలేకుండా చితకతన్నేవాడు. తల్లి అడ్డం పడితే ఆమెకు దెబ్బలు తప్పేవి కాదు.

తండ్రి పచ్చితాగుబోతు. ప్రొద్దుటే తాపీపని వారితో కలసి కట్టడపు పనికి పోయేవాడు. సాయంకాలం కల్లు అంగడికి పోయి ఆవచ్చిన డబ్బులు కాసినీ అక్కడ ఇచ్చేసి తూగుతూ, తూలుతూ ఇంటికి చేరేవాడు. ఒకనాటి రాత్రి తమ ఇద్దరికి పెద్దపోరాటమే జరిగింది. తనుఇంటికివచ్చే

సరికి తల్లి తండ్రీ ఇద్దరు బాగా ఘర్షణ పడుతున్నారు. తాపీ పనిలో వచ్చేడబ్బుల్లో సగం తమకిచ్చేట్టు తల్లి తాపీ మేస్త్రీతో మాట్లాడి యేర్పాటు చేసింది. కాని అదేమీ పీలుపడదు అన్నాడు తండ్రి.

"అయితే నీకు ఇంట్లో తిండిపెట్టను పొమ్మంది" తల్లి. తండ్రి ఆమెను జుట్టు వంగదీసి తన్నాడు. ఆమె యెదురుతిరిగింది. ఆస్థితిలో తను కల్పించుకున్నాడు. అమాంతం వెళ్ళి తండ్రిమీద కలబడ్డాడు తను. చాలా సేపు ఇరువురు పెనుగులాడారు. చివరకు తను తండ్రిని కిందపడ వేసి తన్నాడు. జుట్టుపట్టుకుని ఇంటి వెలుపలికి యీడ్చి "నీకు దిక్కువున్న చోటికి పోయి చెప్పుకో" అన్నాడు. తల్లి వచ్చి తమ ఇద్దరిమధ్యా నిలబడింది. ఆమె భర్తను చెయ్యి పుచ్చుకుని ఇంట్లోకి తీసుకుపోయి పండుకోబెట్టింది. "మీ నాయన ముసలివాడు అయ్యాడు బాబు. ఆయనమీద నువ్వు చెయ్యిచేసుకోబాక" అంటూ తల్లి తనను బ్రతిమాలింది. అంతే ఆతరువాత తండ్రి తనను గాని, తన తల్లిని గాని చెయ్యిచేసుకోలేదు.

ఆరోజులలోనే బంజారాగుట్టలలో గొప్ప గొప్ప భవనాల నిర్మాణం పెద్దయెత్తున ప్రారంభమైంది. కావాలసినంతకూలి. తల్లీ, తండ్రీ యిద్దరూ తాపీపనిలోకి పోయేవారు. తల్లికి రూపాయి, తండ్రికి రూపాయిన్నర వచ్చేది. తల్లి ఒకటిరెండు సార్లు తనకు సూచించింది. "అరే రామ్! మన ఆవుల్ని, మేకల్ని యెవరికైనా అప్పచెప్పాదాం. నీవు కూడా పనిలోకి వస్తే ముపోరూపాయి వస్తుందినాయనా.

అదిఅంతా నీ పెండ్లికి కూడబెడతాను" అనేది. కాని తల్లి సూచనలను తను ఆమోదించలేదు. పైగా వ్యతిరేకించాడు. "లేదు అమ్మా. మన ఆవులను నేను ఇంకొకరికి అప్పజెప్పను. ఆవులు, లేగలు అంటే నాకు పంచప్రాణాలూను. వెధవ రూపాయిడబ్బులువస్తే యెంత, పోతేయెంత. మన ఆవులు, మేకలు యేటేటా లేగలను పెడుతూంటే మనం యెన్నిడబ్బులైనా సంపాదించవచ్చు" అన్నాడతను.

ఆ ఆవులంటే తనకు యెంతమక్కువ. వాటిని పేరు పేరున పిలిచేవాడు. అవి మోరలు యెగబట్టుకుని తనముందుకువచ్చి నిలబడేవి. తను నవ్వుతూ వాటికళ్ళల్లోకి చూచేవాడు. పిల్లనగ్రోవితీసి శ్రావ్యంగా మోగించేవాడు. అవి చెవులు నిక్కరించి ఆలకిస్తూ నిలబడేవి. లేగలు గెంతుతూ పరుగులుతీసేవి. ఆ యల్లావు పెద్దది. దానిపేరు గంగ. దాని వేమూడు పెయ్యిలుకూడ వుండేవి. వాటిలో పెద్దది జమున. రెండోది సరస్వతి. మూడోది భగవతి. ఆ భగవతి ఎంత చక్కనిఆవు. కర్రిబట్ట వన్నె, గిన్ని కొమ్ములు, పెద్ద పొదుగు డొక్కబిగువుగా చూడముచ్చటగా వుండేది. దానిని ఒకసారి మూడువందలు అడిగితే తను యివ్వను పొమ్మన్నాడు. లేగలకు, రామ్, భీమ్, అర్జున్ అని పేర్లు పెట్టేవాడు. దేనిపేరు పిలిస్తే అదే పరుగుతీస్తూ వచ్చి తన ముందు నిలబడేది. టర్ టర్ మ్మా అని పిలవగానే చెల్లాచెదురుగా నున్న మేకలన్నీ ఒకచోట పోగై తన కోసం వెదుకుతూన్నట్టు దిక్కులు చూచేవి.

కాలం మారిపోయింది. గుట్టలునిండా భవనాలు వెలిశాయి. పదమైళ్ళ వైశాల్యంలో యెక్కడా చెట్టూ చేమాలేదు. పచ్చికపెరిగే అవకాశమేలేదు. పశువులకు మేతదొరకడం దుర్లభమైంది. క్రమంగా పశువులు క్షీణించి పోయ్యాయి. లేగలు చనిపోయాయి. వాటిని చూస్తూ తను కుమిలిపోయాడు. ఆ స్థితిలో చిన్నాయన వచ్చి పశువులను తోలుకుపోయాడు.

తరువాత తనకు పనిలేదు. తనూ తల్లితో, తండ్రితో కలసి తాపీపనికి పోయ్యాడు. ఆ కడుతున్నది ఒక రాజాగారి భవనం. మొదటి అంతస్థు లేచింది. రెండో అంతస్థుగోడలు తయారు అయ్యాయి. వాటిమీదికి ఇనుప దూలాలు యెత్తుతున్నారు. తను సిమెంటూ, ఇసుకా పాళ్ళకలిపి అడుసు తయారుచేస్తున్నాడు. తల్లి అడుసుతట్టలు మోస్తూంది. తండ్రి దూలాలు యెత్తే కార్యక్రమంలో వున్నాడు. రెండో అంతస్థుపైకి లేపిన ఒక పెద్ద ఇనుపదూలం పట్టు తప్పి క్రిందపడిపోయింది. కూలీలంతా ఒక్కసారిగా గొల్లుమన్నారు: తను సున్నం వదిలేసి అక్కడకు పరుగుతీశాడు. యేదో ప్రమాదం జరిగింది. తల్లి శోకాలు పెడుతోంది. తను జనాన్ని తోసుకుని ముందుకుపోయాడు. తన తండ్రి దూలం క్రిందపడివున్నాడు. తల అంతా నుజ్జు నుజ్జు అయింది. బట్టలన్నీ రక్తంతో మునిగాయి. "బాబా" అని వెర్రికేక పెట్టి తను తండ్రిమీద వాలాడు. తల్లి గుండెలు బాదుకుంటూ నేలమీద దొర్లింది. పదినిముషాలు గడిచాయి. ఇంజనీర్లూ, మేనేజరు, కంట్రాక్టరు అంతా పోగయ్యారు.

మేనేజరుకంట్రాక్టరును ప్రక్కకుపిలిచి అతని చేతిలో కొంత డబ్బు పెట్టి యేదో మాట్లాడాడు. కంట్రాక్టరు నెమ్మదిగా తను దగ్గరకువచ్చి తనను, తన తల్లిని ఓదార్చాడు. యెంతో ఆప్యాయంగా మాట్లాడాడు. తనను వేరేపిలిచి "ఇదుగో అబ్బాయి మీ నాయినకర్మ అలా కాలిపోయింది భగవంతుడు అట్టా రాశిపెట్టాడు. అందుకు మనం యేమి చెయ్యగలం. యేదో అయిపోయింది. యీ ఇరవైరూపాయలు తీసుకుపోయి మీ నాయన్ని మన్నుచెయ్యండి" అంటూ తన చేతిలో రెండు పదిరూపాయల చెక్కులు పెట్టాడు.

నాయన్ని మన్ను చెయ్యాలనేమాట వినేసరికి తనగుండె బేజారైయింది! ఆ డబ్బు కంట్రాక్టరు ముఖాన విసిరికొట్టి మళ్ళీపోయి తండ్రిమీద వాలాడు. కులంవాళ్ళంతా పోగై తలోక సలహాయిచ్చారు. కంట్రాక్టరుయిచ్చిన 50 రూపాయిలుకాక మరో 50 రూపాయలుఖర్చుపెట్టి కర్మకాండలు జరిపారు. అప్పుడు చిన్నాయన అందరని తన దగ్గరకువచ్చి వుండమన్నాడు. చిన్నాయనదగ్గరకు పోడానికి ఆనాడు తను వుబలాటపడ్డాడు. అక్కడ ఆవులు, మేకలు వున్నాయి. కామారెడ్డి ప్రాంతాలు తన చిన్నతనంలో ఒకటి రెండు సార్లు చూశాడు. కావలసినంత అడవి, హాయిగా తిరగవచ్చుననుకున్నాడు. కాని చిన్నాయన సూచనను తల్లి తిరస్కరించింది. "నాబిడ్డ పెద్దవాడు అయ్యాడు మమ్ములను వాడే పోషిస్తాడు" అని చెప్పేసింది.

"కాని ఆనాడు అమ్మ అన్న మాటలను నేను యీనాడు నిలబెట్టలేకపోయాను. అమ్మ నన్ను పెంచి పెద్దవాడిని చేసింది. వివాహం చేసింది. అమ్మ చెప్పిన సలహాను విని వుండవలసింది." రామ్ పశ్చాత్తాపం చెందాడు. "ఇప్పుడు యేమి చెయ్యాలి" అని ప్రశ్నించుకున్నాడు తనలో తాను. "మళ్ళీ ఉద్యోగం సంపాదించి అమ్మను, చెల్లిని, తమ్ముడినీ తిరిగి తీసుకువస్తాను" అనుకున్నాడు అతను.

అతను ప్రక్కకు వత్తిగిలి చూచాడు. దీపం గుడ్డిగా మినుకు, మినుకుమంటూంది. అంగూర్ చాపమీద పండుకుని తనవైపే చూస్తూంది.

"రామ్, రొట్టె కాల్చాను, ఒకటి తిను!" అంది ఆమె నెమ్మదిగా.

"పిండి యెక్కడ తెచ్చావు?"

"పొరుగింట్లో బదులు తెచ్చాను రామ్!"

"రొట్టెలోకి ఏమివుంది!"

"పప్పు చేశాను."

అతను మంచంమీద లేచి కూచున్నాడు. ఆమె చెంబుతో నీళ్ళు తెచ్చి అతని దగ్గిర పెట్టింది. అతను కాళ్ళు చేతులు శుభ్రం చేసుకున్నాడు. ఆమె ఒక పళ్ళెంలో రెండు రొట్టెలు పెట్టి అతనికి అందిచ్చింది!

"మరి నీకో" అన్నాడు అతను.

"నాకు వేరేవున్నాయి"

"ఏదీ తీసుకురా చూదాం"

ఆమె లేచి మరో పళ్లెంలో 'వున్న రొట్టె కూడా పెట్టింది.

"ఒక్కటేగా!"

"నాకు అది చాలు రామ్"

అతను తనరొట్టెలో సగం చించి ఆమె పళ్ళెంలో వెయ్యబోయాడు. ఆమె తన పళ్ళెం వెనకకు లాక్కుంది.

"అయితే నాకూవద్దు" అన్నాడు తనపళ్లెం దూరంగా పెట్టి.

ఆమె నవ్వుతూ అంది. "మీ అమ్మ దగ్గర కూచుని తినిపించేదిగా నీకు, మరి యిప్పుడు యెవ్వరు తినిపిస్తారూ!"

"నీవు వున్నావుగా!"

"అయితే ఆ రెండు రొట్టెలు తిను"

"అదేంవీలుపడదు. చెరిసగంతిందాం" రామ్ పట్టు పట్టాడు.

ఆమె అంగీకరించకతప్పలేదు. భోజనం ముగించిన తరువాత అతను అడిగాడు. "అంగూర్, నీ దగ్గర యేమైనా డబ్బువుందా!"

"నాలుగు రూపాయలు వున్నాయి."

"యెక్కడివి?"

"మా నాయన వచ్చినప్పుడు యిచ్చి వెళ్ళాడు!"

"ఆ నాలుగు రూపాయలతో యేమిచెయ్యాలనుకుంటున్నావు?"

"యేమో! నాకు తెలియదు" అంది ఆమె అమాయకంగా.

"అయితే నాకు యివ్వు. మళ్ళీ యెప్పుడైనా యిస్తాను."

ఆమె పేలవంగా నవ్వింది.

"నవ్వుతున్నావు యెందుకు, అంగూర్!"

ఆమె మళ్ళీ నవ్వింది. అతను ప్రశ్నించాడు.

"అదేమిటి అంగూర్ కారణంలేకుండా అలా నవ్వుతావు యెందుకు?"

"ఆ నాలుగు రూపాయలు మళ్లీ నాకు యిస్తానంటుంటే నవ్వొవస్తోంది రామ్."

"అవును ఆ డబ్బు నీదిగా"

"నాదీ నీదే అనే భేదభావం నాకులేదు రామ్"

అతను నవ్వుతూ ఆమెను కౌగిటిలోకి తీసుకున్నాడు.

* * *

మరునాటి ఉదయం రామానాయక్ నిద్రనుండి లేవగానే ఘనేనాయక్ యింటికి వెళ్ళాడు. ఘనేనాయక్ వాకిట ముందు కట్టెలు పగులగొడుతూ అతనిని పలుకరించాడు. "రామ్, ఇకముందు యేమిచేయాలనుకుంటున్నావు! నీకు ఆల్విన్‌లో పనిదొరుకుతుందా?" అంటూ ప్రశ్నించాడు. రామ్ సమాధానంచెప్పక ముందు ఘనేనాయక్ భార్య జోరా ఇంట్లోనుండి వచ్చి అతనికి యెదురుగా నిలబడింది.

జోరా ఆరుగురు బిడ్డలతల్లి. పొట్టిగా వుంటుంది. దానికి తోడు స్థూలకాయంకూడా. ఆమె మాట్లాడుతూంటే శరీరమంతా వూగుతుంది. ఆమె జాలిగా రామ్‌వైపు

చూస్తూ అంది. "అరే! జేటా, రామ్! మీ నాయన చని పోయ్యాడు. మీ అమ్మ నిన్నువదిలిపెట్టి మీ చిన్నాయన దగ్గరికి పోయ్యింది. నీకు చిన్న వయస్సు. చక్కని పెండ్లామే దొరికింది. యెట్లా బ్రతుకుతావో జేటా!"

రామ్ ఆమెవైపు చూస్తూ చిన్నగానవ్వాడు. "లేదు మామ్మా! నేను ఈరోజు కామారెడ్డికిపోయి అమ్మను, చెల్లిని, తమ్ముడినీ తీసుకురావాలనుకుంటున్నాను." అన్నాడు.

ఘనేనాయక్ కట్టెలు పగులగొట్టడం ఆపి రామ్‌వైపు ఆశ్చర్యంగా చూచాడు. జోరా దవడలు నొక్కుకుంది.

"అరే రామ్! నీవు వట్టి జేవకూఫ్‌వురా. అసలు మీ అమ్మసంగతి నీకు తెలిసివుంటే ఆమెను మళ్ళీ తీసుకు వస్తానని నీవు అంటావా? అయినా నీవు రైలుఛార్జీలు పెట్టు కుని అక్కడకు పోతేమాత్రం ఆవిడగారు మళ్ళీ యిక్కడకు వస్తుందిగనుకనా! యెప్పుడూ రాదు" అంది జోరా.

రామ్ ప్రశ్నార్థకంగా ఆమెవైపు చూశాడు. "ఎందు కని రాదంటావు మామ్మా!"

"ఎందుకంటావేమిటిరా! నీ పెండ్లానికి మీఅమ్మకూ ఒక్కక్షణం పడదు"

"వాళ్ళిద్దరు యెన్నడూ పోట్లాడుకోలేదుగద మామ్మా!"

"ఆఁ. అదే నేను చెప్పబోయేది! నీపెండ్లాం మంచిది గనుక రెండోవాళ్ళకు తెలియకుండా బాధలన్నీ ఓర్చు కుంది. ఒకనాటి సాయంకాలం నీవు యింటిదగ్గర లేవు. నీ

పెండ్లాం కళసువుచిమ్మింది. అది సరిగా జిమ్మలేదని మీ అమ్మ ఆ చీపురు లాక్కుని దానితో నీ పెండ్లాన్ని నాలుగు బాదింది. అంతేననుకున్నావా? నీ పెండ్లానికి మీ అమ్మ ఒక్కపూటకూడా సరిగా తిండిపెట్టలేదు. చద్దీ, బద్దీ,మాడు, మక్కూ దాని మొహానపడేసేది.”

“ఈ విషయం అంగూర్ నీకు చెప్పిందా మామ్మా!”

జోరా మళ్ళీ దవడలు నొక్కుకుంది. “అవ్వ, అంగూర్ యెంత బుద్ధిగలపిల్ల! అది నాకుకాదుగదా దేవుడికికూడా యిలాంటివిషయాలు చెప్పదురా నాయనా! అయినా ఆ పిల్లను చూస్తుంటే నీకుమాత్రం తెలియడం లేదూ. అది కొత్తగా కాపురానికి వచ్చినప్పుడు యెలా వుండేదంటావు పిల్ల. గొప్పయింటిబిడ్డలా మెరగా కమలా ఫలంలా వుండేదికదూ. ఇప్పుడు యెలావుందో నీకుమాత్రం అగుపించడంలేదూ! సరియైనతిండీ, తిప్పలు పోషణలేక పిల్ల చిక్కిపోయి నల్లగా పొగచూరుకట్టెలా తయారైంది. అంగూర్ పాపం బుద్ధిమంతురాలురా. దాని వుసురు మీ అమ్మకు తప్పకుండా తగులుతుంది.”

రామానాయక్ నీరసంగా నవ్వాడు. ఘనేనాయక్ కొరకొరలాడుతూ భార్యవైపు చూచాడు. “హ త్తేరీ! చెత్తాకానీ లంజా, యిక అంతటితో నోరుముయ్యి” అన్నాడు. ఆ తరువాత అతను రామానాయక్ వైపు తిరిగి “అరే రామ్! దీని మాటలు నమ్మబోకురా! వట్టి చాడీలు కోరుముండా” అని చెప్పాడు.

జోరా మండిపడింది. ఆమె కోపంతో శివంగిలా పరవళ్లు తొక్కింది. ఆమె స్తనాలు, ఉదరము కిందికీ మీందికీ ఊగాయి. చేతులు రెండు బారలు చాచి భర్తను సవాలుచేస్తూ అంది. "అగ్గే చేతకాని మగోడా! నీకు చూడటానికి కళ్లు లేకపోతే నోరుమూసుకుని ముండలా కూర్చో. అంతేగాని నన్ను మాత్రం మాటలు, నీతులు అంటే నేను పడేదిలేదు. ముస్సిబాయ్ అంటే నీకు మహా మురిపెం కాదూ! నాకు తెలియదనుకున్నావా ఆ సంగతి. నేనేమీ పిచ్చిముండను కాదు. మీ సంగతంతా కనిపెడుతూనే వున్నానులే. నీకు యిష్టమైతే దాని కొంగుపట్టుకుని వూగులాడు. కాని అది గనక మళ్ళీ తిరిగి యిక్కడికివస్తే నేను నా పిల్లలను తీసుకొని వేరే వెళ్ళిపోతాను" అంది.

ఘనేనాయక్ ఆవేశంతో "సీ యమ్మా! బాట్కావ్ లంజా పిచ్చిపిచ్చిగా వాగతావు!" అంటూ ఆమెమీదికి పోయి జుట్టుపట్టుకున్నాడు. పక్కనేవున్న పిల్లలు గల్లంతుగా యేడిచారు. రామూనాయక్ అతికష్టంమీద వారిని విడదీసి ఘనేనాయక్‌ను దూరంగా తోసేశాడు. జోరా భర్తను శాపనార్థాలుపెట్టి యింట్లో దూరింది.

జోరాకు ఆరుగురు సంతానం. పెద్ద కూతురుకు వివాహంచేసి భర్తదగ్గరకు పంపించారు. ఆమె తరువాత ఇద్దరు మగపిల్లలు. పెద్దవాడికి ఇరవైసంవత్సరాలుంటాయి. అతనికి ఒకకాలు పొట్టి. అందుచేత అతనిని అందరూ 'లంగడా' అని పిలుస్తారు. రెండోవాడు శివానాయక్. అతనికి పద్ధెనిమిది సంవత్సరాలు. సన్నగా పొడుగా వుంటాడు.

నాలుగో సంతానం ఆడపిల్ల. పదహారు సంవత్సరాల వయస్సు. పేరు తార. తార తల్లిలాకాక సన్నగా బారుగా వుంటుంది. విశాలమైన నుదురు, దట్టంగా పెరిగిన కను బొమలు, సోగకన్నులు, సన్నగా ముక్కు, చిన్నిమూతి, నిడివైన కంఠము, గాలిలో తేలిపోయే గాలిపటంలా వుంటుంది. తార అంటే ఘనేనాయక్‌కు ఎంతో మురిపెం. ఆమెను చూస్తూ అతను యెంతో పొంగిపోతాడు. తరచు ఆమెను గురించి అంటూవుంటాడు. "అరే బేటీ తారా! పెరుగుతోటకూర కాడలా యింకా ఎంతబారు పెరు గుతావు! చుక్కలను అందుకోవాలని చూస్తున్నావా? మేరీప్యారీ బేటీ!" అతను అలా అన్నప్పుడు జోరా చీద రించుకునేది. "అదేమిటీ పాడుమొహంవోడా బిడ్డకు దిష్టిపెడు తున్నావా! ఇక అంతటితో ఆపు" అంటూ ఆమె తారను పిలిచి చెక్కిళ్ళు నిమిరి భర్తముఖంమీద మెటికెలు విరిచేది. ఘనేనాయక్ నవ్వుతూ అనేవాడు! "ఓసి నాపిచ్చిజోరా! నేను అనేది యేమిటో నీకు తెలియదే మన తార పెరిగి, పెరిగి తారా జువ్వలా పైపైకి లేచిపోతుందేమోనని నాకు భయంగావుంటుందే. అట్టాకాకుండా మన తారకాస్త వళ్ళు చేసి ఆ వంటికి కండపడితే ఎంతఅందంగా వుంటుందంటావు మనబిడ్డ. గొప్పగొప్ప నవాబులు, బేగమ్‌లు మన తారను చూస్తే సిగ్గుపడిపోరూ!"

జోరా తార ముఖాన్ని తన స్థనాలమధ్య అదిమి పట్టి "ఆ పాపిష్టి వాడికళ్ళకు నీవు అగుపించకు అమ్మా, దిష్టి

తగులుతుంది. ముదనష్టపోడు. యెప్పుడూ అదేవాగుడు" అనేది.

తార తరువాత జోరాకు చాలాకాలం సంతానం కలగలేదు. తార యెనిమిది సంవత్సరాల వయస్సులో వుండగా జోరాకు కవలలు జన్మించారు. వాళ్లు రాం, లక్ష్మణ్.

ధనేనాయక్ రామూనాయక్‌ను పక్కకుతీసుకుపోయి చెప్పాడు "బేటా రామ్, మీ అమ్మకోసం నీవు యిప్పుడు పోవటం మంచిదికాదు. ముందు ఉద్యోగం సంపాదించుకుని, నీకు కాస్త స్థిమితం చిక్కినతరువాత పోయి తీసుకు వద్దువుగాని. అయినా మీ అమ్మకూడా మీ చిన్నాయన దగ్గర అట్టేకాలం వుండగలుగుతుందని నేను అనుకోను. మీ చిన్నాయన పెళ్లాం లేదూ, ఆ గౌరి, మహాకర్కోటపు మనిషి. మాటవస్తే ఆవిడ మీ చిన్నాయననే బొడ్డులో చెయ్యివేసి నిలబెడుతుంది. అలాంటి ఆడదాని పొత్తున మీ అమ్మ అక్కడ యెంతకాలం నిలబడుతుందనీ! కొంత ఓపిక పట్టి చూడు. యీలోపున ఆమే, పిల్లలు తిరిగివచ్చినా రావచ్చు" అన్నాడు.

రామ్ దీర్ఘంగా నిట్టూర్చాడు. "సరేబాబా" అంటూ అతను తన ఇంటివైపు నడిచాడు. అంగూర్, తారా యిద్దరు నీటిబానలు నెత్తిమీదపెట్టుకుని అందెలు ఘల్లు ఘల్లున మోగుతూంటే భారంగా గుట్టపైకి వస్తున్నారు. రామ్ వారికి యెదురుపోయి భార్యనెత్తిమీద

బానను తను తీసుకున్నాడు. తార మొగతాళి చేసింది. "అరే రామ్‌భయ్యా, పాపం! నీ పెళ్లాం అలిసిపోయింది."

"రేపు నీమగడని రానీ! నీ పని చెపుతాను" అన్నాడు రామ్.

తార కిల కిల లాడుతూ నవ్వింది. "అరే భయ్యా, నాకు ఈ రోజువరకు అసలు మగడే లేడు. రేపు యెక్కడి నుండి వూడిపడతాడు? నీవు వాడితో చెప్పేది ఏమిటీ?"

రామ్ తన ఇంటిముందునిలబడి "తారా! తొందర పడబోకు. మెత్తగా చితకతన్నే మగడు వస్తాడులే! అన్నాడు.

తార తండ్రిని కేక పెట్టింది "బాబా! రామ్‌భయ్యా చూడు. యేమంటున్నాడో!"

ఘనేనాయక్ ముందుకు నాలుగడుగులువేసి తార నెత్తిమీదనున్న కుండను అందిపుచ్చుకుంటూ "యేమన్నా డమ్మా, రామ్‌భయ్యా" అని అడిగాడు.

"చూడు బాబా! నన్ను మెత్తగా చితకకొట్టే మగణ్ణి తీసుకు వస్తానంటున్నాడు" తారకోపంనటిస్తూ అంది.

ఘనేనాయక్ సంతృప్తిగా నవ్వాడు "మంచిదే! తీసుకురానీ బిడ్డా! అంగూర్‌ని వాడు యెంతకొడుతున్నాడో రేపు వచ్చే నీమగడుకూడా నిన్ను అంతే కొడతాడు."

తార సమాధానం చెప్పకపూర్వం జోరా ఇంట్లో శోకం పెట్టింది. తార కంగారుగా ఇంట్లోకి పరుగుతీసింది.

జోరా రామ్‌ని, లక్ష్మణ్‌ని చేరి ఒకవైపున కూచోబెట్టుకుని శోకాలు పెడుతూ యేడుస్తూంది. తార తల్లిముందు నిలబడి "ఏమైంది! అమ్మా?" అంటూ ప్రశ్నించింది. జోరా మాట్లాడలేదు. చిన్నాడు లక్ష్మణ్ అన్నాడు "అక్కా! నాయనే మన అమ్మను కొట్టాడు."

"ఎందుకు కొట్టాడు?" తార ప్రశ్నించింది. రాము సమాధానం చెప్పాడు "వట్టిదే! అమ్మను నాయన కొట్టలేదు అక్కా! అమ్మ తిడితే నాయన జుట్టుపట్టుకున్నాడు"

తార చిన్నగా నవ్వింది. జోరా మండిపడింది. "అరే! బాట్కావ్, నువ్వు నీ బాబుదగ్గరికేపో!" అంటూ రామ్ వీపు మీద రెండు చరిచింది. వాడు బిగ్గరగా యేడిచాడు. తార వాడిని బయటికి తీసుకుపోయి సముదాయించింది.

* * *

ఘనేనాయక్‌కి యల్లారెడ్డిగూడాకు మైలుదూరంలో రెండు యకరాలు చెరువుక్రింది సాగుభూమి వుంది. దానిలో ఏటా ఒక యకరం పైరు అలుకుతాడు. నాలుగు బస్తాల వరకు గింజలు అవుతాయి. ఒకజత యెడ్లూ, బండీ వున్నాయి. తీరిక దినాలలో ఘనేనాయక్ కొడుకులను యిద్దరిని వెంటపెట్టుకుని గుట్టలమీదికిపోయి కట్టెలు కొట్టి అంగడిలో పెట్టి అమ్మేవాడు. ఇద్దరు కొడుకులు, తను, అప్పుడప్పుడు జోరా, వారము అంతా కష్టపడి గుట్టలమీద తిరిగి కష్టపడి కట్టెలు పోగుచేసేవారు. తను చెట్టుకొమ్మలు నరికి పోగులు పెట్టేవాడు. లంగడా మోపులు బిగించేవాడు.

ఆ మోపులన్నీ శివానాయక్, జోరా బండి దగ్గరకు చేర్చే వారు. వారంరోజులు కష్టించి పోగుచేస్తే మూడు, నాలుగు బండ్లు కట్టెలు పోగయ్యేవి.

యర్రగడ్డలో ఆదివారం, ఆదివారం అంగడి (సంత) జరుగుతుంది. కట్టెలు అమ్మగా వచ్చినడబ్బుతో జోరా సంచిలో భద్రంగా దాచుకుని ఇంటికి బయలుదేరి పోయేది. ఘనేనాయక్ గేదెలు, దున్నలు, ఆవుల బేరంలో దళారిగా వ్యవహరించి సాయంకాలానికి నాలుగు, అయిదు సంపాదించి కల్లు అంగడికి దారితీసేవాడు.

హైదరాబాద్ నగరంలో ఆదివారంనాడు కల్లు అంగళ్ళన్నీ ఆడవాళ్ళతో, మగవాళ్ళతో నిండి కళ కళలాడుతూ వుంటాయి. జేబులో పైసలు వున్నా లేక పోయినా ప్రతివాడూ అలవాటుగా కల్లు అంగడికి పోతాడు. పైసాలు వున్నవాడు నలుగురిని వెంటేసుకు వస్తాడు. లేనివాడు వున్నవాడి దరిని చేరతాడు. నవాబులు, గరీబ్‌లు, ప్రభువులు, పాలెగాళ్ళు అంతా అక్కడ ప్రత్యక్ష మవుతారు. వారితో పాటు వారిజనానా సకుటుంబ సపరివారంగా అంగడి దగ్గరలో తిష్టవేసి గంటలు గడిపేస్తారు. కలవాడు ఒక లొట్టికల్లు, నాలుగు లోటాలు తెప్పిస్తే లేనివాడు రెండు సీసాలతో సరిపెట్టుకుంటాడు. మధ్యలో పకోడీలో, చక్కిరాలో, చీకులో తింటూ కబుర్లతో కాలం గడుపుతారు.

ఘనేనాయక్ కల్లుఅంగడి నలువైపులా పరికించాడు. తినవాళ్లు ఎవ్వరూ అక్కడ లేరు. ఒక లొట్టెకల్లు,

రెండు లోటాలు పుచ్చుకుని ఒక మూలకు చేరి తాపీగా కూచుని తాగడం ప్రారంభించాడు. లోట్లో సగం ఖాళీ అయ్యింది. కాస్త నిషా యెక్కింది. ఆ పచ్చిక మీద వెల్లికిలా పండుకుని ఆకాశం కేసి చూస్తూ పాటఅందుకున్నాడు.

హరి హరీ నారాయిణో
ఆది నారాయణా
కరుణించి మమ్మేలూ
కమల లోచనుడా!
మాదవుడి గోవులూ
యాదవుడు కాయగా
మాధవుడు మత్యావ
తారుడైనాడో ॥హరి హరీ॥
మా బంజారు గుట్టలే!
బంగారు గుట్టలో
ఆ బంగారు గుట్టల్లో
బంజారులు లేరో! ॥హరి హరీ॥
గుట్టక్రింద చింత మాన్లూ
గుట్టమీద రేగుమాన్లూ
రేగుపండ్లూ, రేగిపొట్లూ
కంటికే కనరావో ॥హరి హరీ॥
బంజారు గుట్టలలో
బంగళాలు వెలిశాయి,
దేశమేలే దొరలు
నిలిశారు గుట్టలలో ॥హరి హరీ॥

మా ఆలమందలు పొయ్యాయి
ఆబోతులు పొయ్యాయి
మా బంజార్ల బతుకులే
భారమై పొయ్యాయో ॥హారి హారీ॥

ఘనేనాయక్ కొడుకులు లంగడా, శివానాయక్‌లు వచ్చి అతని దగ్గరగా చతికిల బడ్డారు. ఘనేనాయక్ ఆకాశంకేసి చూస్తూనే వాళ్ళను పలకరించాడు "యేమిటిరా! అబ్బాయిలు ఇటు వచ్చారు?"

లంగడా తమ్ముడివైపుచూచి కన్నుగీటాడు. "బాబా! అంతా నువ్వే తాగేసినట్టున్నావు?" శివానాయక్ ప్రశ్నించాడు.

"లేదురా అబ్బీ! ఆ లొట్టిచూడు, ఇంకా సగానికి పైగానే వుంది"

"అమ్మా, చిన్నతమ్ముళ్ళు, తారకూడా వస్తున్నారు బాబా!"

"వస్తే రానియ్యిరా. మరో లొట్టి తీసుకువద్దాం"

తార అందెలు ఘల్లు ఘల్లు లాడిస్తూ తండ్రి తల దగ్గరకు వచ్చి కూచుంది. ఆమెచేతిలో చిన్నమూట వుంది. ఘనేనాయక్ ఆ మూట వాసనచూచి తారవైపు చెయ్యి చాచాడు. తార మూట వెనకకు దాచుకుని "బాబా! నీకు ఒక తాయం పెడతా" అంది.

"అంత తాయం పెట్టేదానవు మూట యెందుకు దాచుకున్నావు?"

"లేదు బాబా! నువ్వు లేచికూర్చో పెడతాను"

"ఏమిటి ఆ తాయం?"

"చెప్పుకో చూద్దాం"

"పకోడీలు"

"కాదు"

"చేగోడీలు"

"కాదు"

"చక్కిలాలు"

"కాదు"

"మరి"

"చీకులూ" అంది తార తండ్రి చెవిదగ్గర మూతి పెట్టి. ఘనేనాయక్ ముఖం చాటంత అయింది. అతను వెంటనే లేచికూచుని "అరరే మేరీ ప్యారీ బేటీ, బహుత్, బహుత్ అచ్ఛీహై ఆవ్ ఆవ్" అంటూ తార తలను ముందుకులాగి ముద్దాడాడు.

జోరా భర్తను మందలించింది. "అరే పాడుమొహం వాడా! నీకు జ్ఞానం లేదురా! వయస్సువచ్చిన పిల్లను ముద్దాడతావు!"

"ఇక నోరుముయ్యవే భడవా!" అన్నాడు ఘనేనాయక్ భార్యవైపు చూడకుండానే.

శివానాయక్ తండ్రి ముందుకుపోయి "బాబా డబ్బులు యివ్వు, కల్లుతీసుకువస్తాను" అంటూ చెయ్యి చాపాడు.

"నా దగ్గర లేవు. మీ అమ్మను అడిగితీసుకో" అన్నాడు ఘనేనాయక్

జోరా మండిపడింది. ఆమె చిన్నపిల్లలను యిద్దరిని తీసుకుని వెనకకుతిరిగి "ఇంటికిరా నీపనిచెబుతా! నీజోలిలో బొమ్మరాయి కొట్టకపోతే నేను బడేనాయకు కూతురునే కాదు" అంది జోరా భర్తను బెదిరిస్తూ.

"బాబా! అమ్మ వెళ్ళిపోతూంది" తార ఆందోళన వెలిబుచ్చింది.

"యెక్కడికి పోతుందిలేవే" ఘనేనాయక్ నిర్లక్ష్యంగా అన్నాడు.

"లేదు బాబా! అమ్మ చిన్నతమ్ముళ్ళను తీసుకొని ఇంటిదారి పట్టింది. నీవుపోయి తీసుకురా బాబా!" తార తండ్రిని తొందరపెట్టింది. ఘనేనాయక్ లేచి తొందర తొందరగా నాలుగు అడుగులువేశాడు. కాని ముందుకు తూలిపొయ్యాడు. లంగడా లేచి తండ్రిని పట్టుకుని తల్లిదగ్గరకు తీసుకుపోయాడు.

ఘనేనాయక్ జోరా చెయ్యిపుచ్చుకుని "అందరం కలిసేపోదాం, నీవుకూడా కాస్త కల్లుపుచ్చుకుందువుగాని పోదాం రా" అన్నాడు.

ఆమె చేతిని గట్టిగా విదిలించుకుంది. అతను ముందుకుతూలి పడబోయాడు. లంగడా తండ్రిని పడకుండా పట్టుకున్నాడు. ఘనేనాయక్ తేరుకుని "ఓ నా పిచ్చి జోరా! నన్నువదలి యెక్కడికి పారిపోతావు! నిన్ను మాత్రం నేను వదలేదిలేదు. ఇవిగో డబ్బులు, శుభ్రంగా తాగుదాంరా" అంటూ జేబులోవున్న డబ్బులుతీసి ఆమె చేతిలో పెట్టాడు. జోరా డబ్బులు లెక్కచూచుకుంది.

నాలుగు రూపాయలు, పైన చిల్లర. ఆమె లంగడాచేతికి రెండు రూపాయలుయిచ్చి ఒక లోట్టె కల్లు, ఎనిమిది లోటాలు పట్టుకురమ్మంది.

"ఎనిమిదిలోటాలు యెందుకే!" ఘనేనాయక్ తూలుతూ అడిగాడు. "కావాలిలే, మన అంగూర్, రామ్ వస్తూవుండి వుండాలి! లంగడా కల్లుదుకాణంలోకిపోయాడు. జోరా భర్త చెయ్యపుచ్చుకుని పిల్లలదగ్గరకు పోయి కూచుంది. ఘనేనాయక్ తాగగా మిగిలిన లోట్టెను ఆమె తనముందుకు లాక్కుంది. ఘనేనాయకు జోరా ఒడిలో తల పెట్టి వెల్లికిలా పడుకుని మళ్ళీ పాట అందుకున్నాడు.

హరిహరీ నారాయడో
ఆది నారాయాడా
కరుణించి మమ్మేలూ
కమలలోచనుడా!

జోరా ఒకచేతితో అతని నోరుమూసి "అరే! నాయక్! కాసేపు ఆగు, ఇంటికిపోయాక పాడుదువుగాని" అంటూ మందలించింది.

"యేమ్! నా యిష్టం నేను పాడుకుంటా. ఆడు కుంటా! నువ్వు యెవరవు నాకు అడ్డుచెప్పడానికి?" అంటూ ఘనేనాయకు లేచికూచున్నాడు.

జోరా దవడలునొక్కుకుని "అవ్వా! నువ్వు ఇట్టా ఆగడం మొదలెడితే నా పిల్లలను తీసుకుని నేను ఇంటికి పోతాను" అంటూ ఆమె లేవబోయింది. అతను రెండు చేతులతో జోరా మెడను కౌగలించుకుని "ఓనా జోరా!

పోవద్దు పోవద్దు. జోరాలేకపోతే నాయకు లేడు" అంటూ ఆమె ఒడిలో తలదూర్చి పండుకున్నాడు. తారా, శివానాయకు నవ్వుకున్నారు.

లంగడా కల్లులోట్లు, మట్టిలోటాలు తెచ్చి తల్లి ముందుపెట్టాడు. జోరాలొట్టిలోకి పరీక్షగా చూచింది. "పాడు చచ్చినోళ్ళు, వట్టి కల్తీకల్లు, వీళ్ళదుకాణం వీళ్ళ్యా ముద నష్టంగాను" అంది.

అంగడి సమీపంలో రామ్, అంగూర్ అగుపించారు. తార లేచినిలబడింది. "అరే రామ్ భయ్యా! ఇక్కడ. ఇక్కడ యిటురాండీ" అంటూ కేకపెట్టింది. అంగూర్ చిరునవ్వులు చిందిస్తూ వారి దగ్గరకు వచ్చింది. ఆమె చేతిలోకూడా చిన్న పొట్లంవుంది.

"అంగూర్ నీవుకూడా యేదో తెచ్చినట్టున్నావ్" అంది తార. అంగూర్ కాజాలు తెచ్చి వ్యంగంగా అంది. "చీకులు తెచ్చాను తారా! నీకు కావాలా?"

"అయితే నేను కాజాలు తెచ్చాను అంగూర్. నీ చీకులు రెండు నాకు రుచి చూపెట్టు"

"అబ్బ! వడిగలదానివే తారా! ముందు నీ కాజాలు రుచి చూపెడితే, ఆతరువాత నా చీకులు పెడతాను నీకు" ఇద్దరు యేకమై నవ్వుకున్నారు. రామ్ వచ్చి వారి ప్రక్కనే చేరాడు. జోరా అందరినీ కూర్చోబెట్టి తలొక లోటా కల్లు పోసింది. తార చీకులు పెట్టింది. ఘనేనాయక్ నిద్రపోయాడు.

రామ్ తనకు ఆల్విన్‌లో పనికుదిరిందనీ ఒకటవతారీఖు నుండి పనిలోకి పోతాననీ చెప్పాడు.

"ఒకటవతారీకు అంటే ఇంకా ఎన్ని దినాలువుంది" జోరా ప్రశ్నించింది.

"ఇంకా నాలుగు రోజులు మామ్మా" రామ్ సమాధానంచెప్పాడు.

"మరి ఈ నాలుగు దినాలకు సరిపడగ్రాసంవుందా"

"వుంది మామ్మా! తక్కువ అయితే నీవు బదులు యిస్తావుగా!"

"బదులు చేయడమెందుకు రామ్. మీా ఆలూ మగలూ రెండు దినాలు కూలికిపోతే నాలుగు రూకలు సంపాదించలేరూ!"

"అట్టాగే చూదాం మామ్మా"

శివానాయక్ కల్పించుకుని చెప్పాడు. "రామ్‌భయ్యా, రేపు మనం రేగులగుట్టకుపోతే కావలసినన్ని రేగుపండ్లు యేరుకురావచ్చు. మార్కెట్టులో పావుశేరు చార్ అణా అమ్ముతున్నారు"

రామ్ భార్యవైపు ప్రశ్నార్థకంగా చూచాడు. ఆమె నవ్వుతూ అంది "మా రామ్‌వెంట నేను ఎంతటి అడవిలోకయినా సునాయాసంగా దూరి కాయలు పోగుచెయ్యగలను"

"అంగూర్ నువ్వు బయిలుదేరితే నేనూ వస్తాను" అంది తార.

జోరా కల్లులొట్టి పుచ్చుకుని లోటాలన్నీ మళ్లీ

నింపింది. ఘనేనాయకు లేచి కూచుని "అరే చీకులు నాకు లేకుండా తినేశారర్రా" అన్నాడు.

"లేదు బాబా! నీ కోసం కొన్ని దాచిపెట్టాను" అంది తార.

"బాబా కాజాలు చాలా బాగున్నాయి బాబా! కాసిని తినిచూడవూ!" అంగూర్ పొట్లంఅతనికిఅందించింది లోట్లు ఖాళీ అయ్యేసరికి బాగా చీకటిపడింది. అందరూ భారంగా లేచి ఇంటిదారి పట్టారు.

ఆ రాత్రి రామ్ కలతనిదురతో గడిపాడు. తల్లి, చెల్లెలు, తమ్ముడు అతని స్మృతిలో మెదిలారు. ఆవులు, లేగలు, మేకలు అతని కళ్ళముందు కదిలాయి. "నేను కూడ అమ్మవాళ్ళదగ్గరికేపోతే బాగుంటుందేమో!" అనుకున్నాడు అతను. "అక్కడకుపోతే నా అంగూర్‌కు సుఖం దొరకదు. ఆల్విన్‌లో వుద్యోగం చేస్తాను. నా అంగూర్‌ను సుఖపెడతాను" అనుకున్నాడు రామ్. మరుక్షణంలో అతను లేచి అగ్గిపుల్ల వెలిగించి అంగూర్ ముఖంలోకి పరీక్షగా చూచాడు. ఆమె నిద్రపోతూంది. ఆ వెలుగులో ఆమె ముఖం యెంతో ప్రశాంతంగా అగుపించింది. అగ్గిపుల్ల అవతలవిసిరి అతను ఆమెను కౌగిలిలోకి తీసుకుని "మేరీ ప్యారీ అంగూర్, మనంఎక్కడికీపోవద్దు, ఇక్కడేవుందాం" అంటూ అతను ఆమె బుగ్గలపైన, స్థనాలమీద ముద్దుల వర్షం కురిపించాడు.

# 2

మరునాటి ఉదయం లంగడా, శివానాయక్, తార, రామ్, అంగూర్ పొదలకాడ భోజనాలు ముగించి మధ్యాహ్నానికి తలా కాస్త మూటకట్టుకుని రేగులగుట్టకు బయలుదేరారు. లంగడా, శివానాయక్ ముందు దారితీశారు. తార చంకలో మంచినీళ్ళకూజా పెట్టి అంగూర్‌తో కబుర్లు చెపుతూ వయ్యారంగా నడుస్తోంది. అంగూర్ నెత్తిమీద అన్నంమూట వుంది. ఇద్దరూ చెయ్యిచెయ్యి కలుపుకుని నవ్వుతూ పేలుతూ జంటగా పోతున్నారు. పదిగజాల ఎడంలో రామ్ వారిని అనుసరిస్తున్నాడు. మసీదు దగ్గర రోడ్డు మలుపుతిరిగేసరికి వారికి చిన్నకారు యెదురైంది. తారను, అంగూర్‌ను సమీపించగానే కారు బ్రేకులు గరగరలాడాయి. కారు ఆగిపోయింది. ఆడవాళ్ళిద్దరు విస్తుపోయి చూస్తూ నిలబడ్డారు.

కారులోనుండి ఒక యువకుడు కెమేరాతో దిగి వారిముందుకుపోయి "మీరు నవ్వుతూ నావైపుచూడండి, మిమ్ములను ఫొటో తీస్తాను" అన్నాడు. తార నవ్వుతూ నిలబడింది. అంగూర్ వెనకకు తిరిగి భర్తదగ్గరకు పరుగెత్తింది.

"యేమైంది అంగూర్. వెనకకు వస్తున్నావుదేనికి?" అనడిగాడు రామ్.

ఆమె బెదురుతూ అంది. "రామ్ ఆ కారులో వచ్చినవాళ్ళు మమ్మలను ఫొటోతీస్తారట"

అతను చిన్నగా నవ్వాడు. కెమేరాపట్టుకున్న యువకుడు రామ్ ముందుకువచ్చి "మిష్టర్! మీ ఆడవాళ్ళను ఫొటోతీస్తాను. మీకు అభ్యంతరమా!" అన్నాడు.

రామ్ కనుబొమలు చిట్లిస్తూ "మా ఆడవాళ్ళ ఫొటోలు నీవు యేమిచేసుకుంటావు?"

"వీళ్ళు ఆ దుస్తులలో చాల అందంగా వున్నారు. వీళ్ళఫొటో యేదైనా పత్రికకు పంపితే మాకు బహుమతి వస్తుంది."

"నీకు బహుమతివస్తే మాకేమి నిండింది"

"లేదు మిష్టర్. నాకు బహుమతివస్తే దానిలో మీకుకూడా కొంత యిస్తాను."

"నీవు మళ్లా మాకు ఎక్కడ అగుపిస్తావు?"

కెమేరా యువకుడు రెండు నిమిషాలు ఆలోచించి "మిస్టర్ నీకు చదువువచ్చునా" అని అడిగాడు.

"ఉరుదూ, తెలుగు చదవనూ, వ్రాయనూవచ్చు" రామ్ సమాధానం చెప్పాడు.

యువకుడు తన అడ్రసువున్న చిన్న కార్డు రామ్ చేతికి అందించాడు. "నవీనస్టుడియోస్, అబిడ్ రోడ్డు." రామ్ అది చదివి యువకుడివైపు ప్రశ్నార్థకంగాచూచాడు.

అతను చెప్పుకుపోయాడు "మిస్టర్! మీరు స్టుడి యోకివస్తే నాకు వచ్చే ప్రతిఫలంలో మీకు కొంత యిస్తాను. కాని వెంటనే వస్తుందో రాదో చెప్పలేను. అది కూడా యెంతమొత్తం వస్తుందో నాకు తెలియదు. ఆ వచ్చినదానిలోమాత్రం మీకు సగం యిస్తాను."

రామ్ యువకుడినిగురించి ఆలోచించాడు. అతని రూపురేఖలను, మాటలనుబట్టి అతను పెద్దమనిషి అయి వుండాలని అనుకున్నాడు. "అయితే మాకుకూడా ఫోటో కాపీ ఒకటి యిస్తావా?" అని ప్రశ్నించాడు.

"ఒకటిగాదు, రెండు కాపీలు తీసుకుందురుగాని" యువకుడు వెంటనే సమాధానం చెప్పాడు.

రామ్ ఆ యువకునితో మాట్లాడుతున్నంతసేపూ అంగూర్ ఆ యువకుణ్ని నఖశిఖపర్యంతం పరీక్షగా చూచింది. సన్నగా, బారుగా, తెల్లగా జాతిబొమ్మలా వున్నాడు. నిగనిగలాడే క్రాపు, నల్లని కనుబొమలు, సన్నని పెదాలు, కళ్ళకు నల్లని అద్దాలు, విలువైన దుస్తులు ఎవరో గొప్పవారి అబ్బాయి అనుకుంది. తారకూడా వారి దగ్గరకు వచ్చి నిలబడింది. రామ్ వాళ్ళ యిద్దరిని అతని కెమేరా ముందు నిలబెట్టాడు అంగూర్ సిగ్గుపడింది. తార చిలిపిగా నవ్వింది. యువకుడు అంగూర్‌ను హెచ్చరించాడు? కాని ఆమె సిగ్గుపోలేదు. రామ్ ఆ యువకుని ప్రక్కకుచేరి "అంగూర్" అని పిలిచి, చిన్నగా నవ్వాడు. ఆమె మంద స్మితం చేసింది. కెమారా క్లిక్‌మంది. యువకుడు రామ్‌కు షేక్ హేండుయిస్తూ"మీ పేరేమిటి మిస్టర్" అని అడిగాడు.

రామ్ తెల్లబోయి "బాబూ, మీ పట్ల నేను అస భ్యంగా ప్రవర్తించానేమో!" అన్నాడు.

"లేదు మిస్టర్"

"నా పేరు రామానాయక్ బాబుగారూ!"

యువకుడు మందస్మితంచేస్తూ "నా పేరు శివరాం" అని చెప్పి వెళ్ళి కారులో యెక్కాడు. కారు కదలి పోతుంటే అంగూర్ శివరాంవైపు జాలిగా చూచింది. తార అమాయకంగా నవ్వింది. రాం చేతులు రెండూ జోడించి "సెలవు, బాబుగారూ" అన్నాడు

రేగులగుట్టకు చేరినతరువాత కాయలు బాగా ముది రినచెట్టు చూచిన శివానాయక్ చెట్టుపైకిపోయి కొమ్మలు దులిపాడు. పక్వానికివచ్చిన పండ్లన్నీ జలజల రాలాయి. లంగడా, రామ్, అంగూర్, తారా కిందపడిన పండ్లన్నీ ఏరి బుట్టలలో పోశారు. దూరదూరాలకుపోయి మంచి మంచి పండ్లు పోగుజేసి బుట్టలు నింపారు. అన్నాలు తిని చెట్ల నీడను విశ్రమించారు.

రామ్ అందరికీ దూరంగాపోయి ఒక చెట్టుమొదలను ఆనుకుని కూచుని బీడీముట్టించాడు. ఆ చెట్టు అతనికి బాగా జ్ఞాపకం. అతను మొదటిసారిగా అంగూర్‌ను కలుసుకున్నది ఆ చెట్టు దగ్గరే.

రెండు సంవత్సరాలక్రితం జరిగిన సంఘటనలు అతని స్మృతిపథంలో మెలిగాయి. తను అప్పట్లో తాజ్ ఫ్యాక్టరీలో పనిచేస్తూండేవాడు. ఆ రోజు ఆదివారం. తను మామూలుగా కట్టెలకోసం ఆ అడవికి వచ్చాడు. కట్టెలు కొడు

తూండగా సమీపంలో ఎక్కడో ఒక కోయిల కంఠంపాడు తోంది.

ఊరికీ ఉత్తరానా
ఒక వటవృక్షమున్నదమ్మా!
ఆ వటవృక్షం నీడల్లోనే
ఒక ఉయ్యాలా వున్నదమ్మా
ఆ ఉయ్యాలలో వూగేటి
అందాల బాలకమ్మా
వలపుగాడి మీద
మనసుపోయేనమ్మా
ఉయ్యాలలో బాల
వూగుతూ, తూగుతూ
వలపుగాడిమీద
పాటపాడేనమ్మా!

ఆపాట తరచూ లంబాడీపిల్లలు మామూలుగా పాడే పాటే. కాని ఆ కంఠంలో కోయిలనుమరపించే మాధుర్యం వుంది. అతను కట్టెలు కొట్టడం ఆపి ఆ పాట వినవచ్చే వైపుకు నెమ్మదిగా నడిచాడు. అల్లంతదూరంలో ఆమె పుల్లలు ఏరుతూవుంది. అతను అడుగులో అడుగువేస్తూ ఆమెను సమీపించాడు. చెట్టుచాటున నిలబడి ఆమెవైపు పరీక్షగా చూచాడు. అందాలబాల వలపులరాణి. అతని రాకను ఆమె గమనించినట్టులేదు. కట్టెలుపేర్చుతూ ఇంకా పాడుతూనేవుంది. అతను చెట్టుచాటునుండి ఆమె ఎదుటికి

నడిచాడు. ఆమె పాటఆపి బెదురుతూ అతనివైపుచూసింది”
“యేయ్! ఎవరునువ్వు?” ప్రశ్నించింది.

“నేనే” అన్నాడతను.

“నేనే గినే నా దగ్గరసాగవు, యెందుకువచ్చావు యిక్కడకు?”

“నువ్వు యెందుకు వచ్చావు?”

“యేయ్ మా నాయన్ని పిలుస్తా”

“ఓయ్! మా అమ్మను పిలుస్తా”

ఆమె చిన్నగా నవ్వింది. అతను శృతికలిపాడు.

“నువ్వు ఎక్కడో కొంటెవాడివిలా వున్నావు”

“లేదు. మంచివాడినే”

“అయితే నావంక అలా చూస్తావెందుకు?”

“నా కళ్ళకు నువ్వు దేవతలా కనుపిస్తున్నావు.”

ఆమె పేలవంగా నవ్వుతూ అంది. “హు-హూ నేను దేవతనూకాదు, దెయ్యాన్నీకాదు మనిషినే భయ్యా. కళ్లు బాగా తుడుచుకునిచూడు తెలుస్తుంది.”

అతను రెండు అడుగులు ముందుకువేసి కళ్లుతుడుచుకుని ఆమె ముఖంలోకి పరీక్షగా చూచాడు. ఆమె ఠీవిగా నిలబడింది. కళ్ళతో ఒకరినొకరు పలుకరించుకున్నారు. “నీపేరు యేమిటో చెప్పవూ?” అన్నాడు అతను మంద స్మితంచేస్తూ.

“అంగూర్”

“మీ నాయన పేరు?”

“చోటేనాయక్”

"మీ యిల్లు ఎక్కడా?"

"ఈ గుట్ట అవతల. మాతండా అక్కడేవుంది."

"నేనుకూడా నీతో మీ యింటికి వస్తాను"

"వద్దు. మా నాయనా, అమ్మా కోపంచేస్తారు."

"మీ నాయనతో మాట్లాడి నిన్ను పెండ్లి చేసుకుంటాను".

"లాభంలేదు. వందరూపాయలు సొమ్ములు పెట్టేవాడికే నన్నుఇచ్చి పెండ్లిచేస్తానని మానాయన అన్నాడు."

"అయితే నేను రెండువందలరూపాయల సొమ్ములు పెడతా."

"అబ్బా! కొయ్యి. నీకు అంత డబ్బు ఎక్కడిదీ?"

అతను సమాధానం చెప్పేలోపున ఎవరో 'అంగూర్' అని కేకపెట్టారు.

ఆమె భయపడుతూ అంది. "అదిగో, మానాయన వస్తున్నాడు. వెళ్ళిపో"

అతను నెమ్మదిగా అడిగాడు. "అంగూర్! రేపు వస్తావా యిక్కడికి?"

"రాను"

"పోనీ ఎప్పుడు వస్తావు?"

"ఏమో!"

"అయితే నేను చెపుతున్నా విను. మళ్ళీవచ్చే ఆదివారం యీ సమయానికి నేను యిక్కడే వుంటాను. నీవు కూడావస్తే మాట్లాడుకుందాం."

"అంగూర్" మరలా పిలుపు దగ్గరగా వినిపించింది. ఆమె అతన్ని గట్టిగా "ఫో ఫో" అంటూ తోసేసింది. అతను జాలిగా ఆమె కళ్ళల్లోకి చూచాడు. తప్పకుండా వస్తానులే, యిప్పటికి పరుగుతీయి" అంటూ ఆమె అతనిని వెనకకు తిప్పింది. అతను పది అడుగులు వేసి నిలబడి ఆల కించాడు.

"అంగూర్! ఏమిచేస్తున్నావు యిక్కడ?" అంది అవతలి కంఠం.

కట్టెలుమోపు పేరుస్తున్నాను బాబా!" అంగూర్ సమాధానం చెప్పింది. పదినిముషాల తరువాత తనుకూడా కట్టెలుమోపు కట్టుకుని యింటికిపోయాడు.

మళ్లీ ఆదివారంకోసం తనునిరీక్షించాడు. "చక్కగా ముస్తాబు అయి ఆ రోజున అంగూర్‌ను కలుసుకోవాలి" అనుకున్నాడు.

ఫ్యాక్టరీలో పనిచేసేప్పుడు కాకీనిక్కరు వేసుకుం టాడు తను, యింటికి రాగానే అవి మార్చి పైజామా, షర్టు వేసుకునే అలవాటు. అవికూడా బాగా పాతబడిపో య్యాయి. శనివారం సాయంకాలం అతను ఫ్యాక్టరీనుండి బస్సులో సరాసరి మోజంజాహీ మార్కెట్‌కుపోయి పాత బట్టల దుకాణంలో తనకు నచ్చిన నీలం ప్యాంటూ, పసుపు రంగు స్లాక్ షర్టు బేరంచేశాడు. దుకాణదారు అవి పది రూపాయలకు పైసా తక్కువలో రావన్నాడు. తను మారు మాట చెప్పలేదు. బయలుదేరి వస్తుంటే దుకాణదారు వెనుకకుపిలిచి "మెనిమిది రూపాయలకు యిస్తాను నీకు

కాబడితే తీసుకో" అన్నాడు. తను అయిదురూపాయలకు అడిగాడు. "లాభంలేదు" అన్నాడు దుకాణదారు. తను మరో అంగడికి దారితీశాడు. "ఆరురూపాయిలు ఇస్తావా?" అనడిగాడు దుకాణదారు. తను అయిదువేళ్ళుచూపెట్టాడు. "సరే తీసుకుపో" అన్నాడు దుకాణదారు.

మరునాడు ఠీవిగా ముస్తాబై "అమ్మా! నేను యీ రోజున సినిమాకు పోతున్నానమ్మా" అన్నాడు తల్లితో. ఆమె తననుచూచి విస్తుపోయింది" అరే! రాం! యింత చక్కని గుడ్డలు ఎప్పుడు కొన్నావురా!"అంది.

"కొనలేదమ్మా! అద్దెకు తీసుకున్నాను" అన్నాడు తను. పిల్లనగ్రోవి తీసుకుని తను సరాసరి అడివికి పోయాడు. అంగూర్ కోసం ఆ పరిసరాలన్నీ గాలించాడు. కాని ఆమె వచ్చినజాడలేదు. నిరుత్సాహంతో చెట్టుపైకిఎక్కి దూర దూరాలకు దృష్టిని పోనిచ్చాడు. యెక్కడో పాట వినిపిస్తూంది అదే పాట.

"వూరికీ ఉత్తరానా
ఒక వట వృక్షమున్నదమ్మా!"

తను తొందర తొందరగా చెట్టుదిగి పాటవినవచ్చే వైపుకు పోయాడు. ఆమె దిక్కులు చూస్తూ పాడుతూంది. తను పిల్లనగ్రోవిమీద ఆపాటకు శృతికలిపాడు. ఆమె ఆశ్చర్యంతో అతనివైపుచూస్తూఅంది. "అరేనీవు గొప్పోడివిలా వున్నావే"

"లేదు, అంగూర్! సామాన్యుడినే."

"మరి ఉద్యోగస్తుడిలా తయారయ్యావు"

"'"అవును, నేను తాజ్ ఫ్యాక్టరీలో పనిచేస్తున్నా"

"జీతం ఏమియిస్తున్నారు"

"నెలకు యాభై"

"నీకు అమ్మా. నాన్నా వున్నారా?"

"నాయనలేడు. అమ్మ, చెల్లెలు, తమ్ముడూ వున్నారు."

"మరి నీవు నన్ను పెండ్లి చేసుకోటానికి వాళ్ళు యిష్టపడతారా?"

"వాళ్ళ అభ్యంతరం యేమీవుండదు. అంగూర్"

ఆమె రెండు నిముషాలు ఆగి మళ్లీ అందుకుంది. "సరేగాని నీపేరు యేమిటీ?"

"రామానాయక్"

"మీ యిల్లు ఎక్కడా?"

"బంజారాగుట్టల్లో"

"అయితే మన పెండ్లి ఎప్పుడుజరుగుతుందంటావు?"

అతను నవ్వుతూ అన్నాడు. "మన పెద్దలతో మాట్లాడి కొద్దిరోజుల్లో చేసుకుందాం అంగూర్" అంటూ అతను ఆమెను దగ్గరకు తీసుకోబోయాడు. ఆమె వారించింది.

"రాం! మా అమ్మ యేమిచెప్పిందో తెలుసునా! పెండ్లికాకముందు తాకితే మన సంసారం అతకదట"

"హుష్, ఆ కబుర్లకు యేమివచ్చెలే! అంటూ అతను ఆమెను తన చేతుల్లో బంధించాడు. ఆమె పెనుగులాడింది. అతను విడిచిపెట్టలేదు.

రామ్ ఆలోచనలు ఆగిపోయాయి. మళ్లీ మరో బీడీ

ముట్టించాడు. అంగూర్ తనకోసం వెతుక్కుంటూవచ్చింది. అయ్యోరామ్! ఇక్కడ వంటరిగా కూచున్నావు యెందుకు? తారా వాళ్ళు నీకోసం యెదురుచూస్తున్నారు పోదాముదా, రామ్'' అంది.

అతను లేచి ఆమెను వెంబడించాడు. పండ్లబుట్టలు యెత్తుకుని ఇంటిదారి పట్టారు. మగవాళ్ళు ముగ్గురు కట్టెల మోపులు యెత్తుకున్నారు. అంగూర్, తారా రేగుపండ్లు చప్పరిస్తూ కబుర్లు చెప్పుకుంటూ కొంచెం వెనకపడ్డారు. తార ఫోటో ప్రస్తావన తెచ్చింది.

"అంగూర్! మనం ఫోటో తీయించుకున్నామని తెలిస్తే మా అమ్మా, నాయనా యేమంటారో''

"యేముంది దానిలో మనను అనడానికి, మనం దారిన పోతుంటే ఆయన యెవరో వచ్చి మనఫోటో తీసుకున్నాడు. కాని మనంతట మనము ఫోటో తీయించుకోలేదుగా తారా''

"యేమో! అంగూర్; మా పెద్దన్నయ్య నామీద చాలా కోపంచేస్తున్నాడు''

అంగూర్ చిన్నగా నవ్వింది. "మీ లంగడాకు ఆ మాత్రం ఆలోచనకూడా తట్టిందా!''

"అయ్యోరామ; పనికిమాలిన ఆలోచనలు వాడికి చాలా కలుగుతూవుంటాయి, అంగూర్''

"కలిగితే కలగనీ; రామ్, నేనూ వచ్చి మీ అమ్మతో నాన్నతో మాట్లాడతానులే. భయపడకు తారా''

తార సంభాషణ మార్చింది. "అంగూర్ మనను ఫోటో తీసిన ఆయన యెంతఅందగాడో చూచావా!"

అంగూర్ తనలో నవ్వుకుంది. "యేమోతారా, అతను యేమంత అందగాడు. సన్నగా, తెల్లగా వున్నాడు."

"అతను చాలా విలువైన దుస్తులు వేసుకున్నాడు"

"యింకా"

"చేతికి బంగారంగడియారం, వేళ్ళకు రెండు రాళ్ళ వుంగరాలు వున్నాయి"

"అయినా అతను యేమంత అందగాడుమాత్రం కాదు. అనారోగ్యంగా, తెల్లగా, నిర్జీవంగా వున్నాడు. అతనికంటే మా రామ్ నాకు అందంగా అగుపిస్తాడు"

"మీ రామ్ అతనికంటే ఆరోగ్యంగా వున్నాడంటావా"

"ఆః తప్పకుండా తారా. మా రామ్ నన్ను సునాయాసంగా పైకి యెత్తివేస్తాడు"

"అతను ఎత్తి వెయ్యలేడంటావా?"

అంగూర్ తారవైపు కొరకొరలాడుతూ చూచింది.

"యేయ్! తారా, పిచ్చి పిచ్చిగా మాట్లాడబోకు"

తార చిన్నగా నవ్వింది. "నేనేమి పిచ్చిగా మాట్లాడానంటావు అంగూర్"

"కాకపోతే: అతను యెవడు, నన్ను ఎత్తుకోడానికి? హుత్తేరీ"

తార మళ్లీ నవ్వింది. "పోనీలే అంగూర్, ఇక

నెప్పుడు అలా అననులే"

పండ్ల బుట్టలుచూచి జోరా, ఘనేనాయక్‌లు చాలా సంతోషించారు. "నేను మొన్నచూస్తే చెట్లన్నీ బోడిగా అవుపించాయి. ఇన్ని కాయలు యెక్కడ పోగుచేశా ర్రా!" అన్నాడు ఘనేనాయక్.

"బాప్ రే! భలే పసందైనపండ్లు పోగుచేసుకొచ్చారే! ఒక్కో బుట్ట ఎనిమిది శేర్లు పడుతుంది. చెరి ఎనిమిది రూపా యలు సంపాదించుకోవచ్చును" అంది జోరా.

లంగడా అటూ యిటూ తచ్చట్లాడాడు. ఫోటో సంగతి అమ్మకు చెపితేనేగాని అతని ఆరాటం అణగదు. తండ్రి వుండగా చెపితే తండ్రి తననే మందలిస్తాడు. అతను పితూరీ చేయడానికి అవకాశం కొరకు వేచి చూచాడు. అంగూర్ పండ్లబుట్టలు ఇంట్లో దింపి మంచినీళ్ళకు బయలు దేరింది. ఆమె సాగిపోతూ "తారా! నీవు నీళ్లకు రావడం లేదా!" అని ప్రశ్నించింది. తార దిగ్గునలేచి నిలబడింది. జోరా కుండకడిగి అందించింది. తార కుండ పుచ్చుకుని బయలుదేరుతూ "బాబా, నీవుకూడా రాబాబా, పోదాం" అంది తండ్రివైపుచూస్తూ. "నేనుకూడా దేనికిలే, అమ్మా! మీరు యిద్దరు పోయిరండి" అన్నాడు ఘనేనాయక్. తార కంఠంతగ్గించి నెమ్మదిగా అంది "బాబా, ఆ గ్రీన్ కాటేజీ వాళ్ళ అబ్బాయి బడా బద్మాష్ బాబా!"

"ఏం, ఏమన్నాడు మిమ్మల్ని?"

"మేము నీళ్ళుపడుతున్నంతసేపూ మా దగ్గరే నిల బడి పిచ్చి పిచ్చిగా వాగుతుంటాడు బాబా"

"యేడిశాడులే! మీరు యిద్దరుకలసి వాడిని పళ్ళు రాలగొట్టలేరూ"

"ఆ, ఎప్పుడో ఒకనాడు అంతపనీ చేస్తాం"

జోరా బయలుదేరి పోయింది. ఘనేనాయక్ కూడా వాళ్ళవెనక బయలుదేరిపోయాడు. లంగడాకు అవకాశం చిక్కింది. అతను ఆందోళనగా తల్లిని పిలిచి "అమ్మా, అమ్మా మనతార యివ్వాళ ఎంతపనిచేసిందో చూశావా!" అన్నాడు.

జోరా కొడుకువైపు విస్తుపోయి చూచింది.

"తార యేమిచేసింది బేటా!"

"ఫోటో తీయించుకున్నదమ్మా"

"దానికి పైసాలు ఎక్కడివి బేటా?"

"వాడు ఎవడో కారులోపోతూ రోడ్డుమీద వీళ్లను ఆపి ఫోటో తీసుకొన్నాడమ్మా!"

"వీళ్ళు అంటే ఎవరూ?"

"తారా, అంగూర్"

జోరా దవడలు నొక్కుకుంది. "అవ్వ, యీతార కేమి పోయేకాలం వచ్చింది! దీనికి యిప్పుడు ఫోటో ఎందుకు? అంగూర్ కేం దానికి పెండ్లి అయింది. మగడు వున్నాడు. మనతార యిప్పటినుండి ఫోటోలు తీయించు కోవటం మొదలుపెడితే దీనికి యింకా పెండ్లి ఎట్లా అవు తుందీ! తిరిగిరానీ, దీనిపని చెపుతా" అంది.

తార నెత్తిమీద నీళ్ళకుండ పెట్టుకుని నెమ్మదిగా వచ్చి ఇంటిముందు నిలబడింది. లంగడా అక్కడనుండి

నెమ్మదిగా అవతలకు జారుకున్నాడు. ఘనేనాయక్ కూతురు నెత్తిమీద కుండను అందిపుచ్చుకుని ఇంట్లో పెట్టాడు.

జోరా భర్తను నిలబెట్టి అడిగింది. "అరే! నాయక్ నీకూతురు తారసంగతి విన్నావా? రాస్తామీద నిలబడి ఫోటో తీయించుకున్నదంట! దీనికింకా పెండ్లిఅవుతుందా? దీనిని ఎవడు చేసుకుంటాడు. తాడిచెట్టులా పెరిగింది. దీని కేమైనా భయభక్తులు వున్నాయా? అయ్యో! అయ్యో! వయస్సువచ్చిన పిల్ల, దీనికి ఇంకా జ్ఞానం యెప్పుడు వస్తుం దంటా! ఇంతకీ ఆ పిల్ల అట్టా తయారవడానికి కారణం నువ్వే నాయక్. నీ అతిగారాబం దాన్ని యీకాడికి తెచ్చింది, రాలినోడా! పాడుమొహంవాడా! ముదనష్ట పోడా!" అంటూ భర్తను సాధించింది. ఘనేనాయక్ తెల్ల బోయి చూస్తూ నిలబడ్డాడు. తార గబగబా రామానా యక్ ఇంటికి పరుగెత్తి అంగూర్‌ను, రామ్‌ని వెంటబెట్టు కొచ్చింది.

రామ్ జోరాకు యెదురుగా నిలబడి నవ్వుతూ చెప్పుకు పోయాడు. "మామ్మా! మనవాళ్ళను ఫొటోతీసిన అతను అల్లరి, చిల్లరి వాడేమీకాదు. చాలా పెద్దమనిషిలా అగుపించాడు. మనవాళ్ళు బాగా అందంగా అగుపించేసరికి వీళ్ళను ఫొటోతీసి పత్రికకు పంపితే ఏదో పెద్ద బహుమతి వస్తుందని ఆశపడి అతను వీళ్ళఫొటో తీసుకుంటానని నన్ను అడిగాడు. అతని స్థితిగతులు అన్నీ విన్న తరువాత నేను అంగీకరించాను. ఇదుగో అతని అడ్రసుకూడా యిచ్చి వెళ్ళాడు" అంటూ రామ్ తన జేబులోనుండి కార్డుతీసి

చూస్తాడు.

ఘనేనాయక్ విరగబడినవ్వాడు. భార్యముందుకు పోయి "ఓసి పిచ్చిజోరా! నీది వట్టిమట్టిబుర్రేమే! మనతార ఫోటో పత్రికలో పడితే గొప్పగొప్పోళ్ళ బిడ్డలుకూడ మన తారను పెండ్లిచేసుకునేందుకు మనఇంటికి పరుగెత్తుకు రారూ! ఓసి నీతెలివి తగులబడ, ఆ మాత్రం గ్రహించ లేవూ! పైగా నన్నూ, తారను కలిపి తిడుతున్నావా! ఆ దేవుడు నిన్ను యెట్లాపుట్టించాడే! జోరా" అన్నాడు.

భర్తమాటలకు జోరా యేమీ సమాధానం చెప్ప లేకపోయింది. కాని ఒకనిమిషం గడచినతరువాత "ఆ నేనూ చూస్తానుగా! రేపటినుండి మన తారను చేసుకునేం దుకు మనఇంటికి ఎంతమంది వచ్చితిరిగిపోతారో!" అంది వ్యంగ్యంగా.

* * * *

మరునాడు ఉదయం తారా, అంగూర్ పండ్ల బుట్టలు నెత్తిన పెట్టుకుని అమ్మకానికి బయలుదేరారు. "అమీర్‌పేట చౌరస్తాకు పోదాము" అంది అంగూర్. "అబ్బే! వద్దు అంగూర్; అమీర్‌పేటలో జనం అట్టే వుండరు. అంతకంటె మనం పంజాగుట్ట చౌరాస్తాచూచు కొని హామంజిల్ మీదుగా కైరతాబాద్ చౌరాస్తాకుపోయి మెత్రమంజిల్ మీదుగా తిరిగివద్దాం" అందితార. అంగూర్ "సరే" నంది.

పంజాగుట్ట చౌరాస్తాలో నిలబడి అంగూర్ కేక పెట్టింది. "పండ్లో, రేగుపండ్లో! తాజారేగుపండ్లు" తార ఆ

కేక అందుకుని "తియ్యని రేగుపండ్లో! కమ్మని రేగుపండ్లో" అంటూ దీర్ఘంతీసింది. చుట్టూ పదిమంది చేరారు. బుట్టలు దించి కాలిబాటమీద పెట్టారు.

"యెట్లాయిస్తావు?" అడిగారు ఒకరు.

"ఏక్ అనా ఛటాక్" తార సమాధానం చెప్పింది.

అతను బేరం చేయబోయాడు. కాని ఆ లోపున పదిమందీ పది ఛటాకులు కొలిపించుకున్నారు. కొందరు పళ్ళు యేరుకోవడానికి ప్రయత్నించారు.

"బాబూజీ! బుట్టలో మీచేతులు పెట్టకండి. మేమే కొలిచి యిస్తాం" తార నిష్కర్షగా చెప్పింది.

బేరం హుషారుగా సాగింది. అరగంటలో బుట్టలు సగం ఖాళీ అయ్యాయి. ఒక యువకుడు పండ్లు తీసుకుని పైసలు యివ్వకుండా సాగిపోయాడు. అంగూర్ కేకపెట్టి పిలిచింది. "ఓ బాబూ, పైసలు యివ్వకుండానే పోతావూ!" అతను వినిపించుకోలేదు. అంగూర్ మళ్ళీ కేకపెట్టింది. "ఓ లాల్ అంగీబాబూ!" అతను వెనక్కుతిరిగి చూచాడు. అంగూర్ అడిగింది. "పండ్లుతీసుకుని పైసలు యివ్వక పోతివే" అతను నవ్వుతూ తిరిగివచ్చి పైసలు యిచ్చే శాడు.

పళ్ళు ఇంకా కొద్దిగా మిగిలివున్నాయి. ఇద్దరు బుట్టలు చంకలలో పెట్టుకుని షామంజిల్ వైపు బయలు దేరారు. అంగూర్ "పండ్లో, రేగుపండ్లో" అంటూ కేక పెట్టింది. తార అందుకుని "తియ్యాతియ్యని రేగుపండ్లు, పుల్లాపుల్లని రేగుపండ్లు, పసందైనా రేగుపండ్లు, యేక్

అనాకు ఛటాక్" అంటూ సరిగమలు వాయించినట్లుగా పాటపాడింది. దారివెంట పోయ్యేవారు నిలబడి వారివైపు చూచారు. కాయలు బేరంచేశారు. తార నిలబడి ఒకరిద్దరికి పండ్లు యిచ్చింది. ప్రక్కనే బంగళాలో ఒక యువకుడు అంగూర్‌ను లోపలకు పిలిచాడు. ఆమె చంకలోనున్న బుట్టలోకి తొంగిచూచాడు. అతనిదృష్టి ఆమె స్తనాల మీదికి పోయింది. ఆమె కొంగు సర్దుకుంది. "ఎలా యిస్తావు యీపండ్లు" అడిగాడు అతను. "యేక్ అనా ఛటాక్" అంది ఆమె. "యీపండ్లు ఎంతచెపుతావు" అంటూ అతను ఆమె స్తనాలను చూపాడు. ఆమె అమాయకంగా నవ్వింది. అతను తనచేతులను ఆమె స్తనాలమీదికి పోనిచ్చాడు. ఆమె చాచి అతనిచెంపమీద కొట్టింది. అతను బిత్తరపోయి దవడ సవరించుకున్నాడు. తార వచ్చి కలిసింది. ఆమె అంతా గమనించింది. "అంగూర్! అట్టు మాడిపోతుంది. తిరగెయ్యి జల్దీ, జల్దీ, అంది. అంగూర్ తాపీగా బయటకు నడిచింది. ఇద్దరూ యేకమై కిలకిలా నవ్వుకున్నారు.

ఖైరతాబాద్ చౌరస్తాలో ఇరానీ హోటలుకు పోయి బుట్టలు టేబిలుమీద పెట్టి తాపీగా కుర్చీలలో కూచున్నారు. సర్వరువచ్చి "ఏమికావాలి?" అని అడిగాడు. "పకోడీ" అంది తార. "చమూజా" అంది అంగూర్. అతను రెండు ప్లేట్లలో చమూజా, పకోడీ తెచ్చి వారి ముందు పెట్టాడు.

అవి యిద్దరు పంచుకుని తినివేశారు. తరువాత

చెరొక అరకప్పు ఛా తీసుకున్నారు. సర్వరు బిల్లుఅందిస్తూ తారవంకచూచి కన్నుకొట్టాడు. "అరే! బద్మాష్, జూతీసే మారేగా" అంది తార. అతను కిక్కురుమనలేదు. హోటలు నుండి బయలుదేరి యెర్రమంజిల్ దగ్గరకుపోయి కొంచెం సేపు కూచున్నారు. బేరం జోరుగా సాగింది. బుట్టలు ఖాళీ అయ్యాయి. ఇద్దరిదగ్గరనున్న డబ్బులన్నీ కలిసి లెఖ్ఖ పెట్టారు. తొమ్మిదిరూపాయలు, పైన చిల్లరావున్నాయి. అవి చెరిసగం పంచుకున్నారు.

సాయంకాలం ఇండ్లకు చేరుకునేసరికి ఘునేనాయక్ ఇంటిముందు రామ్, లంగడా, శివానాయక్, ఘునేనాయక్ జోరా కూచుని యేదో చర్చిస్తున్నారు. ఘునేనాయక్ ముందుగా కూతురును పిలిచాడు. "తారా, అంగూర్ మీ ఫొటోలు వచ్చినాయి, చూదురుగాసిరండి. తార సంబరాలు పడుతూ పరుగెత్తుకుంటూ వచ్చింది. అంగూర్ బుట్ట ఇంటిలోపల పెట్టి నీళ్ళకుండ పుచ్చుకుని బయలుదేరింది.

"అమ్మాయిలూ! యేమాత్రం సంపాదించుకు వచ్చేరే?" అడిగింది జోరా.

తార అంగూర్ వైపు చూచింది. ఆమె మందస్మితం చేస్తూ "మామ్మా! మాదగ్గర ఆ పండ్లు యెవరు కొననే లేదు మామ్మా! యేమిచేస్తాం తిరిగి తిరిగి చివరకు రెండు రూపాయలకు దుకాణంలోపోసి వచ్చాం. ఆ దుకాణదారుకూడా డబ్బులకు రేపురమ్మని చెప్పాడు. అబ్బా! నాకాళ్ళన్నీ పీక్కుపోతున్నాయి బాబూ" అంటూ కుండ

ఒకప్రక్కగా పెట్టి తను వాళ్ళదగ్గర చతికిల బడింది.

జోరా దవడలు నొక్కుకుని "అవ్వా! మీా బేరం బెండవిత్తులుకాను. నిన్నను అయిదుగురు మనుష్యులు అడివిలోపడి కాయలు పోగుచేస్తిరి, యీా రోజంతా మీారు ఇద్దరు తిరిగి అమ్ముకుని సంపాదించుకొచ్చింది రెండు రూపా యిలా? "బాగానేవుంది మీా బేరం. మీాకు మల్లేచేస్తే కూడు తిన్నట్టే, గుడ్డకట్టినట్టే, సన్యాసం పుచ్చుకోవాలిసిందే"

తార వుండబట్టలేక "అమ్మా, అమ్మా, అంగూర్ నిన్ను వుడికిలిస్తూందే. అన్నీ వట్టిదే. ఇదుగో నాకు అయిదు రూపాయిలు వచ్చాయి" అంటూ బొడ్లోనుండి సంచితీసి గలగల లాడించింది.

శివానాయక్ లేచి తారచేతిలోని సంచిని అందుకో బోయాడు. కాని తార ఆ సంచిని తండ్రిమీాదికి విసిరింది. ఘనేనాయక్ సంచిలోవున్న డబ్బులు క్రిందకు కుమ్మరించి నెమ్మదిగా లెఖ్ఖపెట్టాడు. "చారనే కమ్మి పాంచ్ రుపయా" అన్నాడు.

"మరి అయిదురూపాయలు అంటుందేమిటి?" జోరా ప్రశ్నించింది.

"ఛారనా పెట్టి ఇరానీహోటల్లో చా తాగామమ్మా!"

"మరి అంగూర్ డబ్బులేవీ?" ఘనేనాయక్ ప్రశ్నిం చాడు.

"అంగూర్ దగ్గరేవున్నాయి" తార సమాధానం.

యే, అంగూర్! అయిదురూపాయలు సంపాదించుకు వచ్చావా?" రామ్ ఆశ్చర్యం వెలిబుచ్చాడు.

"చారనాకమ్మి రామ్" అంగూర్ అంది.

"సరేగాని ఫోటోలో మీరు యెట్లాబడ్డారో చూచుకోరేమర్రా?" ఘనేనాయక్ ప్రశ్నించాడు. తార గబగబా లేచి తండ్రి చేతిలోవున్న ఫోటో లాక్కుంది. "అంగూర్, అంగూర్, నువ్వు ఎంతబాగున్నావో! చూడు, చూడు. అబ్బా! ఆకళ్ళు ఆలిచిప్పల్లా వున్నాయి. ఆబుగ్గలమీద సొట్టలుచూడు అవికూడ ఎంతస్పష్టంగాఅగుపిస్తున్నాయో, నీ ముందు నా ఫోటో యేమీ బాగాలేదోయ్ అంగూర్" అంటూ తార ఫోటో అంగూర్ చేతికి అందించింది.

అంగూర్ ఫోటో పరీక్షగా చూసి "అదేమిటితారా! నువ్వు ఫోటోలో ఇంత చక్కగా అగుపిస్తుంటే బాగుండ లేదనుకుంటావేమిటి? కోల ముఖము, పలుచని చెక్కిళ్ళు, చిలిపికళ్లు, పుచ్చపువ్వులు విరిసే ఆ నవ్వు ఎంతో బాగున్నావు. తారా" అంటూ ఆమె ఘనేనాయక్ వైపు తిరిగి "బాబా! నువ్వుచెప్పు,యీ ఫోటోలో మనతార అందంగా లేదూ?" అని ప్రశ్నించింది.

"లేకేమమ్మా! తారబాగానేవుంది. కాని దీనికి కూడా కాస్త కండ పట్టివుంటే నీ మాదిరిగానే పున్నమ నాటి చందమామలా అవుపించేది"అన్నాడు ఘనేనాయక్.

"యేమో! బాబా! నాకు తారే బాగుంది." అంది అంగూర్. ఆ తరువాత ఆమె భర్తవైపు తిరిగి "రామ్ నువ్వుచెప్పు తార యించక్కగాలేదూ!" అంది.

రామ్ సమాధానం చెప్పలేదు. అతను చిన్నగా నవ్వి వూరుకున్నాడు.

"తారకంటె నువ్వేఅందంగా వున్నావు-అంగూర్" అన్నాడు లంగడా.

తార లంగడావైపు కోపంగాచూస్తూ "నీమొహం. నిన్ను ఎవ్వరూ అడగలేదులే" అంది.

లంగడా చర్రునలేచాడు "ఇదుగో తారా! మొహం గిహంఅన్నావంటే నీమూతి చితకగొడతా!" అన్నాడు.

"నోడిశావులే! నోరుమూసుకు కూచోరా అబ్బీ!" అన్నాడు ఘనేనాయక్ కొడుకును మందలిస్తూ.

"రామ్‌భయ్యా! యీ ఫొటో పత్రికలో ఎప్పుడు పడుతుందంటా?" తార ప్రశ్నించింది.

"వచ్చే ఆదివారం సంచికలో పడుతుంది అంటు న్నారు తారా!" రామ్ సమాధానం చెప్పాడు.

జోరా కల్పించుకుని చెప్పింది "బేటా! రామ్! ఈవరస నాకేమీ బాగులేదు. తార పెండ్లికానిపిల్ల. దాని ఫోటో పత్రికలకు ఎక్కితే దానిని పెండ్లాడడానికి ఎవడైనా సందేహిస్తాడేమోనని అనుమానం"

రామ్ నవ్వుతూ అన్నాడు "అదేమీలేదుమాఁమ్మా! ఈ రోజుల్లో పత్రికలనిండా మనవాళ్ళఫొటోలుయెన్నెన్నో పడటం మనం చూస్తూనేవున్నాంగా: అలాటి సందేహం నీకు అనవసరం మాఁమ్మా"

"యేమో! బేటా! తారకుకూడా నీలాటి బుద్ధిమంతుడు దొరికితే అంగూర్‌లాగా అదికూడా సుఖపడుతుంది" అంది జోరా.

అంగూర్ లేచి కుండతీసుకుని "తారా! చీకటి పడుతూంది. నీళ్ళు తీసుకురావద్దూ" అంది. తార బద్ధకంగా వళ్ళు విరుచుకుని "నేను రాలేను అబ్బా! అమ్మ వస్తుంది. మీరు యిద్దరు పోయి తీసుకురండి అంగూర్"

"ఆ బాన ఎత్తుకుని ఆ గుట్టనేను ఎక్కలేనే తల్లీ! నావల్లకాదు. మీరే పోయిరండి అమ్మా!" జోరా బ్రతిమాలుతూ చెప్పింది.

రామ్ లేచి అంగూర్ చేతిలోని కుండ తీసుకుని "అరే! శివా! ఆ కుండ నీవు తీసుకురా, మనం యిద్దరం పోయి నీళ్ళు తెద్దాం" అన్నాడు.

శివానాయక్ మాట్లాడకుండా కుండతీసుకుని బయలుదేరాడు.

* * *

ఒకటవ తేదీ వచ్చింది. రామ్ అల్విన్‌లోపనికి కుదిరాడు. వారానికి పదిహేనురూపాయలు. ప్రతిశనివారం సాయంకాలం బట్వాడా యిస్తారు. అదనంగా పనిచేస్తే గంటకు ఆరు అణాలు చొప్పున లెఖ్ఖకట్టి యిస్తారు. అంగూర్ కూలికి పోకపోయినా వారి జీవితాలు సాఫీగానే సాగిపోతున్నాయి. ఒకనాటి సాయంకాలం నవీనస్టుడియోస్ కారు వచ్చి రామానాయక్ ఇంటిముందు నిలబడింది. కారుల్లో

నుండి శివరామ్ దిగి రామానాయక్ పాకముందుకు నడిచాడు. ఘనేనాయక్ శివరామ్‌ను పలుకరించాడు.

"బాబూజీ! మీకు ఎవరుకావాలి?"

"రామానాయక్ లేడూ?"

"పనిలోకిపోయి ఇంకా తిరిగి రాలేదు బాబూజీ. వచ్చే టైము అయింది. బహుశా వస్తూవుండి వుండాలి."

"ఎక్కడపనిచేస్తున్నారు ఆయన?"

"ఆల్విన్ కర్మాగారంలో బాబూజీ"

జోరా, పిల్లలు వచ్చి శివరామ్ చుట్టూ మూగారు. శివరామ్ ఒక ఉరుదూ వారపత్రిక ముఖచిత్రం తీసి చూపుతూ "యీ ఇద్దరూ, మీ అమ్మాయిలేనా ?" అన్నాడు ఘనేనాయక్ వైపు చూస్తూ.

"హాఁ, జీ" అన్నాడు ఘనేనాయక్.

జోరా వివరంగా చెప్పింది "బాబూజీ ఆ మొదట్లో నిలుచున్న పిల్ల మా రామానాయక్ భార్య అంగూర్' రెండోపిల్ల మా అమ్మాయి తార"

"అంగూర్, తార వీళ్ళపేర్లుకూడా బాగున్నా యమ్మా! యేరీ ఆ పిల్లలు ఇక్కడ అగుపించరేం?" అన్నాడు శివరాం.

"నీళ్ళు తీసుకురావడానికి పోయారు బాబూజీ; అదుగో వస్తున్నారు" అన్నాడు ఘనేనాయక్ రోడ్డు దిగువకు చూస్తూ. శివరామ్ వారివైపు తేరిపార చూచాడు. నెత్తిమీద నీటికుండలతో వారు భారంగా అడుగులు వేస్తు

న్నారు. సంధ్యాభానుని స్వర్ణకిరణాలు వారి ముఖాలమీద పడుతున్నాయి. శివరామ్ తన కెమేరా సరిచేసుకుని అంగూర్‌ను, తారను అక్కడే నిలబెట్టి వారివైపు నవ్వుతూ చూశాడు. అంగూర్ ముసిముసిగా నవ్వింది. తార కిలకిల లాడింది. శివరామ్ కెమెరా క్లిక్‌మంది.

అంగూర్ నెత్తిమీది కుండను ఘనేనాయక్ అంది పుచ్చుకుని వారి ఇంటిముందు పెట్టాడు. జోరా కూతురు నెత్తిమీది కుండను దించి లోపలపెట్టింది. వారపత్రికముఖ చిత్రం వారికి చూపుతూ శివరామ్ అన్నాడు. "ఏమమ్మా! మీ బొమ్మలు చూచుకోండి, ఎలావున్నాయో!" అన్నాడు. నీలైన రంగులలో ఆ బొమ్మలు వెలిగిపోతున్నాయి. శివరామ్ సమక్షంలో తనబొమ్మను చూచుకోడానికి అంగూర్ సిగ్గుపడింది. ఆమె నెమ్మదిగా జోరాను చాటుచేసుకుని మొహము, కళ్లు తుడుచుకుంది. "బహుత్ పసంద్ హై బాబూజీ" అంది తార.

శివరామ్ రెండు పదిరూపాయలనోట్లు తీసి ఒకటి తారచేతికి యిచ్చాడు. రెండవది అంగూరుకు అందించాడు. ఆమె ప్రశ్నార్థకంగా అతనివైపు చూచింది:

"మీ ఫొటో ముఖచిత్రంగా వినియోగించుకున్న వాళ్లు యిరవైరూపాయిలు మాత్రం పంపించారమ్మా, ఆ మొత్తం మీకే యివ్వాలనుకున్నాను. చెరిఒక పది వుంచుకోండి" అన్నాడు శివరామ్.

రామ్ అప్పుడే వచ్చాడు. అతను శివరామ్‌వైపు చూస్తూ "నమస్తే బాబూజీ" అన్నాడు.

శివరామ్ ప్రతినమస్కారం చేశాడు. అంగూర్ పది రూపాయిల కాగితం తెచ్చి భర్త జేబులో పెట్టింది. అతను ప్రశ్నార్థకంగా శివరామ్ వైపు చూచాడు. శివరామ్ మరొక సారి వివరాలన్నీ రామ్‌తో చెప్పాడు.

శివరామ్ మరొక సూచన చేశాడు. "మిస్టర్ రామా నాయక్, హైదరాబాదు నగరంలో ఎగ్జిబిషన్ జరుగుతుంది. దానిలో ప్రతిదినము అనేక సాంస్కృతిక ప్రదర్శనలు యేర్పాటు చేస్తున్నారు. మీలంబాడీల నృత్యంకూడా యేర్పాటు చేశాం. ఆ ప్రదర్శనానికి నన్ను కార్యకర్తగా నియమించారు. మీకు అభ్యంతరంలేకపోతే అంగూర్‌ను, తారను పంపించండి. నాలుగు దినాలు మాత్రమే రిహా ర్సల్సు వుంటాయి. అప్పుడు మేము కారు పంపుతాం. మీరు కూడా రావచ్చు. పని పూర్తికాగానే మళ్ళీ మీ అందరినీ కారులో తీసుకువచ్చి యిక్కడ దిగబెడతాం."

రామ్ ఘునేనాయక్ వైపు చూచాడు. అతను వెంటనే సమాధానం చెప్పాడు. "అలాగే బాబూజీ, నేనుగాని, మా రామ్‌గాని మా పిల్లలతోపాటు వస్తాం. సరేగాని బాబూజీ మా పిల్లలకు డబ్బులుకూడా ఏమైనా యిస్తారా?" అని ప్రశ్నించాడు. శివరామ్ కొంచంసేపు ఆలోచించి "యేమో మిస్టర్, ఆ విషయం నేను యిప్పుడు యేమీ చెప్పలేను. కాని నృత్యంలో పాల్గొన్నవాళ్ళకి మంచి దుస్తులుమాత్రం కుట్టించి యిస్తారు. అందులో బాగా నృత్యం చేసినవాళ్ళకు బహుమతులుకూడా యిస్తారు" అని చెప్పాడు.

జోరా ముందుకు వచ్చి అంది "బాబూజీ! వాళ్ళు పసివాళ్ళు, వాళ్ళకు నృత్యం చేయటం ఏమంత తెలియదు. నన్ను తీసుకుపోండి. నేనై తే సుభ్రంగా నృత్యం చేయగలను"

శివరామ్ తెల్లబోయిచూచాడు. రామ్ చిన్నగా నవ్వాడు. ఘనేనాయక్ భార్యనుద్దేశించి "ఒసే! ముసలి ముండా నీ పొట్టా, నువ్వూను మన్నుతిన్న పెంజేరులా ఒక పట్టాన కదలనే కదలవు. అయినా నీ నృత్యం ఎవడికి కావాలే అక్కడా! పిచ్చిదానా" అన్నాడు.

జోరా కోపంతో వుక్కిరి బిక్కిరి అయింది. "అరే! సవిటిమొహంనాయక్. నీకేమి తెలుసు నృత్యం సంగతి. నాకంటె వీళ్లు బాగా నృత్యం చేయగలరనేనా నీవు అనేది. యేదీ తాళం వెయ్యండీ చూదాం" అంటూ ఆమె పాట అందుకుంది. అంగూర్, తార చప్పట్లు కొడుతూ తాళం వేశారు.

తకధిమి—తకధిమి

ధిమితక—ధిమితక

తకతకా—ధిమితక

ధిమీధిమీ—తకాతకా

జోరా నృత్యంచేసింది. నేల దద్దరిల్లింది. అందెలు ఘల్లుఘల్లున మోగాయి. ఆమె ఉదరం ఊగిసలాడింది. స్తనాలు అదిరాయి. ఆమెకు ఆయాసం వచ్చేసింది. ఆమె రొప్పుతూ అంది.

"యేదీ చూదాం, వీళ్ళను అట్టా నృత్యం చెయ్యమనండీ! మాటలు చెప్పగానే సరా!" అంటూ ఆమె నలుగురి మొహాలలోకి చూచింది.

శివరామ్‌నవ్వుతూఅన్నాడు "ఏమమ్మోమ్‌జోరా,నువ్వు పెద్దదానివి, నీకు బాగా నృత్యం చేయడం తెలిస్తే తెలిసివుండవచ్చు. కాని ప్రస్తుతం ప్రదర్శనకు వయస్సులో వున్న పిల్లలను మాత్రమే తీసుకుంటున్నాము. మరొకసారి ఎప్పుడైనా అవకాశం వస్తే నిన్నుకూడా పిలుస్తామమ్మా!"

జోరా మూతివిరిచింది. "అవునులే బాబూజీ, వయస్సులోవున్న కుర్రాళ్ళకు వయస్సులోవున్న పిల్లలేకావాలి. నాబోటి ముసలివాళ్ళు ఎట్టాపనికివస్తారూ! నాపిచ్చగాని" అంది.

"హాత్తేరీ! చెత్తాకానీముండా, ఇక అంతటితో కట్టిపెట్టు" అన్నాడు ఘనేనాయక్.

తార తల్లిస్థితికి జాలిపడింది. ఆమె తనదగ్గరవున్న పదిరూపాయిల కాగితం "అమ్మా! యిది దాయిఅమ్మా" అంటూ ఆమెకు అందించింది. జోరా కోపంతో ఆ కాగితం నేలకేసి కొట్టింది. ఘనేనాయక్ క్రిందికివంగి ఆ కాగితం అందుకోబోయాడు. "అంతటితో ఆగు పాడుమొహం నాయక్! యేం, కల్లుఅంగడికి పోదామనుకుంటున్నావా? చాలు చాలు నీసంబరం" అంటూ ఆమె నోటుఅందుకుని బొడ్లోనున్న సంచితీసి దానిలోవేసుకుంది.

శివరామ్ అందరికి బై బై చెప్పి వెళ్ళికారులో కూచున్నాడు. అతను రామానాయక్‌ను కారుదగ్గరకుపిలిచి "మిస్టర్, రేపుసాయంకాలం మీరు ఒకసారి మాస్టుడియోకి రండి. రిహార్సల్సు వివరాలు మాట్లాడదాం" అనిచెప్పాడు. కారు కదలిపోతుంటే అంగూర్, తారా "బై బై బాబూజీ" అన్నారు. శివరామ్ వారివైపుచూచి మందస్మితం చేశాడు.

## 3

సాయంకాలం అయిదున్నరగంటలకు రామానాయక్ ఆబిడ్ చౌరస్తాలోని నవీనస్టుడియోస్‌కు వెళ్ళాడు. స్టుడియో మేడమీద రెండో అంతస్తులోవుంది. ముందుహాలులో నలుగురైదుగురు విజిటర్సు సోఫాలలో కూచుని కబుర్లు చెప్పుకుంటున్నారు. రామ్ హాలునలువైపులా పరికించాడు. నగ్నంగావున్న చిత్తరువులు, పెద్దఫ్రేములుకట్టిన లాండ్ స్కేప్సు దేశనాయకుల ఫొటోలు, రకరకాల బస్టులు గోడలకు వేళ్ళాడుతూన్నాయి. అతని రాకను అక్కడవున్నవారు మెవ్వరు గమనించినట్టులేదు. లోపలనుంచి ఒక యువకుడు కర్టెన్ తొలగించి రామ్ దగ్గరకువచ్చి "మీకు యేమి కావాలి?" అని ప్రశ్నించాడు:

"శివరామ్‌గారితో పనివుండి వచ్చాను"

"ఆయన లోపల పనిలోవున్నారు. నాలుగునిమిషాలు కూచోండి వచ్చేస్తారు" అనిచెప్పి ఆ యువకుడు తిరిగి లోపలికి పోయాడు. తరువాత నాలుగునిమిషాలకు శివరామ్ వచ్చి రామానాయక్‌ను మరో చిన్నగదిలోకి తీసుకుపోయి కూచోబెట్టాడు. శివరామ్ ఒక ఆల్బంతీసి దానిలో తాను కొత్తగా తీసిన అంగూర్, తారా నెత్తిమీద కుండలతోనున్న ఫోటోతీసి రాంకు చూపెట్టాడు.

"చాలాబాగుంది బాబూజీ"అన్నాడురామ్. శివరాం మందస్మితంచేసి "రామ్, నిన్ను నేను రామ్ అనిపిలిచినట్టుగానే నీవుకూడ నన్ను శివరాం అని పిలువు. అంతేగాని బాబూజీ గీబూజీ అని పిలవవద్దు. బాగుండదు" అన్నాడు.

రాం చేతులు నలుపుకుంటూ "అదెట్లా బాబూజీ" అన్నాడుఅమాయకంగా. శివరాం అతనిభుజంతట్టి"అదేమీ లేదు భాయ్. మనం యిప్పటికే మూడు నాలుగుసార్లు కలుసుకున్నాం. ఇకముందు ఎన్నోసార్లు కలుసుకుంటాం. ఒకటి రెండుమాటలతోనే మంచివారితో మైత్రి యేర్పడుతుందంటారు. నిన్ను ప్రప్రథమంగా చూచినప్పుడే నీపట్ల నాకు సదభిప్రాయం కలిగింది. బహుశా నాపట్ల నీకుకూడా అలాగే కలిగివుండాలని అభిప్రాయపడుతూన్నా" అంటూ అతను రాం ముఖంలోకి చూశాడు.

రాం ఆనందంతో "హాఁ, సచ్ బాబూజీ"అన్నాడు. శివరాం చిన్నగా నవ్వాడు. "మళ్ళీ అదేమిమాటయ్యా!" అంటూ అతను రాం వీపుమీద చరిచాడు.

"సరేలెండి యికనుండి అలాగే పిలుస్తాను."

"యెలా పిలుస్తావ్?"

"శివరాం అని"

"అచ్ఛా. అలా దారికిరా. సరేగాని రేపు మీ వాళ్ళ నృత్యప్రదర్శనలో డోలువాయించేవాళ్ళు ఒకరు కావాలి, కాస్త తెలిసినవారు యెవరైనా వున్నారా?"

"ఘనే నాయక్ వాయిస్తాడనుకుంటా"

"అబ్బే! ఆయన మరీ ముసలాడు"

"నేను వాయించగలను, కాని అంత బాగా రాదు"

"రిహార్సులలో తరిఫీదు కావచ్చుగా రాం"

"సరే! అలాగే ప్రయత్నిద్దాంలెండి. రిహార్సల్సు ఎప్పటినుండి ప్రారంభమవుతాయంటారు?"

"బుధ, గురు, శుక్ర, శని నాలుగు దినాలు రిహార్సల్సు పెడదాం. ఆదివారం మీ ప్రోగ్రాంవుంది"

"యీ నృత్య ప్రదర్శనలో పాల్గొనేవాళ్ళు ఎంత మంది వుంటారు?"

"అది యింకా నిర్ణయంకాలేదు రాం. రేపు సరోజినీదేవి హాలులో సమావేశం యేర్పాటుచేస్తున్నాం. బంజారాహిల్సు, పంజాగుట్ట, బేగంపేట, గాలీగూడా ప్రాంతాల నుండికూడా మరికొందరిని పిలుస్తున్నాం. వాళ్ళల్లో చురుకయినవాళ్ళను పదిమందినిమాత్రం ఎన్నికచేసి ఆ నాలుగు రోజులు వారికి తరిఫీదు యిద్దాం. అసలు ప్రదర్శనలో పాల్గొనే స్త్రీలు ఎనిమిదిమంది చాలు, యిద్దరిని ఎక్స్ట్రాగా వుంచుకుందాం"

"అయితే నేను పోవచ్చునంటారా ?"

శివరాం ఫోన్ తీసి రెండు టీలు పంపించమని చెప్పాడు. టీ తీసుకున్నతరువాత రాం మేడదిగి బస్సు స్టాప్‌వైపుకు నడిచాడు.

మరునాడు సరోజినీదేవి హాలులో జరిగిన సమావేశానికి లంబాడీ స్త్రీ, పురుషులు అనేకమంది వచ్చారు. వారిలోనుండి పదిమందినిమాత్రము జడ్జీలుయెన్నికచేశారు. ఎన్నికయినవారిలో అంగూర్, తారకూడా వున్నారు. రాం డోలు వాయిద్యగాడుగా ఎన్నిక అయ్యాడు. ఆతరువాత నాలుగు దినాలు వరుసనే రిహార్సల్సు జరిగాయి. తారా, అంగూరు, రాం చక్కగా తరిఫీదు పొందారు.

ప్రదర్శనరోజున ఎగ్జిబిషన్ ఆవరణలోని థియేటరు కిట కిటలాడింది. గ్రీన్‌రూములో అందరిని ముస్తాబుచేశారు. అంగూర్ ఇరానీసుందరిలా అందరి దృష్టిని ఆకర్షించింది. రాం మేకప్ అయిన తరువాత అద్దంముందు నిలబడి తన ప్రతిబింబం చూసుకున్నాడు. మీసం చక్కగావత్తారు. మొహాన కోటింగు, కళ్ళకు కాటుక, పెదవులకు లిప్‌స్టిక్, చెవులకు రింగులు, నెత్తిన సిల్కుతలపాగా, షెర్వానీ పైజామా, కాళ్ళకు నిగనిగలాడే స్లిప్పర్లు, అతను తన కళ్ళను తానే నమ్మలేకపొయ్యాడు, సాక్షాత్తూ తను రాజకుమారుని బోలివున్నాడు. అతను తన్మయత్వంలో రెండు క్షణాలు కళ్లు మూశాడు. "యీ మేకప్‌లో నేనే యింత బ్రహ్మాండంగావుంటే, నా అంగూర్ ఎలా వుందో అనుకున్నాడు. ఆ స్థితిలో అతను అంగూర్‌ను కలసికోనేందుకు తహతహలాడాడు.

స్త్రీల గదిలో యింకా మేకప్ జరుగుతూంది. అతను తలుపుతోసి లోపలికి తొంగిచూచాడు. ఆడవాళ్ళు కొందరు అర్ధనగ్నంగా వున్నారు. అంగూర్ ముస్తాబు పూర్తి అయ్యింది, రామ్ ముఖం తలుపుసందులోనుండి అగు పించగానే నగ్నంగావున్న ఆడవాళ్ళు గట్టిగా అరిచారు.

అంగూర్ అద్దంలో రాం ప్రతిబింబంచూచి వెంటనే వెనకకు తిరిగింది. ద్వారంలో రాం "వహ్వావహ్వా, నారామ్" అంటూ ఆమె అతనిదగ్గరకు పరుగుతీసింది. అతను ప్రక్కకు తప్పుకున్నాడు. ఆమె తలుపు తోసుకుని అతనిముందు నిల బడింది. అతను రెప్పనార్పకుండా ఆమె కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు "వావా నా అంగూర్ ఎంతమధురాతిమధురంగా వుంది" ఆమె బాహువులతో అతనిని పెనవేసుకుంది. గ్రీన్ రూం డైరెక్టర్లు పరుగెత్తుకుంటూ వారిదగ్గరకు వచ్చారు. అందులో శివరాం ఒకరు. అతను నవ్వుతూ అన్నాడు "అరే! భాయ్ రాం, మీ దుస్తులు నలిగిపోతాయి. కొంప తీసి ముద్దులుమాత్రం పెట్టుకోకండి. మీ మేకప్ అంతా మళ్లీ చెరిపెయ్యాల్సి వస్తుంది" అన్నాడు. రాం సిగ్గుపడి వెనకకు తగ్గాడు.

"అంగూర్, మా రామ్ ఎలా వున్నాడు?" శివరామ్ ప్రశ్నించాడు. అంగూర్ తలదించుకుని సమాధానం చెప్పింది "బహుత్ బహుత్ సుందర్ హై, బాబూజీ!"

ఆ భార్యాభర్తలనుచూస్తూ "ఎంత చక్కనిజంటా" అనుకున్నాడు శివరామ్.

"లైలా, మజ్నూ" అన్నారు ఒకరు.

"రతీ మన్మథులు" అన్నారు మరొకరు.

నృత్యప్రదర్శనకుముందు ఏకాంకనాటిక ప్రదర్శించారు. దానిలో అంగూర్ రాజకుమారిగాను, తార చెలికత్తెగాను, రామ్ రాజకుమారుడిగాను నటించారు. బ్యాక్‌గ్రౌండుపాటను అనుసరించి పాత్రలు ఒకరి తరువాత ఒకరుచక్కగా నృత్యంచేశారు. రాజకుమారి, కుమారుల వివాహంతో కథ సుఖాంతం అయింది. ఆ సందర్భంలో తార అమోఘంగా నృత్యంచేసి ప్రేక్షకులమన్ననలనుపొందింది.

అరగంట తరువాత బృందనాట్య ప్రదర్శన జరిగింది. అంగూర్, తారా మేకప్ కొద్దిగా మార్చుకుని దానిలో కూడా పాల్గొన్నారు. రామ్ ఢోలు వాయించాడు. ప్రదర్శన జరుగుతూన్నప్పుడు ప్రేక్షకులు హుషారుగా కరతాళ ధ్వనులు చేశారు.

ప్రదర్శనకు ఘనేనాయక్, జోరా, పిల్లలతోసహా వచ్చారు. తార నటనా, నృత్యము చూచి ఘనేనాయక్ ఆనందంతో తబ్బిబ్బు అయ్యాడు "నా బిడ్డ ధనవంతుల ఇంట్లో పుట్టివుంటే ఎంతగా రాణించేదో" అనుకున్నాడు అతను. జోరాకు ఆ నృత్యం యేమీనచ్చలేదు. "ఇదేమి నృత్యం కాలుకదపకుండా వళ్ళుకుదపకుండా కళ్ళు, చేతులు తిప్పినంతమాత్రాన అది నృత్యమవుతుందా! వీళ్ళ బొంద నృత్యం" అనుకుందామె.

ప్రదర్శన అనంతరం శివరామ్ స్వయంగా వారికి అందరికీ ఫలహారాలు యిప్పించి తనకారులో తీసుకుపోయి బంజారా గుట్టలలో వారి ఇంటిదగ్గర దిగబెట్టాడు. అప్పటికి

రాత్రి పదిగంగటలు దాటింది. అయినా రాం, అంగూర్ కూడా ఘనేనాయక్ ఇంట్లోనే కూచుని కబుర్లలో దిగారు.

"మాఅమ్మా మా ప్రదర్శనలు ఎలా వున్నా యంటావు?" రాం జోరాను అడిగాడు.

"ఎలా వున్నాయని చెప్పమంటావు బేటా ! ఆ నృత్యాలు నాకు మాత్రం నచ్చలేదు. కాని రాజకుమారుడి వేషంలో నీవుమాత్రం సరిగ్గా రాజకుమారుడిలాగే వున్నావు. మా పక్కనే కూచున్న ఒక మహారాష్ట్రి అమ్మాయి నిన్ను చూస్తూ గుటకలుమింగిందనుకో ! ఈ అబ్బాయి ఎవరు? ఈ అబ్బాయి ఎవరు ? అంటూ నన్ను నాలుగైదుసార్లు గుచ్చిగుచ్చి అడిగిందిరా అయ్యా" అంది జోరా.

"బాబా! నీ అభిప్రాయం యేమిటీ?" అంగూర్ ఘనేనాయక్‌ను అడిగింది.

"యేమోతల్లీ! మీ మాఅమ్మ మాదిరిగా నేను పెద్ద పెద్ద కబుర్లు చెప్పలేను. యీ నాటివరకు నా యాభై సంవత్సరాల జీవితకాలంలో యింత గొప్ప ప్రదర్శనలు చూచి వుండలేదు. ఇలాంటి ప్రదర్శనలు నవాబులు, రాజాలు, గొప్ప అధికార్లు మాత్రమే చూచి ఆనందించారు. నేటి కాలానికి మనముకూడా చూడగలిగాం. కేవలం చూడడమే కాదు. మీరు ముగ్గురు దానిలో పాల్గొన్నారు. తార నృత్యం చేస్తుంటే జనం చూచి ఎంత వుప్పొంగి పొయ్యారు? యేమి చప్పట్లు కొట్టారు? వ్హా-వ్హా ఆ దృశ్యం నా జీవితంలో మరచిపోలేననుకో. ఇదంతా ఆ బాబు శివ రామ్‌గారి చలువేననుకో" అన్నాడు ఘనేనాయక్.

తారకు, అంగూర్‌కు రెండేసి జతల దుస్తులు వచ్చాయి: తార అంది "అమ్మా! నా దుస్తులలో ఒకజత నువ్వు తీసుకో అమ్మా" జోరా మాట్లాడలేదు. ఘనేనాయక్ నవ్వుతూ అన్నాడు. "తారా! ఆ దుస్తులుగనక మీ అమ్మ వేసుకుంటే యెట్టావుంటుందో చెప్పమంటావా?"

"చెప్పు బాబా!" అంది తార.

"మీ అమ్మకు కోపం వస్తుందేమో?"

"రాదులే బాబా!"

"కట్లు బిగించిన పత్తిబేలులా"

అంతా గొల్లున నవ్వారు

"హత్తేరీ! పాడుమొహంవాడా" అంది జోరా.

మొత్తంమీద అందరికి శివరామ్‌పట్ల భక్తి గౌరవాలు యేర్పడ్డాయి. శివరామ్ తమపాలిటి దేవుడే అనుకొంది తార. జీవితపర్యంతం ఆయనకు కృతజ్ఞులుగా వుండక తప్పదనుకున్నారు రామ్ దంపతులు.

* * *

శివరాం ఆలోచనలు వేరు. అతను చిత్రకారుడు. ఎన్నో చిత్రాలు గీశాడు. వివిధనగరాలలో తనచిత్రాల ప్రదర్శనలు ఏర్పాటు చేశాడు. కొన్నింటికి బహుమతులు లభించాయి. మరికొన్ని అమ్ముడు పోయాయి. నవీనస్టుడియోస్ స్థాపించాడు. స్టుడియోమీద డబ్బుగడించాలనే అభిలాష అతనికి అంతగా లేదు. కాని స్టుడియోకివచ్చే అందమైనవారిని మొహమాటపెట్టి చిత్తరువులు తయారు చెయ్యడంలో అతను కృతకృత్యుడయ్యాడు.

అతను జూబిలీహిల్స్‌మీద అంగూర్‌ను ప్రప్రథమంగా చూచినప్పుడే అతని దృష్టి ఆమెమీద పడింది: అంగూర్‌లో మొగల్ చక్రవర్తిణి నూర్జహాన్ పోలికలు చాలా వున్నాయి. ధనుస్సులా వంపులుతిరిగిన కనుబొమలు, విశాలమైన కళ్ళు, సన్నని ముక్కు, చిన్నినోరు, సొట్టలు పడే బుగ్గలు, భారంగానున్న రొమ్ములు, సన్నని నడుము యీ అపర నూర్జహాను యిక్కడి లంబాడీలమధ్య ఎలా వూడిపడిందా అనుకున్నాడు.

అన్ని కోణాలనుంచి అంగూర్ అందచందాలను అతను పరీక్షించాడు. "సందేహంలేదు. ఆమె అప్సరస. ఒక దివ్యతార" అనుకున్నాడు. అంగూర్‌చిత్రం తయారు చెయ్యాలి. ఆమె అందచందాలను ప్రపంచానికి చాటాలి. తను ఖ్యాతిగడించాలి. ఆ అభిప్రాయంతోనే శివరామ్ అంగూర్‌భర్త రామానాయక్‌తో స్నేహం పెంపొందించుకున్నాడు. రామానాయక్ దంపతులతో ఆ స్నేహం నిలబెట్టుకోడానికి ఎంత ఖర్చుపెట్టవలసి వచ్చినా తను వెనుదీయకూడదనుకున్నాడు.

కొద్దిదినాలు గడిచాయి. ఒకనాటి సాయంకాలం నాలుగుగంటలకు నవీనస్టుడియోస్ కారు అల్విన్ కర్మాగారం గేటుముందు ఆగింది. శివరామ్ కారుకు తాళంవేసి సరాసరి మేనేజరుగదికిపోయి రామానాయక్‌ను కలసికునేందుకు వచ్చానని చెప్పాడు. మేనేజరు శివరామ్‌కు కుర్చీ చూపి సూపర్వైజరుకు కబురుచేశాడు. ఆయన వచ్చి మేస్త్రీలను రప్పించాడు. అందులో ఒకమేస్త్రీ వెళ్ళి రామా

నాయక్‌ను వెంటబెట్టుకు వచ్చాడు. రామ్ బిక్కుబిక్కు మంటూ మేనేజరుగదిలో అడుగుపెట్టాడు. శివరామ్ కుర్చీలో నుండి లేచి "అరే భాయ్ రామ్" అంటూ అతనిని కౌగలించుకున్నాడు. అక్కడ వున్నవారు అందరు వారివైపు విస్తుపోయి చూచారు. "గొప్పగా కారులోవచ్చిన ఒక ఘరానాయింటిబిడ్డ ఒక సామాన్య వర్కరును కౌగలించుకుంటాడేమిటీ?" అనే ఆశ్చర్యం వెల్లడించారు.

రామ్ ఫ్యాక్టరీ దుస్తుల్లో వున్నాడు. అవి నల్లగా మసిపట్టివున్నాయి. శివరామ్ కౌగిలిని సడలించుకుంటూ రామ్ అన్నాడు "బాబూజీ! నా బట్టలు ఖరాబుగా వున్నాయి. ఇక పదినిమిషాలలో వర్కర్లను వదులుతారు. మీరు అప్పటివరకు యిక్కడే కూచోండి ఆ తరువాత నేను బట్టలు మార్చుకు వస్తాను"

శివరామ్ రామ్ వీపుమీద చిన్నగా చరచి "ఫరవా లేదులే రామ్. మేనేజరుగారితో నేను చెపుతాను. నీవు పోయి బట్టలు మార్చుకుని త్వరగారా" అన్నాడు. ఆ తరువాత అతను మేనేజరువైపు తిరిగి "మేనేజరుగారూ, రామానాయక్‌తో మాట్లాడవలసిన పని వుంది. అతనిని పదినిముషాలు ముందుగా వదలడానికి మీకేమైనా అభ్యంతరమా" అని అడిగాడు.

మేనేజరు మందస్మితంచేస్తూ "తీసుకువెళ్ళండీ!" అన్నాడు. శివరామ్ మేనేజరుకు థాంక్సు చెప్పి వెళ్ళి కారులో కూచున్నాడు. రామ్ బట్టలు మార్చుకుని కారు

దగ్గరకు వచ్చాడు. శివరామ్ తన ప్రక్కసీటు డోర్ తెరిచాడు. రామ్ శివరామ్ ప్రక్కనే కూచున్నాడు. శివరామ్ ఒకచెయ్యి రామ్ భుజంమీద వేసి రెండో చేతితో స్టీరింగు పట్టుకున్నాడు.

ఫ్యాక్టరీగంట గణగణ మోగింది. పనివాళ్ళు, మేస్త్రీలు, ఇంజనీర్లూ, సూపర్ వైజర్లూ అంతా బయటికి వచ్చారు: సైకిళ్ళు, కార్లతో రోడ్డు నిండింది. కాలిబాట నిండా జనమే.

యువకులు కొందరు కారు దగ్గరలో చేరారు.

"అరేయ్ యీ కారు ఎవరిదిరా?" ఒక కంఠం ప్రశ్నించింది.

"నవీనస్టుడియోస్ వాళ్ళదిరా" మరొక కంఠం జవాబు చెప్పింది.

"అరేయ్! ఆ స్టుడియో మేనేజరు శివరామ్ మంచి జల్సారాయుడు లే!"

"పెద్ద ఆర్టిస్టురా"

"ఔను, విదేశాలు తిరిగివచ్చాడోయ్!" పారిస్‌లో ఆయన చిత్రప్రదర్శన యేర్పాటు చేశాడు"

"మరి యీ లంబాడాడు యిందులో ఎక్కాడెందుకు?"

"ఈ లంబాడోడి పెళ్ళాం భలే అందగత్తె!"

"దానికోసం యీాయనకు ఏస్తున్నాడేమో!"

"ఒరేయ్ పారిస్, లండన్ తిరిగివచ్చినవాడికి యీ లంబాడిదే కావలసి వచ్చిందటరా!"

"ఎవరైతే ఏం? చక్కదనమేగా కావాలిసింది"

"అవును ఆ భార్యా భర్తలు చక్కనివాళ్ళు. మొన్న ప్రదర్శనలో వేషాలు వేశారు. నిజంగా యిద్దరూ కూడ చాల బాగున్నారురా."

జనసమ్మర్థం తగ్గిన తరువాత శివరామ్ కారు బర బర లాడుతూ రోడ్డుమీద దూసుకుపోయింది. పంజాగుట్ట సమీపించినప్పుడు "బాబూజీ నేను ఇక్కడ దిగిపోతాను, కారు ఆపుచెయ్యండి" అన్నాడు రాం.

శివరాం కారు ఆపకుండా పోనిస్తూ "అరేభాయీ! రామ్, నన్ను బాబూజీ, గీబూజీ అనవద్దురా బాబూ అని పదేపదే చెపుతున్నాను. అయినా మళ్ళీమళ్ళీ అదే మాటా!" అన్నాడు.

రామ్ నాలుక కరచుకున్నాడు. "లేదు లేభాయ్; యికనుండి అనను లే, కాని మిమ్ములను శివరామ్ అని మాత్రం నేను పిలువలేను. అలా పిలవడానికి నా అంతరాత్మ ఒప్పడంలేదు."

"మరి ఏమని పిలుస్తానంటావు?"

"అది మీరే చెప్పాలి"

శివరామ్ లోలోపల నవ్వుకున్నాడు. సరేగాని రామ్ నీ వయెస్సెంతా?"

"ఇరవై అయిదు"

"అయితే నాకంటె రెండు సంవత్సరాలు చిన్న వాడివి. కాబట్టి దాదా అని పిలువు. ఆక్షేపణ వుండదు"

"అలాగే దాదా!"

కారు లకిడీకా పూల్, పబ్లిక్ గార్డెన్సు, నాంపల్లి దాటి అబీద్ సెంటరువైపు పోయింది.

"స్టుడియో దాటి వచ్చేశాం దాదా" అన్నాడు రామ్. శివరామ్ మందస్మితం చేశాడు. "బృందావన్ హోటలుకు పోయి టీ తీసుకువద్దాం రామ్" అని చెప్పాడు అతను.

టీ తీసుకున్న తరువాత శివరామ్ రామ్‌ను వెంట పెట్టుకుని రెడీమేడ్ బట్టల దుకాణంలోకి దారితీశాడు. "అరేరాం, నీకు కావలసిన బట్టలు మంచివి రెండు జతలు తీసుకో" అన్నాడు.

"సామాన్యమైన బట్టలు చాలు దాదా!"

"నీ యిష్టం, అవే తీసుకో"

రాం ఒక జత పైజమాలు, జత షర్టులు మాత్రం తీసుకున్నాడు. షాపువాళ్లు అవి ప్యాక్ చేస్తుంటే శివరాం ఆపి ఒక ప్యాంటూ, ఒక శ్లాక్ షర్టు చేర్చి ప్యాక్ చెయ్యమని చెప్పాడు. రాం మాట్లాడలేదు. కళ్ళతోనే శివరాంకు తన కృతజ్ఞత వెల్లడించాడు. ఇద్దరూ పోయి కారులో కూచున్నారు. షాపు కుర్రవాడు పార్సిలు అందించాడు. కారు కదలిపోయింది. రెసిడెన్సీవరకు పోనిచ్చి శివరాం "యెక్కడికిపోదాము రాం" అన్నాడు.

"మీ యిష్టం దాదా"

"టాంకు బండుకు పోదామా?"

"పోనీయండి"

అది మార్చినెల. ఎండలు యింకా ముదరలేదు. అయినా హైదరాబాదు, సికిందరాబాదు జంటనగరాల నాగరిక సమాజం సాయంకాలం అయ్యేసరికి హుస్సేన్ సాగర్ చెరువుగట్టున చేరాడు. శివరాం కారు ఒకప్రక్కకు తీసి ఆపి "కబుర్లు చెప్పు రాం" అన్నాడు.

"మీరే చెప్పాలి దాదా"

"అయితే నిన్ను ఒక్క విషయం అడగాలనుకుంటు న్నాను రాం"

"అడగండి దాదా"

"నీవు ఒకవారం దినాలు పనిలోకి పోకుండా సెలవు పెట్టలేవూ?"

రాం తెల్లబోయి చూచాడు. వెంటనే సర్దుకుని "ఎందుకో చెపితే"

"నేను చిత్రకారుణ్ణి అనే విషయం నీకు తెలుసుగా"

"తెలుసుననుకోండి"

"నీభార్య అంగూర్ చిత్రం గియ్యాలని వుంది."

"అయితే నేను శెలవుపెట్టటం దేనికి దాదా?"

శివరాం సంతోషంతో రాంని కౌగలించుకున్నాడు.

"అదినిజమేభాయ్, కాని నీవు లేకుండా నీ అంగూర్ అడుగు తీసి యివతల పెట్టదు. నీవు వుంటేనే ఆమె స్టుడియోకి వస్తుంది. నీవు లేకుండా ఆమెను స్టుడియోలో గంటలతరబడి కూచోబెడితే ఆమె తప్పకుండా

భయపడుతుంది. ఆ మూడ్‌లో ఆమె చిత్రం తయారు చేసినా అది రాణించకపోవచ్చు. కాబట్టి నీవు ఒకవారం దినాలు సెలవుపెట్టు రామ్, నీ నెలజీతం నేనే యిస్తాను."

"అలాగే శెలవు పెడతాను, దాదా!"

శివరామ్ ఇంకా చెప్పుకుపోయాడు. "రామ్, మీ దంపతులను యే ఘడియలో చూచానో అప్పుడే మీతో సన్నిహితంగా మెలగాలనే భావం నాకు కలిగింది. అందుకు కారణమేమిటో తెలుసునా! నీ నిష్కల్మష హృదయము, నీ నిరాడంబర జీవితము, నీ మంచితనమూ, ముఖ్యంగా నీ భార్యా సౌందర్యమూను.

రాం, నాకు స్వంతఅన్నలుకాని తమ్ముళ్లుగాని లేరు. నిన్ను జీవితాంతంవరకు నా స్వంతతమ్ముడిలాగానే చూచుకుంటాను. అన్నగారు తమ్ముడి భార్యాపట్ల చూపే ఆత్మీయత, సోదరభావమూ నేనూ నీ భార్యాపట్ల చూపుతాను రామ్. కాబట్టి నీవు నన్నుగురించి ఏవిధమైనదురభిప్రాయం ఏర్పరచుకోవద్దని కోరుతున్నా"

రాం ఆశ్చర్యంగా శివరామ్ కళ్ళల్లోకి చూచాడు. అతను రెండుచేతులతో శివరామ్‌ను గట్టిగా కౌగలించుకుని "దాదా! దాదా!"అంటూ తన తలను శివరామ్ గుండెలకు ఆన్చిఅటూ-యిటూ రుద్దాడు. శివరామ్‌కు చక్కలిగింతలు పెట్టినట్టుఅయ్యింది. అతను నవ్వుతూ రామ్‌తలనుగట్టిగాపట్టుకుని అతని కళ్ళల్లోకి చూస్తూ "యేమిటిరా యిదంతా!" అన్నాడు.

"దాదా! మా తెగలో ఒక ఆచారంవుంది దాదా!"

"ఏమి ఆచారము అదీ!"

"తమ్ముడు చనిపోతే తమ్ముడి భార్యా బిడ్డలను అన్న సాకాలి."

"శివరామ్ సంతృప్తిగా నవ్వాడు". అరేరామ్ ఆ యాచారం వుంటే వుండనీ. దానితో మనకు అవసరం వుండదు. ఎందుచేతనంటావా, నేను నీకంటె పెద్దవాడిని. ఇంకా వివాహం చేసుకోలేదు. ముందు ఎప్పుడైనా వివాహం చేసుకుంటానో లేదో చెప్పలేను. కాబట్టి ఒకవేళ నేను ముందు చనిపోయినా నా భార్యా బిడ్డలను నీవు పోషించే సమస్య లేదు. ఇక రెండవది నీవు నాకంటే చిన్నవాడివి. నాకంటె ఆరోగ్యంగా వున్నావు, నేను జీవించి వుండగానే నీవు చనిపోవడం జరగదు. ఆ విధంగా చూచినా నీభార్యాబిడ్డలనునేనుపోషించవలసినసమస్యరాదు" అన్నాడు

శివరామ్ మాటలలోని భావం రామానాయక్ కి సరిగా అర్థంకాలేదు. "దాదా నాదేమీలేదు. మీరు ఏమిచెయ్యమంటే అది చెయ్యడానికి సిద్ధం" అన్నాడు.

రామ్ ఒక నెలదినాలలో నేను విదేశాలకు పోవలసిన అవసరం వుంది! రోమ్ నగరంలో నా చిత్రాల ప్రదర్శన ఏర్పాటుచేస్తున్నాను. అక్కడనుండి తిరిగి రాగానే మీ కుటుంబానికి అవసరమైన సదుపాయాలన్నీ నేను యేర్పాటు చేస్తాను. ఆ తరువాత నీవు ఖల్వీన్ లోగాని, మరోచోటగాని వుద్యోగం చెయ్యవలసిన అవసరం వుండదు. మనం ఇద్దరం కలసి స్టుడియో చూసుకుందాం."

"దాదా, నీమేలు మరచిపోను. జీవితాంతంవరకు నీకు సేవచేస్తుంటాను. నేను నీకు కేవలం తమ్ముడిని మాత్రమేకాదు, సేవకుడినికూడా దాదా!"

"రామ్! యిక ఆ పాడుమాటలు కట్టిపెట్టు."

బాగా చీకటిపడినతరువాత కారు స్టారుచేసి రాణీ గంజ్, ప్యారడైజు, బేగంపేటలమీదుగా జూబిలీహిల్సుకు పోనిచ్చాడు. అక్కడ రామ్‌ను దిగబెట్టి కారు ముందుకు సాగింది.

కారు చప్పుడు విని అంగూర్ బయటికివచ్చి "రామ్, యిప్పటిదాకా ఎక్కడవున్నావు? నీవు యిలా ఆలస్యం చేస్తుంటే నేను భయపడిపోతాను రామ్" అంది.

"ఈ మాత్రానికి భయమెందుకు అంగూర్! శివరామ్ దాదా వచ్చి కారులో తీసుకెళ్ళి నాకుబట్టలుకొనిఇచ్చాడు. అంగూర్, యీ పొట్లంవిప్పిచూడు ఎంత బాగున్నాయో!" అంటూ పొట్లం అంగూర్‌కు అందించాడు. ఆమె లోపలికి పోయి దీపం పెద్దదిచేసి పొట్లం విప్పి అన్నీ పరీక్షగా చూసింది.

"చాలా బాగున్నాయ్ రామ్, యివన్నీ ఎంత ఖరీదు అయ్యాయి. నీకు యింతడబ్బు యెక్కడనుండి వచ్చింది?" అంటూ ప్రశ్నలు వేసింది.

"అంగూర్ యిలాంటి బట్టలు మన జన్మలో కొనగలమా! శివరామ్‌దాదా కొనిపెట్టాడు. అరవై రూపాయిలకు పైగానే అయ్యాయి."

"బాప్‌రే! అరవై రూపాయిలే,ఒక నెలజీతం అన్న మాట"

"సరేగాని అంగూర్, రేపటినుండి నేను ఫ్యాక్టరీకి పది దినాలు శెలవు పెడుతున్నాను."

"దేనికి?"

"మనం యిద్దరంకలిసి రోజూ స్టుడియోకి వెళ్ళాలి"

"ఎందుకో!"

"శివరామ్‌దాదా నీ చిత్రం గీస్తాడు"

"లోగడ రెండుసార్లు ఫోటోలు తీశాడుగా"

"ఇప్పుడు గీసేది ఫొటోకాదు అంగూర్, నిన్ను కూచోబెట్టి నీ చిత్రాన్ని చేతితో గీస్తాడు"

"నేను ఆయనగారికి ఎదురుగా కూచోవాలా?"

"అవును అంగూర్"

"యేమోనబ్బా! నేను కూర్చోలేను. నావల్ల కాదు రామ్."

"కూర్చోవాలి అంగూర్, నీ చిత్రం గయ్యాలని ఆయనగారికి చాల అభిలాషగావుంది. నేనుకూడా నీదగ్గరే వుంటాను."

"ఎన్ని దినాలు పడుతుందంటా?"

"వారంరోజులుఅని అంటున్నారు. పైన ఒకటిరెండు దినాలు పట్టినా పట్టవచ్చు."

"రామ్ నీవు సెలవు పెడితే మనకు జీతంరాదు, యిల్లు ఎట్టాగడుస్తుంది."

"యీ నెలజీతం శివరామ్‌దాదా ఇస్తానంటున్నాడు"

"నా చిత్రంగీసి ఆయనయేమి చేస్తారట?"

"బహుశా చిత్రప్రదర్శనలలో పెడతారు. ధరవస్తే అమ్మివేస్తారు"

"మరి మనకుకూడా యేమైనా యిస్తారా రామ్?"

"యేమో, ఆ విషయం నేను అడగలేదు. ఆయన చెప్పనూలేదు. బహుశా యిస్తాడనే అనుకుంటా"

"ఆయనగారికి ఎందుకు మనమీద ఇంత అభిమానం? ఆయన చాల మంచివాడు రామ్!"

"అవును అంగూర్"

ఆమె లేచి వెళ్ళి చెంబుతో నీళ్ళు తెచ్చి అతని ముందు పెట్టి "కాళ్ళూ చేతులు కడుక్కో రామ్, రొట్టెతిందాం" అంది.

"నాకు ఆకలిలేదు అంగూర్, కాఫీహోటల్లో చాల చాలా తిన్నాం."

"రామ్! నీకు పెట్టకుండ నేను తినలేను. పోనీ ఒక్క రొట్టె తిను. నేనూ ఒకటి తింటాను"

రామ్ లేచి కాళ్ళుచేతులు శుభ్రంచేసుకువచ్చాడు. అంగూర్ ఒక పళ్ళెంలో రెండు రొట్టెలు, ఒక గిన్నెలో వుల్లిపాయలపులుసు తెచ్చి అతనిముందు పెట్టింది. కబుర్లు చెప్పుకుంటూ యిద్దరూకలిసి రొట్టెలు, పులుసు పూర్తి చేశారు.

ఆ రాత్రి రామ్ ఆలోచనలోపడ్డాడు. తాను ఫ్యాక్టరీకి సెలవుపెట్టేసంగతి, శివరామ్, అంగూర్ చిత్రంగీస్తాడనే విషయము ఘనేనాయక్ దంపతులకు చెప్పడం అవసరమా,

కాదా, అన్న మీమాంస అతను ఎటూ తేల్చుకోలేక పోయాడు. అంగూర్‌ను సలహా అడిగాడు.

"యేమోరామ్, వాళ్ళు పైకి మనతో మంచిగానే వుంటారు. కాని లోపల మనం అంటే వారికి అసూయ."

అతను చిన్నగా నవ్వాడు. "మనమేమి భోగభాగ్యాలతో తులతూగుతున్నామని వారుమనలనుచూచి అసూయ పడుతున్నారంటావ్."

"ఏమో రామ్, మొన్న ఒకరోజున జోరా యేమన్నదో తెలుసునా, నీకేమితక్కువ అంగూర్ నీ మగడు ఉద్యోగం చేస్తున్నాడు. నిన్ను కూలికీ, నాలికీ పోనియ్యడుగాఅంది. జోరా పెద్దదికదాఅంటే అన్నదిలే అని సరిపెట్టుకున్నా. కాని యీరోజు తారకూడా అదేమాట అంది రామ్. ఇక వాళ్ళ రెండోవాడు ఆ శివానాయక్ వున్నాడు చూడు, ఆ వెధవకి ఈ మధ్య బాగా పొగరు ఎక్కువ అయింది. చీటికిమాటికి నన్ను రాసుకు తిరగడానికి ప్రయత్నిస్తున్నాడు. ఎప్పుడో సమయంచూచి వెధవను దవడ వాయగొడతా" అంది.

రామ్, చిన్నగా నవ్వాడు "పోనీలే అంగూర్, వాళ్ళతో మనం అసలు ఏమీ చెప్పవద్దు"

"ఒకవేళ వాళ్ళే మనను అడుగుతారు. అప్పుడు ఏమి చెప్పాలి?"

రామ్ రెండు నిముషాలు ఆలోచించాడు "మనం ఎందుకు భయపడాలి అంగూర్, యదార్థం చెప్పేద్దాం.

మనమేమీ కానిపని చెయ్యడంలేదుగాదాచిపెట్టుకోడానికి"
అన్నాడు.

మరునాటి ఉదయం రామ్ ఘనేనాయక్‌ను కలుసుకుని "బాబా నేను ఫ్యాక్టరీకి పదిరోజులు సెలవుపెడుతున్నాను" అని చెప్పాడు.

ఘనేనాయక్ విస్తుపోయి చూచాడు. "దేనికి బేటా?"

"శివరామ్‌గారు మన అంగూర్ చిత్రం గీస్తారట. అందుకు పది దినాలు సెలవుపెట్టి నేనూ, అంగూర్ రోజూ వారి స్టుడియోకి పోవలసివుంటుంది"

"అరే! ఆ ఉద్యోగం లేకలేక దొరికిందిగదా! యిప్పుడు పది దినాలు సెలవుపెడితే అదికాస్తా వుంటుందో- వూడుతుందో?"

"ఫరవాలేదు బాబా! అక్కడ పనిచేసేవారిలో చాలమంది అవసరమైనప్పుడు సెలవులు పెడుతూనే వున్నారు. సెలవులు అయినతరువాత వారిని మళ్ళీ పనిలోకి తీసుకుంటున్నారు,"

శివరామ్ తన చిత్రం గీస్తాడని వారందినాలు తనూ రామ్‌కలిసి నవీనస్టుడియోస్‌కి పోవలసివుంటుందని అంగూర్ తారకు, జోరాకుకూడా చెప్పింది. తార సంతోషం వెలిబుచ్చింది. జోరా ప్రశ్నలు కురిపించింది.

"అంగూర్. నీబొమ్మ గీసుకున్నందుకు శివరామ్ గారు నీకు యేమి యిస్తున్నారు?"

"యేమో మామ్మా! మా రామ్ నాకావిషయా లేమీ చెప్పలేదు."

"మరి రామ్ వుద్యోగానికి సెలవు పెడితే మీ భుక్తి ఎలా గడుస్తుంది?"

"యీనెల జీతం శివరామ్‌గారు యిస్తామన్నారట మామ్మా!"

"రామ్‌కి మళ్ళీ ఆ ఉద్యోగం దొరకకపోతేనో!"

"యేమో! అప్పుడు ఆలోచించుకుందాం."

జోరా చిన్నగా నవ్వింది. "మీరు ఆలోచించేదేముందీ? ఆ శివరామ్‌గారే యేదో ఉద్యోగం చూపెడతారు! ఆయనగారు పెద్ద జాగీర్దారుట."

"నాకు ఆ విషయం తెలియదు మామ్మా!"

ఆ సాయంకాలం రామ్ ఫ్యాక్టరీకి సెలవుపెట్టి స్టుడియోకిపోయి శివరామ్‌ను కలుసుకున్నాడు. మరునాటి ఉదయంనుండే చిత్రం గీయడానికి ఏర్పాట్లు జరిగాయి. లోగడ అంగూర్, తారా నీటికుండలు నెత్తిమీద పెట్టుకుని వుండగా శివరామ్ ఒక ఫోటో తీశాడు. అదే ఫోజులో అంగూర్ చిత్రం తయారుచెయ్యాలని అతని సంకల్పం. మొదటి రోజున అంగూర్ నెత్తిమీద నీటికుండలు ఒకదాని మీద ఒకటి పేర్చి నిలబడింది. శివరామ్ కేన్వాస్‌మీద కుంచెతో ఆకారం గీశాడు. రామ్ కొంచెం ఎడంగా సోఫాలో కూచున్నాడు.

రెండుగంటల తరువాత శివరామ్ ముగ్గురికీ భోజనాలు యేర్పాటుచేశాడు. భోజనాల అనంతరం కొంతసేపు విశ్రాంతి తీసుకుని మళ్ళీ చిత్రం గీసే పనిలోలీనమయ్యాడు.

ఒకటి రెండు దినాలు గడిచాయి, తార అంగూర్‌ను అడిగింది. "అంగూర్ చిత్రం గీయటమంటే నిన్ను కుర్చీలో కూచోబెట్టి ఆయన నీ బొమ్మ గీస్తారుకదూ!"

"అబ్బే! లేదు తారా! నేనేమో కుండలు నెత్తిమీద పెట్టుకుని కదలకుండా నిలబడతాను, శివరామ్‌గారు కుంచె పుచ్చుకుని కేన్వాస్‌మీద బొమ్మ గీస్తారు. ఆయనగారి కళ్లు నా మీద, కుంచె కేన్వాస్‌మీదా వుంటాయి. రామ్‌కొంచెం ఎడంగా కుర్చీలో కూచుని చూస్తూవుంటాడు."

"అయితే ఈ రోజు నేనుకూడావచ్చి చూస్తాను, అంగూర్"

"సరే! అలాగే పోదాములే! మరి మీ అమ్మ ఏమంటుందో"

"మా అమ్మ అనడానికి దీనిలో తప్పు ఏముంది అంగూర్, మనం యిద్దరంకలిసిపోయి కలిసివస్తాంగదా!"

# 4

రామానాయక్, అంగూర్ స్టుడియోలో ప్రవేశించగానే శివరామ్ వారికి ఎదురు అయ్యాడు. అంగూర్ వెనక తారకూడావుంది. శివరామ్ నవ్వుతూ అన్నాడు. ఓహో! తారకూడా దిగివచ్చిందే. తారా! ఈ రోజు నీ చిత్రంకూడా వెయ్యమంటావా?"

తార ముసిముసిగా నవ్వుకుంది. "నా చిత్రం ఎందుకులే బాబూజీ!"

"అయితే అంగూర్ చిత్రం ఎందుకుగాను వేస్తున్నా నంటావు"

"ఏమో!" అని ఆమె అంగూర్ వైపు చూచింది. వెంటనే మళ్ళీ అంది "అంగూర్ చాలా బాగావుంటుంది బాబూజీ!"

"అయితే నీవు బాగాలేవా? తారా!"

"నేను బాగావుంటే మీరు నా చిత్రమే వేసే వారుగా. బాబూజీ"

శివరామ్ ఆశ్చర్యంగా తారవైపు చూచాడు. ఆమె సంతృప్తిగా నవ్వింది.

"తారా! నేను ఒక సలహాయిస్తాను, వింటావా?"

"తప్పకుండా వింటాను. బాబూజీ!"

"నిన్ను డాన్సుస్కూలుకు పంపుతాను, మీ అమ్మా నాయనా అంగీకరిస్తే"

"ఏమో! మా అమ్మ అంగీకరిస్తుందని నేను అను కోను బాబూజీ!"

"ఏం, ఎందుకు అంగీకరించదు"

"నాకు యింకా వివాహం కాలేదుకదండీ"

"అయినా మీవాళ్ళతో సంప్రతించు"

"అలాగే బాబూజీ!"

అంగూర్ కుండలు నెత్తిమీద పెట్టుకుని నిలబడింది. కాన్వాసుమీద శివరామ్ కుంచె ఆడించాడు. రామ్, తారా చూస్తూ సోఫాలలో కూర్చున్నారు. తారకు విసుగు పుట్టింది. "రామ్‌భయ్యా! నేను ఇంటికి పోతాను" అంటూ

ఆమె లేచినిలబడింది. రామ్ శివరామ్‌వైపు చూచాడు. అతడు పరీక్షగా కాన్‌వాసుమీద కుంచ జరుపుతున్నాడు. "పోదువుగాని కొంచంసేపుఆగు తారా" అన్నాడు రామ్. తార మళ్ళీ సోఫాలో చతికిలబడింది.

శివరామ్ కుంచ ప్రక్కనపెట్టి తారవైపు చూస్తూ అడిగేడు "తారా, వెళ్ళిపోతావా?"

"అవును బాబూజీ. మా అమ్మకు చెప్పకుండా బయలుదేరి వచ్చాను. ఆలస్యమైతే కోపం చేస్తుందేమో!"

శివరామ్ చిన్నగా నవ్వాడు. "ఆమాత్రం భయ భక్తులుండటం మంచిదే. సరేగాని తారా, నీవు ఎంతవరకు చదువుకున్నావు?"

"ఆఁ. నాచదువు ఎంత బాబూజీ! కొద్దిగా చద వనూ, వ్రాయనూ వచ్చు"

"అంతేనా?" అంటూ అతను రామ్ ముఖంలోకి చూచాడు.

"ఆమెకూడా అంతే దాదా!" అన్నాడు రామ్.

శివరామ్ అక్కడనుండి మరోగదిలోకి పోయి ఉరుదు, తెలుగు వారపత్రికలు కొన్ని తెచ్చి తారకు యిచ్చాడు. "వీటిలో మంచికథలున్నాయి. నీకు తీరికగా వున్నప్పుడు ఆ కథలు చదువుకో తారా!" అన్నాడు. అతను రామ్‌వైపు తిరిగి "రామ్, తారను అమీర్ పేటకు పోయేబస్సు ఎక్కించిరా"

"యివిగోడబ్బులు"అంటూ అతను ప్యాంటుజేబులో నుండి కొంత చిల్లర తీసి రామ్‌చేతిలో పెట్టాడు. రామ్

తారను వెంటబెట్టుకొని మేడ దిగివెళ్ళాడు. శివరామ్ అంగూర్ వైపుచూచి "అంగూర్ కాళ్ళు నొప్పులుగా వున్నాయా?"

"లేదు. బాబూజీ!"

"ఆ కుండలు క్రిందపెట్టి నీవుకూడా కాసేపు విశ్రాంతి తీసుకో. రామ్ వచ్చినతరువాత మళ్ళీ ప్రారంభిద్దాం" అన్నాడు అతను. సోఫాకు చేరబడి సిగరెట్ తీసి ముట్టించాడు. అంగూర్ ఎడంగాకూచుంది. అతను అడిగాడు. "అంగూర్ సిగరెట్ కాలుస్తావా?"

ఆమె మందస్మితం చేసింది. "లేదు బాబూజీ"

"తార"

ఆమె సందేహించింది. "సమాధానం చెప్పవేమీ" అన్నాడు అతను. ఆమె నవ్వుతూ అంది "తార బీడీలు కాలుస్తుంది బాబూజీ"

"మన రిహార్సల్సు జరిగినప్పుడు తార ప్రక్కకు పోయి బీడీలు కాల్చడం నేనూ చూచాను" అన్నాడు.

రామ్ తిరిగి వచ్చాడు. "తీరికగా కూర్చున్నారేం దాదా" అన్నాడు.

"రామ్! నీవు దగ్గర లేకపోతే నీ అంగూర్ బిక్కు బిక్కు మంటూ చూస్తుంది. ఆ స్థితిలో నాకుంచ ఆడదు" అన్నాడు శివరామ్.

రామ్ చిన్నగా నవ్వాడు. అంగూర్ నాలుక కరచుకుంది. మధ్యాహ్నం భోజనాల అనంతరం యేదో అవసరమైన పని వున్నదని శివరామ్ కారుతీసుకుని బయటికెళ్ళాడు.

రామ్, అంగూర్ బస్సులో ఇంటికి చేరుకున్నారు. ఆసమయానికి ఘనేనాయక్ ఇంటిముందు పెద్ద రగడ జరుగుతూంది. రాం సరాసరి అక్కడికే వెళ్ళాడు. ఘనేనాయక్, జోరా, తారా, చిన్నపిల్లలు వున్నారు. రెండు నిముషాలు అందరూ మౌనంగా వుండి పోయారు.

జోరా నెమ్మదిగా ప్రారంభించింది. "అరే, బేటా రాం తారకు నాట్యం నేర్పిస్తానన్నావా?"

రాం విస్తుపోయి చూచాడు. "నేనేమి నేర్పిస్తాను మామ్మా, నీవు, బాబా అంగీకరిస్తే శివరాంగారు నేర్పిస్తామన్నారు."

"అది సరేగాని బేటా! యీ పెండ్లికాని పిల్లను నాట్యాలకు తిప్పితే మనపరువుకాస్తా ఆమూసీలో కలసిపోదూ!"

రాం సమాధానం చెప్పలేదు. ఘనేనాయక్ అందుకున్నాడు "యీ జంటనగరాలలో పెండ్లికాని పిల్లలు యెవ్వరూ నాట్యం నేర్చుకోవడంలేదంటావా? నువ్వు ఒకసారి ఆ స్కూలుకుపోయి చూస్తే తెలుస్తుంది. ఎంతమంది అక్కడ నాట్యం నేర్చుకునేందుకు వస్తుంటారో"

"అరే రసపిచ్చమగడా! వాళ్ళతో మనకు వంతు అంటరా! వాళ్ళకేం? వాళ్ళు కలవాళ్ళు. కార్లమీద వచ్చి దిగుతారు. మళ్ళీ కార్లలో పోతారు. ఇక మనమో రెక్కాడితేనేగాని డొక్క ఆడదయ్యే. అట్లాంటివాళ్ళకు నాట్యాలుకూడా ఎందుకురా తెలివితక్కువ నాగమ్మా! ఏమైనాసరే! నా పిల్లకు పెండ్లికానిదే దానిని బయటికి

పోనిచ్చేదేలేదు. అలాచెయ్యకపోతే నేను బడేనాయక్ కూతురినే కాదు." అందిజోరా నిష్కర్షగా. ఘనేనాయక్ తగ్గాడు.

'దానికేముంది మామ్మా! అది అంతా మీయిష్టం' అన్నాడు.

"జోరా తగ్గిమాట్లాడింది." బేటా రాం! నీలాటిబుద్ధిమంతుణ్ణి, రెండువందలు సొమ్ములు పెట్టేవాడిని ఎవడినైనా చూడు, నేనుకూడా ఒక వందయిస్తాను. త్వరలోముడిపెట్టి యీ పాపిష్టిదానిని అవతలకు పంపించివేద్దాం. అయ్యో అయ్యో! యీ గాలిబొంగరం పిల్లతో నేను వేగలేను బాబూ! ఓరి రామయ్యతండ్రీ, యీ గండం ఎట్లాగడుస్తుందో, దీనిపెండ్లిగురించి నేను రాత్రింబవళ్లు చీకిపోతున్నా గదా!" అంటూ ఆమె చీదివేసింది. పెదవులు వణికాయి. నోటినుండి మాట పెగలలేదు.

రాం జాలిగా ఆమెవైపు చూచాడు."అంతగాభరా దేనికి. మామ్మా! తారకు యింకా పదహారు సంవత్సరాలేగా, ఎక్కడైనా మంచికుర్రవాణ్ణి చూసి త్వరలో పెండ్లి చేదాం. యీమాత్రానికి అంత బెంబేలు పడాలా మామ్మా" అన్నాడు.

"వేమోనారాయనా! నీ సత్యవాక్కు ఫలించాలి గదా బాబూ!" అంది జోరా నెమ్మదిగా.

ఆ తరువాత తార ముసుకుపెట్టి భోజనంకూడా ముట్టలేదు. తల్లీ, తండ్రీ బ్రతిమాలారు. వినలేదు. ఒక రోజు గడిచింది. అంగూర్ చెప్పిచూచింది. తార ఖాతరు

చెయ్యలేదు. రాం తారను లేపి కూచోబెట్టి చెప్పాడు. "తారా! నీవు నాట్యం నేర్చుకోవాలంటే ముందు ఇంకా చాలాకాలం వుంది. ఇప్పుడు అమ్మ వప్పుకోవడంలేదు. నీకు త్వరలో వివాహం చేస్తాం. భర్తవస్తాడు, నేను అతనికి నచ్చజెప్పి నీకు నాట్యం నేర్పించేఏర్పాటుచేస్తాను. శివ రాంబాబు నామాటను తోసిపుచ్చడు. లే, తారా! ముఖం కడుక్కొని కొద్దిగాభోజనం చెయ్యి, నీకు నాట్యం నేర్పిస్తా మని నేను హామీయిస్తున్నానుగా"

తారలేచి ముఖంకడిగింది. జోరా ఒక కంచంలో అన్నంపెట్టి ఒక గిన్నెతో చారు పెట్టింది. తార మాట్లాడ కుండాభోజనం ముగించింది.

కొద్దిదినాలు గడిచాయి. అంగూర్ చిత్రం తయా రైంది. ఆ చిత్రంవంక పరీక్షగా చూచి శివరాం అనుకు న్నాడు. "అంగూర్ నాకోసమే పుట్టింది. యీ చిత్రంతో నాజన్మ సఫలమైనట్లే." ఎందరెందరో ప్రముఖ ఆర్టిస్టులు స్టుడియోకివచ్చి చిత్రం తిలకించారు. శివరాంను వేనోళ్ళ పొగడారు. చిత్రం అసమానం అన్నారు. అద్వితీయం అన్నారు మరికొందరు.

చిత్రానికి యేమిపేరు పెట్టాలో? అని శివరాం రాత్రింబవళ్ళు ఆలోచించాడు. ఒకటి, రెండు దినాలలోనే చిత్రపదర్శన జరుగుతుంది. ఆ ప్రదర్శనలో తన చిత్రం కూడా యేర్పాటు చెయ్యాలి. కాని చిత్రంపేరు నిర్ధారణ కాలేదు.

శివరాం పదేపదే ఆలోచించాడు. అంగూర్ సమా

జంలో అట్టడుగున పడివున్న వర్గంలో జన్మించింది. ఆమె ఒక అపురూపశిల్పం, ఒక దివ్యతార. కాబట్టి "నాచులో పద్మం" లేక "బురదలో కమలం" అని పేరుపెడితేబాగుంటుంది అనుకున్నాడు. ఆ విషయం ఒక మిత్రుని సలహా అడిగాడు. ఆయనచెప్పాడు. "పంకజం" అని పేరుపెడితే మీరు అనుకునే అర్థం వస్తుంది. మీ వూహాలకు సరిపోతుంది" అన్నాడాయన.

మిత్రునిసలహా శివరాంకు నచ్చింది. అతను ఎగిరి గంతువేశాడు. చిత్రానికి "పంకజం" అని నామకరణ చేశాడు. తనయితరచిత్రాలతోపాటు "పంకజం" కూడా ప్రదర్శనకు పంపాడు.

ప్రదర్శనలో "పంకజం" చిత్రానికి ప్రథమ బహుమతి లభించింది. ఆరోజున శివరాం చిత్రకారులకు, మిత్రులకు విందు ఏర్పాటుచేశాడు. రాం దంపతులుకూడా ఆ విందులో పాల్గొన్నారు. శివరాం ఆ దంపతులను వుచిత రీతిని సత్కరించాడు. వారికి విలువైన దుస్తులుకొని యిచ్చాడు.

ఢిల్లీ నగరంలో అఖిలభారత చిత్రప్రదర్శన జరుగుతూంది. శివరాం తన చిత్రాలన్నీ ప్యాక్ చేసి ఢిల్లీ ప్రదర్శనకు పంపించాడు. అతను ఢిల్లీకి పోవలసివుంది. రాంను కలుసుకొని మాట్లాడడానికి అతను ప్రయత్నించాడు. కానీ సాధ్యపడలేదు. కారుతీసుకుని ఫ్యాక్టరీకి వెళ్ళాడు. అప్పటికి పనివాళ్ళంతా ఎక్కడివాళ్ళు అక్కడ వెళ్ళిపోయారు.

ఫ్యాక్టరీ నిర్జనంగావుంది ఆ తరువాత కారును జూబిలీ హిల్సుకు పోనిచ్చాడు. రాం అక్కడా లేడు, అంగూర్ తనతో ఏమంత చనువుగా మాట్లాడలేదు. రాం సినిమాకు పోయివుంటాడని చెప్పింది. ఘనేనాయక్, తారా అతనిని కలుసుకొని కుశల ప్రశ్నలు వేశారు. రాంకు యిమ్మని ఒక కవరు అంగూర్ చేతికి అందించి తిరిగి స్టుడియోకి వెళ్ళాడు. రాం అక్కడాలేడు. ఆ రాత్రి జి. టి.లో శివ రాం ఢిల్లీకి బయలుదేరి వెళ్ళాడు.

రాత్రి పదిగంటలకు ఇల్లుచేరినరాం భార్యచెప్పిన సమాచారంవిని "దాదాను" కలుసుకోలేకపోయానే అని విచారపడ్డాడు. తనను బలవంతంపెట్టి ఫ్యాక్టరీనుండి సిని మాకు తీసుకుపోయిన తోటిపనివారిని తిట్టుకున్నాడు. శివ రాం ఇచ్చిన కవరు అంగూర్ భర్తకు అందించింది. అందులో ఒక జాబు,పది పది రూపాయల నోట్లువున్నాయి. అతను ఆతురతగా దీపంముందు కూచుని జాబు చదివాడు.

రాం,

నేను ప్రస్తుతం ఢిల్లీకి పోతున్నాను, అక్కడజరిగే చిత్రప్రదర్శనకు **నా** చిత్రాలు పంపించినసంగతి నీకూ తెలిసేవుంటుంది. ఢిల్లీ ప్రదర్శనముగిసిన అనంతరం నేను బొంబాయి పోవలసివుంది. అక్కడ జరిగే చిత్రప్రదర్శనలో పాల్గొంటాను. ఆతరువాత నేను రోమ్‌నగరం పోతాను. అక్కడ ఒకటి రెండుమాసాలు వుండవలసిన అవసరంవుంది. ప్రపంచ చిత్ర ప్రదర్శన రోమ్‌నగరంలోనే జరుగుతుంది.

ఆ ప్రదర్శన అనంతరం నేను తిరిగి రావడానికి బహుశా మూడుమాసాలైనా పడుతుంది. అంతవరకు నీ ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకుంటూ వుండగలవని తలుస్తాను. లోగడ నీతో చెప్పినప్రకారం "పంకజం" చిత్రానికి బహుమతులు వచ్చినా, లేక అమ్ముడుపోయినా వచ్చే మూల్యంలో నీకూ సగంయిస్తాను. నేను తిరిగివచ్చేవరకు యీ వంద రూపాయిలు పొదుపుగా వాడుకో. ఫ్యాక్టరీలో ఓవర్ టైముచేసి ఆరోగ్యం చెడగొట్టుకోవద్దు. అంగూర్‌ను జాగ్రత్తగా కాపాడుకో.

ఇట్లు
నీ దాదా
శివరామ్.

రాం జాబు చదవడం పూర్తిచేసి కళ్ళనీళ్ళ పర్యంతం అయ్యాడు. డబ్బు అంగూర్ చేతికి యిచ్చి తను పోయి మంచంమీద పడకవేశాడు. అంగూర్ భోజనానికి లేవమని అడిగింది. కాని అతను "వద్దు" అని ఖచ్చితంగా చెప్పాడు. భర్త దీపందగ్గిర వదలిపెట్టిన జాబు అంగూర్ కూడా పలుకుతూంటూ చదివింది. జాబు ముగించి "యిది ఎటువంటి ఋణానుబంధం" అనుకుందామె.

కొద్దిమాసాలు గడిచాయి. రాం ఫ్యాక్టరీకి పోతూనే వున్నాడు. ఒకనాటిసాయంకాలం రాం తల్లి మున్నీబాయ్ నెత్తిమీద రెండుమూటలతోవచ్చి ఇంటిముందు కూచుంది. అంగూర్ అత్తగారిని సంతోషంతో ఆహ్వానించింది. ఆమెకు స్నానానికి వేడినీళ్ళుతోడింది. రాత్రి భోజనానికి

మాంసంకూర, పప్పుచారు సిద్ధంచేసింది. రాం పనిలోనుండి రాగానే తల్లిని కౌగలించుకుని కళ్ళనీళ్ళ పర్యంతం అయ్యాడు. మున్నీ కొడుకు చెక్కిళ్ళు నిమిరి తనకణతలకు నొక్కుకుంది.

మున్నీ రాక అందరికీ సంతోషం అయ్యింది. పిల్లలను తీసుకు రాలేదు కాబట్టి ఆమె త్వరలోనే తిరిగి కామారెడ్డికి పోతుందని జోరా నిశ్చయించుకుంది. ఘనేనాయక్, జోరా, తారా, లంగడా, శివానాయక్, పిల్లలతోసహా అంతా మున్నీచుట్టూ మూగారు. ఆమె ఎన్నోకబుర్లు చెప్పింది. ఆ కబుర్లువింటూ జోరా వ్యాఖ్యానించింది.

"అయ్యో తోడా, మున్నీ! మా బ్రతుకులేమి బ్రతుకులు. ఆవులా, లేగలా, గొఱ్ఱెలా, మేకలా ఏమీ లేవుగదా! ఆ అడవులూ లేవు, పచ్చికా లేదు. తెల్లారిలేచిన కాడినుండీ రెక్కలు ముక్కలు అయ్యేటుచాకిరీ చేస్తే యిన్ని మెతుకులు దొరుకుతున్నాయి. లేకపోతే అదీ లేదు. నీకేం హాయిగాపోయి అడవుల్లోను, పచ్చికబీళ్ళల్లోపడ్డావు. అన్నపోయినాక యీ గుట్టలను అంటిపెట్టుకుని మేము ఇక్కడ యింకా ఎందుకు వుంటున్నట్టు. యేమి బ్రతుకులో ఏమిపాడో, మేమూ, ఏదో ఒకదారి చూచుకోవాలి" అంది.

"యేమయ్యా, ఘనేనాయక్, తారకు యీ సంవత్సరం పెండ్లి చేస్తావా!" అని అడిగింది మున్నీ.

ఘనేనాయక్ ఆలోచనలో పడ్డాడు. రెండునిముషాల తరువాత "ఎందుకుచెయ్యం. తారకు పెండ్లిచెయ్యాలనే

అనుకుంటున్నా. ఏదీ! ముందు లంగడాకు చేసిగాని తరువాత దానిపెండ్లి చెయ్యను" అన్నాడు అతను.

జోరా చర్రున లేచింది. "లంగడా పెండ్లితో దాని పెండ్లి పొత్తుపెడుతున్నావా? నీకు నోరెట్లావచ్చింది ఆ మాట అంటానికి. యేమో మున్నీ! ముందు తారపెండ్లి చేసినతరువాతే ఎవరి పెండ్లిచేసినా" అంది జోరా.

"మున్నీ మామ్మా. మీ జమునకు పెండ్లి చెయ్యవూ?" తార అడిగింది.

"ఎందుకు చెయ్యనమ్మా! చేస్తాను. అబ్బాయి రాం సొమ్ము యేమైనా కూడబెడితే చెయ్యాలనే చూస్తున్నా. అయినా మాజమున నీకంటే ఒక సంవత్సరం చిన్నదే గాదటే" అంది మున్నీ.

రెండురోజులు అందరూ వుత్సాహంగా గడిపారు. రాం ఒకరోజు శెలవుపెట్టి తల్లిని పట్టణమంతా తిప్పి చూపెట్టాడు. ఆమెకు బట్టలు కొనియిచ్చాడు. రాత్రి సినిమాకు తీసుకుపోయాడు. మున్నీ బయలుదేరి పోతుంటే అంగూర్ తనకు బహుమతి వచ్చినదుస్తులలో ఒకజత జమునకు యిమ్మని యిచ్చింది. దానితో మున్నీ మొహం చాటంత అయ్యింది. "వ్వారేవ్వా నాకోడలు బంగారం" అంది ఆ బట్టలు జోరాకు చూపెడుతూ.

రాం తల్లికి యిరవైరూపాయిలు యిచ్చిపంపించాడు. ఆమె పోతూ కొడుకుతో చెప్పింది.

"బేటా! చెల్లెలిపెండ్లి కలసివచ్చేట్టు వుంది. నీతండ్రి అనంతరం నీవే వాళ్ళనుంచీ చెడ్డాపూడాలి. మనకు

యింకా యెవరున్నారు? బాబూ! మరికాస్త డబ్బు కూడ బెట్టావులంటే యీ సంవత్సరమే చెల్లెలి పెండ్లి చేద్దాం. నేను యీ సారి వచ్చేప్పుడు చెల్లినీ, తమ్ముడినీకూడా తీసుకువస్తాను.''

రాం ఆలోచించాడు. చెల్లెలిపెండ్లికి అవసరమైన పైకము తనే సంపాదించాలనుకున్నాడు.

శివరాం వెళ్ళినతరువాత అతనిమనస్సు చాలా వ్యాకులమైంది. మున్ని రాకతో అది కొంత కుదటపడింది. కాని అతను యిటీవల యెక్స్ట్రా గంటలు పనిచేస్తున్నాడు. దానితో అతని ఆరోగ్యం దెబ్బతింది. భర్త ఆరోగ్యం చూచి అంగూర్ ఆందోళనపడింది. అతనిని యక్స్ట్రా గంటలు పనిచెయ్యవద్దని బ్రతిమాలింది. కావాలంటే తను కూడా కూలికి పోతానంది. కాని రాం అంగీకరించలేదు.

చూస్తూ చూస్తూ రాం బ్రతుకు దుర్భరంగా తయారైంది. అతను ఫ్యాక్టరీలో పనిచెయ్యలేకపోతున్నాడు. అందులో దగ్గుఒకటి పట్టుకుంది. ఒకరోజున ఘనేనాయక్ రాంను వెంటబెట్టుకుని డాక్టరుదగ్గరకు తీసుకుపోయాడు. ఆయన రాంని పరీక్షచేసి క్షయ అని తేల్చాడు. రాం గుండెలు కొట్టుకున్నాయి. “దాదావుంటే నాకు యీ రోగం వచ్చేదికాదు'' అనుకున్నాడు అతను.

కొంతకాలం డాక్టర్ల దగ్గర మందులు వాడారు. ఇంజక్షన్లు కొనితెచ్చారు. కాని రోగం తగ్గలేదు. చివరకు ఒక డాక్టరును పట్టుకుని యెర్రగడ్డ క్షయ ఆసుపత్రిలో పడక సంపాదించారు.

అప్పటికి ఇంట్లోవున్న డబ్బుఅంతా అయిపో యింది. అక్కడక్కడా అప్పుకూడా చేసారు. అంగూర్‌కు గడిచేమార్గం అగుపించలేదు. ఆమెదగ్గరనున్న కొద్దిపాటి వస్తువులు ఒక్కొక్కటే అమ్మివేసింది. రెండుదినాల కొకసారి హాస్పటలుకుపోయి భర్తను చూసివస్తోంది.

ఒకరోజున హాస్పటల్లో రాం అన్నాడు. "అంగూర్ మనకష్టాలు అట్టేకాలం వుండవు. ఒకనెలదినాలలో దాదా తిరిగివస్తాడు. నీచిత్రానికి వచ్చేసొమ్ములో మనకు కొంత యిస్తాడు. నన్ను తన స్టుడియోలోనే వుంచుతానని చెప్పాడు. విచారపడకు అంగూర్. నాకు ఫరవాలేదు. మనకు మంచిరోజులు వస్తాయి అంగూర్!"

అంగూర్ బలవంతంమీద కళ్ళనీళ్ళు ఆపుకుంది. ఆమె నెమ్మదిగా అంది. "రాం! నీ ఆరోగ్యం కుదుటపడితే నాకు యేవిచారమూ వుండదు, రాం. మీ దాదా వచ్చినా, రాకపోయినా మనం కష్టపడి స్వేచ్ఛగా బ్రతకగలము" అంది.

అంగూర్ పనికోసం గాలించింది. తమపాకల సమీపంలో వున్న నవాబుగారి బంగళాలో ఎవరో పెద్ద అధికారి దిగాడు. రోజూ విసుకు, విరామం లేకుండా లెక్కలేనన్ని కార్లు ఆ బంగళాచుట్టూ తిరుగుతున్నాయి. ఆ బంగళా కాపలాదారు నేపాలీ ధర్మసింగు తనకు తెలుసు. ఒకనాటి సాయంకాలం ఆమె ఆ బంగళాదగ్గరకుపోయి ధర్మసింగుతో చెప్పుకొంది. "ధర్మసింగుభయ్యా! మా రాం ఆసుపత్రిలో వున్నాడు. నాకు ఎక్కడా పనిలేదు యీ బంగళాలో

వారికి పనిమనిషి కావాలని యిక్కడ పాలుపోసే చెన్నయ్య చెప్పాడు. నీవు వారితో మాట్లాడి నాకు పనికుదిర్చి పెడుదూ! నీకు పుణ్యముంటుంది'' అంది.

“అవును అంగూర్. ఇక్కడ పనిమనిషి కావాల్సిన మాట వాస్తవమే. కాని నిన్నసాయంకాలం ఎవరో వచ్చి మాట్లాడివెళ్ళారు. అయినా తెల్లవారి యెవ్వరూ వచ్చి నట్టులేరు. నేను అమ్మగారిని అడిగివస్తానుండు'' అంటూ లోపలికిపోయాడు. పది నిముషాల తరువాత అతను తిరిగి వచ్చి. “అమ్మగారు పిలుస్తున్నారు. లోపలికిపోయి మాట్లాడు'' అని చెప్పాడు.

అంగూర్ బెదురుతూ లోపలికి నడిచింది. వెనక నుండి నేపాలీ చెప్పాడు. “అంగూర్, యీ పక్కగాపోతే అవతల వంటఇల్లు అగుపిస్తుంది. అమ్మగారు అక్కడే వున్నారు. భయంలేదు వెళ్ళి మాట్లాడు''

నేపాలీ చెప్పిన ప్రకారం ఆమె కొంచెంముందుకు పోయి ప్రక్కకు తిరిగింది. అక్కడ వంటఇంటి వసారాలో నలభైసంవత్సరాలవయస్సువున్న ఒకఆమె కుర్చీలో కూర్చునివుంది. యెర్రగా, బొద్దుగా వుంది. మెడలో రాళ్ల నెక్ లెస్, చంద్రహారం, చేతులనిండా గాజులు వున్నాయి. నేపాలీ చెప్పిన ఇంటి యజమానురాలు ఆమే అయివుంటుం దని అంగూర్ ఆమెముందుకుపోయి “తమ బంగళాలో పని వుంటే నేను చేస్తాను అమ్మగారూ'' అంది.

యజమానురాలు అంగూర్ వైపు ఎగాదిగా చూచి “నీకులం యేమిటే?'' అని ప్రశ్నించింది.

"లంబాడీలం అమ్మగారూ."

"తెలుగు మాట్లాడటం వచ్చునా?"

"వచ్చండీ, మేమూ తెలుగువాళ్ళమే"

"మాఇంట్లో పెద్దపనియేమీ వుండదు. పాచిపనిచేసి అంట్లు తోమాలి"

"అలాగే చేస్తాను అమ్మగారూ!"

"యేమికావాలో అదికూడా చెప్పు"

"తమరే సెలవివ్వండి"

"అయిదు రూపాయలిస్తాను"

"ఆపక్కబంగళాలో పనిమనిషికి నెలకు పదిరూపాయలు యిస్తున్నారండీ!"

"పదా, పాతికా! అయితే మాకొద్దు"

"పోనీ, యెనిమిదిరూపాయలు యిప్పించండి"

"నీకు యిష్టమైతే యేడురూపాయిలిస్తాను, ఉదయం సాయంకాలంవచ్చి పనిచేసి, అంట్లు శుభ్రంగా తోమిపెట్టి వెళ్ళాలి"

"పనిలోకి ఎప్పుడు రమ్మంటారు"

"ఎప్పుడో ఎందుకు, యిప్పటినుండే చెయ్యి"

అంగూర్ చీపురుపుచ్చుకుని యింటిచుట్టూ కసువు చిమ్మి, నీళ్ళు చల్లింది. "ఇంకా పనియేమైనావుంటే చెప్పండి అమ్మగారూ! చేస్తాను" అంది యజమానురాలి ముందుకు వెళ్ళి.

"యీపూట అంట్లుకొద్దిగావుంటే మా వంటమనిషి తోముకున్నాడులే. నీవుపైకిపోయిగదులన్నీ చిమ్మరా" అంది.

అంగూర్ మొదటి అంతస్థుకుపోయి చూచింది. వరండావైపుగదులలో ఎవరో పెద్దలు కూచుని మాట్లాడుతున్నారు. ఖాళీగావున్న గదులన్నీ శుభ్రంగా చిమ్మి కిందికి దిగింది. అప్పటికే చీకటి పడింది. ఆమె యజమానురాలిదగ్గరకుపోయి చెప్పింది, "పైగదులు చిమ్మాను, అమ్మగారూ"

"మూడు అంతస్తులు చిమ్మివచ్చావా?"

"లేదు అమ్మగారూ, మొదటి అంతస్థు చిమ్మేసరికే ఈ వేళఅయ్యింది. మిగిలినవి రేపుచిమ్ముతానండీ!"

"సరేగాని నీపేరు ఏమిటే?"

"అంగూర్ అమ్మగారూ!"

"నీకు వివాహం అయిందా?"

"అయిందండీ!"

"నీ భర్త యేమిచేస్తుంటాడు?"

"అల్విన్ ఫాక్టరీలో పని అండీ!"

"మరి నువ్వు పాచిపని చెయ్యవలసిన అవసరం?"

"మావారికి రెండుమాసాలనుండి జబ్బుచేసిందండీ! పనిలోకి పోవడంలేదు."

యజమానురాలు కుర్చీలో ప్రక్కకుతిరిగి "ఒరే! నూకరాజూ!" అని పిలిచింది. వంటఇంటి గుమ్మంలోనుండి నూకరాజు తొంగిచూచాడు. ఒకచేతిలో సిగరెట్, రెండో చేతిలో నల్లగామాసిన తువాలువుంది. అతను ప్రశ్నార్థకంగా

యజమానురాలివైపు చూసి "ఏమిటండీ?" అన్నాడు.

"ఇదిగో పనిమనిషి వచ్చింది చూడు, వెళ్ళిపోతా నంటూంది. తోమవలసిన అంట్లు యేమైనావుంటే బయట పడవెయ్యి, శుభ్రంచేసి పోతుంది" అంది.

నూకరాజు ఆ ఇంట్లో వంటమనిషి. పాతికసంవత్స రాల వయస్సు. చామనచాయరంగు. ఆరడుగులబారు. గుబు రుగా పెరిగిన క్రాపు, పెంచికట్టింగు మీసం, కండరాలు తిరిగిన జబ్బలు, బాగా ఆరోగ్యంగా ఉన్నాడు, కాని కణ తలు రెండింటిమీదావున్న కాల్చిన పెద్దమచ్చలతో అతని ఆకారం వికృతంగా అగుపిస్తుంది.

నూకరాజు అంగూర్ వైపు చూచాడు. కాని ఆ కీనీ డలో ఆమెను పోల్చుకోలేకపోయాడు. "ఏదీ! లైటువెలు తురులోకి రమ్మనమనండి చూద్దాం. ముసిలిదో, పడుచుదో" అన్నాడు.

యజమానురాలు పేలవంగా నవ్వింది. "ఒరేయ్ నీ దుంపతెగ, పడుచుపిల్లేరా! అయినా దాని ఆరాలు నీకు మెందుకురా?"

"ఆయ్ బాబోయ్, మీకేం మీరు అలానేఅం టారు. ముసిలిది అయితేయేమి పనిచేసిఛస్తుందీ! దానితో పాటు నేనూ చావాలిగా" అన్నాడు.

"నీపేరేమిటి అమ్మాయ్!" అడిగాడు అతను.

"అంగూర్"

"అంగూరా, ద్రాక్షా; యేదీ యీ లైటువెలుతురు లోకిరా చూదాం" అంటూ అతను టాప్‌లైట్. స్విచ్

నొక్కాడు. ఆ వెలుతురులో అతను అంగూర్‌ను చూచి నిర్ఘాంతపోయాడు. ఆమెను లోగడ ఎక్కడో చూచినట్టు అనిపించింది. అతనిమాటలు తడబడ్డాయి. "అంగూరూ కాదు, ద్రాక్షా కాదు, పంకజం" అన్నాడు అంగూర్ కళ్ళ లోకి చూస్తూ.

"పంకజం యేమిటిరా నీబొందా, పిచ్చివాగుడూ నువ్వూను" అంది యజమానురాలు.

"అవునమ్మా, మీ మేనల్లుడు శివరామ్‌గారు ఆమధ్య పంకజం చిత్రంగియ్యలేదూ. ఆపంకజం యీమె" అన్నాడు. యజమానురాలికి గుటకపడలేదు. ఆమె అంగూర్ వైపు చూస్తూ అడిగింది. "ఏమే, అమ్మాయి, నీవేనా ఆ పంక జానివి?"

అంగూర్ తలకిందికి దించుకుని "అవును" అంది.

"అయితే యీ పాచిపని చేసుకునేఖర్మ ఏమిటీ, నీకు మా శివరావు డబ్బుయివ్వలేదూ."

"కొద్దిగాయిచ్చారు. అది నాభర్త మందులకుఅయి పోయింది."

"అయితే, నీవు మాకు పనియేమి చెయ్యగలుగు తావు?"

"పని చెయ్యగలను అమ్మగారూ! పని చెయ్యాలనే గదా మీ బంగళాకు వచ్చింది."

"సరే వెళ్ళి చీకటితో లేచిరా" అంది ఆమె. అంగూర్ వెనకకు తిరిగింది. నూకరాజు అడిగాడు.

"పంకజం, మీ ఇల్లు ఎక్కడమ్మా."

"ఇక్కడే, ఆ పల్లంలో పాకలులేవూ, అందులో చిన్న పాక మాదే!"

అంగూరు తిరిగిపోతుంటే నూకరాజు ఆమెవైపు చూస్తూ నిలబడ్డాడు. గేటు కాపలాదారు సింగుతో ఆమె మాట్లాడివెళ్ళింది. నూకరాజు ఆలోచనలు పరిపరివిధాల పోయాయి. "హైదరాబాబు నగరపు నాగరికసమాజం కోరి యాడిన పంకజం యీఇంట్లో పనిమనిషా!" అనుకున్నాడు. అతను త్వరత్వరగా పనిముగించుకుని గేటులోకివెళ్ళి కాపలాదారును అడిగాడు "సింగ్, నీకు పంకజం తెలుసునా?"

"పంకజం యెవరుబాబూ?"

"అదే మన ఇంట్లో పని చెయ్యడానికి రాలేదూ, అంగూర్."

"అంగూర్ తెలియకేంబాబూ. నాకు బాగా తెలుసు. రామానాయక్ భార్య"

"ఆ అమ్మాయి మంచిదేనంటావా? సింగ్."

"అబ్బా! మంచిదీ! మహా దొడ్డపిల్ల. ఆమెభర్తకు జబ్బుచేసి యెర్రగడ్డ ఆసుపత్రిలో చేరాడు. జరుగుబాటు లేక మనఇంట్లో పనికి కుదిరింది."

అంగూర్ స్థితికి నూకరాజు జాలిపడ్డాడు. ఆమెపట్ల అతనికి సానుభూతి యేర్పడింది. "ఆమెను మర్యాదగా చూడాలి" అనుకున్నాడు.

ఇంటి యజమానురాలిపేరు సూర్యకాంతం. ఆమె భర్త నారాయణరాజు పెద్ద కంట్రాక్టరు. సూర్యకాంతం

అన్న రామరాజుగారు ప్రభుత్వంలో ప్రముఖ అధికారులలో ఒకరు. అధికారంలో ఉన్న అన్నగారిని ప్రాధేయపడి సూర్య కాంతం భర్తకు పెద్దపెద్దకంట్రాక్టులు సంపాదించింది. కొంత కాలం వాల్తేరులో, మరికొంతకాలం నాగార్జున సాగర్‌లో ఉన్నారు. ఇటీవలనే వారికుటుంబం హైదరాబాదుకు వచ్చారు.

సూర్యకాంతానికి నలుగురు సంతానం. మొదటి ఇద్దరు ఆడపిల్లలు, తరువాత యిద్దరు మగపిల్లలు. పెద్ద అమ్మాయి కమలకు యిరవైరెండు సంవత్సరాలు, ఇంటరు వరకుచదివి మానేసింది. రెండోఅమ్మాయి పద్మ. బి. ఏ. పాసయింది. ప్రస్తుతం హైదరాబాదు ఫైన్ఆర్ట్సు కళాశాలలో చిత్రలేఖనం నేర్చుకుంటూవుంది. మగపిల్లలు మెట్రిక్కు ప్రయివేటు చదువుతున్నారు. వాళ్ళపేర్లు ఏమిటో యెవ్వరికీ తెలియవుకాని అందరూ పెదబాబూ, చినబాబూ అంటారు.

శివరామ్ కంట్రాక్టరు నారాయణరాజుగారి చెల్లెలు కొడుకు. శివరామ్ చిన్నవయసులో వుండగానే తల్లీ, తండ్రీ చనిపోయారు. మేనమామలుగాని, తాతముత్తవలుగాని శివరామ్ పోషణభారం తీసుకోలేదు. ఆ స్థితిలో శివరామ్ వితంతువు మేనత్త అన్నపూర్ణమ్మగారు అతనిని దగ్గరకుతీసి పెంచి పెద్దవాడిని చేసింది. విద్యాబుద్ధులు అలవడ్డాయి. బి. ఏ పాసయిన తరువాత శివరామ్ కలకత్తా లలితకళాశాలలో చేరి చిత్రలేఖనంలో ప్రావీణ్యాత సంపాదించాడు.

చిన్న వయస్సులోనే తల్లిదండ్రులను కోల్పోయిన శివరామ్ మేనత్తనే తల్లిగా భావించాడు. ఆమెను అమ్మా అనే పిలిచేవాడు. ఆమెకూడా అతన్ని కన్నబిడ్డకంటె ఎక్కువగానే చూచింది. ఆమెకు ఆధ్యాత్మికచింతన ఎక్కువ. శివరామ్‌కు వయస్సువచ్చిన తరువాత ఆమె అతనికి వివాహం కూడాచేసి "తన బాధ్యత తీరింది" అని అనిపించుకోవాలని చూచింది. కాని శివరాం అప్పట్లో వివాహానికి అంగీకరించలేదు. తరువాత ఆమె తన యావదాస్తిని శివరాంకు వ్రాసియిచ్చి తను రమణాశ్రమంలో చేరింది.

శివరాంకు మంచి ఆస్తిపాస్తులు, అందచందాలు వున్నాయి చదువు, సంస్కారమూ అబ్బాయి. తమబిడ్డలలో ఒకరిని శివరాంకు యిచ్చి వివాహం చెయ్యాలని సూర్యకాంతం సంకల్పం. నారాయణరాజుకు కూడా కమలనుగాని, పద్మనుగాని శివరాంకు యిచ్చి వివాహం చెయ్యగలననే ధీమావుంది. కాని తను తీరాబయటపడి మేనల్లుడిని అడిగితే అతను అవునంటాడో కాదంటాడో, అనే సంకోచమూవుంది. అందుచే అతనుఅవకాశం కొరకు వేచిచూస్తున్నాడు. భార్య సూర్యకాంతం ఒకటి రెండుసార్లు ఆ ప్రస్తావన తెచ్చింది. అప్పుడు నారాయణరాజు ఆమెను కటువుగానే మందలించాడు. "ఆ వెధవ కమ్యూనిస్టు, పైగా దేశదిమ్మరి. వాడికిచ్చిచేస్తే పిల్ల యేమి సుఖపడుతుందనీ, నీ ఆర్భాటమేగాని" అన్నాడు.

"అయ్యో! అదేమిమాటండీ, ఈ రోజుల్లో కుర్రాళ్ళను కమ్యూనిస్టులనీ, కాంగ్రెసులనీ అనుకుంటే పిల్లలకు

పెండ్లిళ్ళు ఎలా చేయగలుగుతాం. ఎవరో అప్రయోజకులు తప్ప, మిగిలినవాళ్ళంతా కమ్యూనిస్టులుగానో, కాంగ్రెసుగానో బయట పడుతున్నారుగా. అయినా శివరాం చాలా బుద్ధిమంతుడు. పైగా అతని తండ్రి తరఫునా, మేనత్త తరఫునా పెద్ద ఆస్తికూడా వచ్చికలిసింది. అంతకంటె మంచి సంబంధం మనంమాత్రం ఎక్కడ తీసుకురాగలం" అంది సూర్యకాంతం.

"వాడికి పెద్ద ఆస్తివుందనీ, యోగ్యతలు వున్నాయనీ, వాడిదగ్గరకు పోయి "అబ్బాయి, మా అమ్మాయిని వివాహం చేసుకోరా నాయనా" అని నేను యెప్పుడూ ప్రాధేయపడను. కాకపోతే వాడంతట వాడు మన అమ్మాయిలలో ఒకరిని వివాహం చేసుకునేందుకు సిద్ధపడితే నా అభ్యంతరం యేమీ వుండదు" అన్నాడు నారాయణ రాజు.

"ఆడపిల్లలుకల వాళ్ళకు మనకేయింత ధీమావుంటే ఆ అబ్బాయికి యింకా యెంత ధీమావుండాలో" అంది సూర్యకాంతం వెక్కిరింపుగా.

"వుంటేవుండనీ, మన అమ్మాయిలకు పెండ్లి కానప్పుడు నేను చూస్తాను" అన్నాడు భర్త.

సూర్యకాంతానికి ఒకకాలు బోదకాలు. అందుచేత ఆమె యెప్పుడూ కుర్చీలోనే కూర్చునివుంటుంది. అతిథులు బంధువులు ఎవరువచ్చినా వారికోసం ఆమె మేడ పైఅంత స్థులకుపోరు. వారే కిందికి దిగివచ్చి ఆమెను కలుసుకొని పోతారు.

సూర్యకాంతం భర్త నారాయణరాజు తరచు క్యాంపులకు పోతుంటాడు. గృహ నిర్వహణభారం పిల్లల చదువులు, డ్రైవర్లు, నౌకర్లు, ఖర్చులు వగయిరాలన్నీ సూర్యకాంతమే చూచుకుంటుంది.

రాత్రి తొమ్మిది గంటలయ్యింది. రోడ్డుమీద కారు హారన్ వినిపించింది. సింగు గేటు తెరిచాడు. కారులోపలకు ప్రవేశించింది. పిల్లలు సరదాగా కబుర్లు చెప్పుకుంటూ మేడమెట్లు ఎక్కి పైకి పోయారు. నూకరాజు డైనింగు హాలులో పళ్ళాలు, గ్లాసులు సర్దాడు. అరగంటదాటింది. మగపిల్లలు యిద్దరు దిగివచ్చారు. ఆడపిల్లలకోసం నూకరాజు మరికొంతసేపు చూచాడు, కాని రాలేదు. మగపిల్లలకు భోజనం వడ్డించాడు. వాళ్లు తిని పైకిపోయారు.

నూకరాజు మెట్లమీద నిలబడి "యేమమ్మోయ్, కమలమ్మగారూ, పదిదాటింది, మీకు భోజనాలు అవసరం లేదా?" అన్నాడు చికాకుగా.

పద్మ మెట్లుదిగుతూ అంది "వచ్చేస్తున్నా నూకరాజూ, తొందరపడకు" ఆమె నూకరాజును తప్పుకుని కిందికి పోయింది. కమల పైనుండే కేకపెట్టింది. "నూకరాజూ నా బాత్‌రూంలో నీళ్ళు అయిపోయాయి. నీవు కిందికిపోయి మోటారువదులు, నేను రెండునిమిషాలలో వచ్చేస్తాను."

"అబ్బో! నీ స్నానానికి యిప్పుడు నీళ్లుకావాలా, కింద టాంకులో నీళ్ళులేవు. కావాలంటే కిందికివచ్చి స్నానం చెయ్యి" అన్నాడు నూకరాజు.

అరగంట తరువాత కమల దిగివచ్చింది. ఆమెతో పాటు మగపిల్లలుకూడా వచ్చారు. పిల్లలను అందరినీ తల్ల గదిలోకి పిలిచింది. ఆమె ముందుగా మగపిల్లలను అడిగింది "సినిమా ఎలావుందిరా బాబూ"

"యేమీ బాగాలేదమ్మా" పెద్దబాబు చెప్పాడు.

"ఈ సినిమా వద్దోమొర్రో అంటే అక్కాయిలే తీసుకుపోయారమ్మా! వెధవ హింద్రీ సినిమా" చిన్నబాబు అన్నాడు.

పద్మ నవ్వుతూ అంది. "అమ్మా! తెలుగు సినిమా లన్నీ మేము లోగడ చూచినవేనమ్మా, వీళ్ళు టార్జాన్ సినిమాకు పోదామన్నారు, ఆ పాడు టార్జాన్ సినిమాలు నాకు గిట్టవు"

నూకరాజు గుమ్మంలో నిలబడి "యేమమ్మోయ్ పన్నెండు కావస్తోంది. మీరు వస్తేరండి, లేకపోతే నేను పోయి పడుకుంటాను" అన్నాడు చికాకుగా.

సూర్యకాంతమ్మ పెద్ద పందిరిమంచమీద వెల్వెట్ కుషన్‌లకు ఆనుకుని పిల్లలు నలుగురినీ చుట్టూ కూచోబెట్టు కుంది. గుమ్మంలో నిలబడిన నూకరాజువైపు ఓరగాచూస్తూ "పిల్లలు సినిమాకు పోయివచ్చారు గదా! అంత తొందర చేస్తే ఎలా నూకరాజూ!" అని పిల్లలవైపు తిరిగి "వెళ్ళం డమ్మా పొద్దుపోయింది. బాబూ మీరు అయిస్క్రీం తిన్నారుగా" అని అడిగింది.

"లేదమ్మా - అందుకే మళ్ళీ వెనకకుతిరిగివచ్చాం"
అన్నారు వాళ్ళు.

నలుగురూ బల్లచుట్టూ కూచున్నారు. నూకరాజు ఆడపిల్లలకు భోజనాలువడ్డించి మగపిల్లలకు ఐస్‌క్రీములు అందించాడు. పద్మవైపు చూస్తూ "పద్మగారూ, మీరు ఒక మంచివార్త చెబుతాను" అన్నాడు అతను.

"ఏమిటబ్బా అంత మంచివార్త?" అంది పద్మ.

"ఎక్కడైనా పెండ్లిసంబంధం చూశాడేమో" అంది కమల.

పద్మ ముఖం చిట్లించి "నీకు ఎప్పుడూ పెండ్లి రంధేనా ఏమిటే? కమలా!" అంది.

కమల కోపంతో కళ్ళు పెద్దవిచేసింది. "ఆ మధ్య యెవడో మెడికల్ స్టూడెంటు నిన్నుగురించి అడిగాడని లోగడ నూకరాజు నీకు కబురుచెప్పలేదూ" అంది.

"అప్పుడు ఎప్పుడో నాలుగు నెలలక్రితం చెప్పిన దాని ప్రస్తావన యిప్పుడుదేనికి కమలా!"

"యేమో, నూకరాజు నీకు యిప్పుడు మంచివార్త చెపుతానన్నాడు కాబట్టి,అలాంటివార్త యేమైనా తెచ్చాడేమోనని అనుకున్నాను."

"సందర్భంలేకుండా మాట్లాడబోకు కమలా!" పద్మ అక్కను మందలించినట్లు చూసింది.

కమల చెల్లెలివైపు తీవ్రంగా చూసింది" పద్మా! నీ ఆధిక్యత యేమైనావుంటే అది రేపు నీకు కాబోయే భర్త

దగ్గర ప్రదర్శించు నన్నుమాత్రం నీవేమీ మందలించవల, సినపనిలేదు."

నూకరాజు నవ్వుతూ అన్నాడు "అమ్మాయిగారూ పోట్లాడుబోకండమ్మా, నేను చెప్పే విషయం వినకుండానే మీలోమీరు కీచులాడుకుంటారెందుకమ్మా!"

"బాగా బుద్ధిచెప్పావు నూకరాజూ" అంది పద్మ.

"యెవరికి, నీకా—నాకా!" రెట్టించింది కమల.

నూకరాజు ముందుకువచ్చి "యిస్సో, ఆగండమ్మా యివ్వాళ పంకజం మనయింటికి వచ్చింది" అన్నాడు.

పద్మ అతనివైపు ఆశ్చర్యంగా చూచింది. "యే పంకజం"?

"మీ శివరామ్ బావ చిత్రంగియ్యలేదూ! ఆపంకజం"

"అయ్యయ్యో, నేను చూడలేదే! ఆ పంకజం మన యింటికి ఎందుకువచ్చింది నూకరాజూ"

"పాచిపని చెయ్యడానికి"

పిల్లలు నలుగురు ఒక్కసారిగా గొల్లున నవ్వారు.

పద్మ తెల్లబోతూ అడిగింది "పంకజం పాచిపని చెయ్యడమేమిటి నూకరాజూ!"

నూకరాజు సమాచారమంతా వివరించాడు.

"పాపం" అంది పద్మ.

"లంబాడీవాళ్ళకు పనిచేసుకోవటం అలవాటేగా, దానిలో పాపం యేముందీ!" అంది కమల.

"సందర్భశుద్ధి లేకుండా వాగవద్దని యింతకుముందే చెప్పాను, కమలా!"

"నువ్వేమీ నాకు పాఠాలు నేర్పనవసరములేదు. నీ తెలివితేటలు అంతటితో కట్టిపెట్టు" కమల విదిలించింది.

పద్మ మళ్ళీ అందుకునేలోపలే నారాయణరాజుగారు గుమ్మంలోనిలబడి "యేమిటమ్మా పోట్లాడుకుంటున్నారు?" అన్నాడు.

"పోట్లాడుకోవటంలేదు నాన్నగారూ" అంది పద్మ.

"నాన్నగారూ! పద్మ చీటికి మాటికి చులకనచేసి మాట్లాడుతుందండీ!" అంది కమల. ఆమె కంఠం రుద్ధం అయింది కళ్ళమ్మట నీళ్ళు కారాయి.

నారాయణరాజుగారు కుమార్తె లిద్దరిమీదా చెరో చెయ్యిపెట్టి "పిచ్చితల్లులు, అక్కచెల్లెళ్లు అలా పోట్లాడుకో కూడదమ్మా" అన్నాడు.

ఆ రాత్రి పండుకునేముందు పద్మ అనుకుంది. "పంకజం పాచిపనిచేసుకుంటూoందా! ఎంత దౌర్భాగ్యం, శివరామ్‌బావకు యీ విషయం తెలిస్తే ఎంత బాధపడ తాడోగదా!"

## 5

ఉదయం ఆరుగంటలకు నూకరాజు అందరికీ బెడ్ కాఫీలు అందించాడు. పద్మ మంచంమీద లేచికూచుని అతనిని అడిగింది.

"నూకరాజూ! పంకజం వచ్చిందా?"

"ఆ వచ్చిందమ్మా, క్రింద పనిచేస్తూవుంది"

పద్మ కాఫీ ముగించి త్వరత్వరగా టాయిలెట్ అయి క్రిందికివచ్చింది. అంగూర్ చెట్లకు నీళ్ళుపోస్తూంది.

పద్మ ఆమెవైపు పరీక్షగాచూస్తూ అంది "సాక్షాత్తూ పంకజమే" అంగూర్ తలఎత్తి ఆమెవైపు చిరునవ్వు చిందించింది. "నేను నిన్న సాయంకాలమే వచ్చాను. మీరు అప్పుడు ఇంట్లో లేరే!"

"అవును సినిమాకు వెళ్ళాం"

"అమ్మగారు మీకు ఏమవుతారు"

"మా అమ్మే!"

"మీరు ఒక్కరేనా? అమ్మాయిలు"

"కాదు. ఒక అక్కా - యిద్దరు తమ్ముళ్లువున్నారు"

"వారు యేరీ?"

"పైన వున్నారు. కొంచెంసేపు ఆగితే కిందికిదిగి వస్తారు."

"మీరు చదువుకుంటున్నారా?"

"ఆఁ, కాని యిప్పుడు సెలవులు"

"మీ అక్కగారో?"

"లేదు."

అంగూర్ బిందె పుచ్చుకుని పంపుదగ్గరకు పోయింది. పద్మ ఆమెవైపుచూస్తూ నిలబడింది. వంటవసారాలో సూర్యకాంతమ్మ కుర్చీలో కూచుని కాఫీతాగుతూ ఆమెను పలుకరించింది. "ఏమిటమ్మా, ఇంత పెందలాడే లేచి వచ్చావూ?"

పద్మ బద్ధకంగా ఆవులించి "యేమీలేదమ్మా, మెలకువవచ్చింది. కాఫీ తీసుకుని యిలా వచ్చాను" అంది.

పద్మ వంటయింట్లోకిపోయి నూకరాజుతో మాట్లాడింది, "నూకరాజూ, పంకజానికి ఏమిఏర్పాటు చేశారూ?"

"యేమో! వివరాలు నాకు తెలియవమ్మా, నెలకు ఏడు రూపాయలుమాత్రం యిస్తామని మీ అమ్మగారు చెప్పిందట, నేను రెండుపూటలా కాఫీ యిస్తానని చెప్పాను. మీ అమ్మగారు అభ్యంతరం చెప్పలేదు."

"అయితే ఆమెకు రెండుపూటలా భోజనంకూడా పెట్టి పంపించు నూకరాజూ!"

"ఏమో! మీ అమ్మగారు ఏమంటారో"

పద్మ తల్లికి సూచించింది "అమ్మా! పనిమనిషి పంకజానికి రెండుపూటలా భోజనంకూడా మనయింట్లోనే పెట్టించమ్మా!"

సూర్యకాంతమ్మ కుమార్తెవైపు ప్రశ్నార్థకంగా చూచింది. "పనివాళ్ళకుకూడా రెండుపూటలా భోజనాలు పెట్టుకుంటారా పద్మా!"

"మన పనిమనిషి పంకజం పరిస్థితి వేరు, అమ్మా"

"అయినా అదిఎంతకాలం వుంటుందనీ,మనదగ్గరా?"

"వున్నంతకాలమే, లేకపోతే మనం చేసేదేముంటుందీ?"

సూర్యకాంతమ్మ నూకరాజును పిలిచి "పనిఆ మనిషిని రెండుపూటలు యిక్కడే తిండితిని పొమ్మని చెప్పరా" అంది.

సూర్యకాంతమ్మ నూకరాజుగార్ల పరిచయం ఈనా టిదికాదు. నారాయణరాజుగారు వాల్తేరులో కాంట్రాక్టులు చేస్తున్న కాలంలో నూకరాజు ఒక ఇంజనీరుగారింట్లో వంటచేస్తున్నాడు! కంట్రాక్టరు — ఇంజనీరుగార్ల కుటుం బాలు సన్నిహితంగా మెలుగుతూ వచ్చాయి. విందులకు, టీపార్టీలకు ఒకరియింటికి ఒకరు వస్తూపోతూ వచ్చారు. ఒకప్పుడు కంట్రాక్టరుగారి వంటమనిషి పని యెగగొట్టాడు. సూర్యకాంతమ్మకు వండిపెట్టే ఓపికలేక ఇంట్లోవున్నవా రందరికీ హోటలునుండే భోజనాలు తెప్పించింది. ఆ విష యం ఇంజనీరుగారికి తెలిసి తమ వంటమనిషి నూకరాజును కంట్రాక్టరుగారింటికి పురమాయించాడు నూకరాజు కంట్రాక్టరు ఇంట్లోనే స్థిరపడిపోయాడు. అతను అవివాహి తుడు. మంచి బలశాలి.

సూర్యకాంతమ్మకు బోదకాలు అయినతరువాత భర్త నారాయణరాజుగారికి ఆమెమీద అపేక్ష క్షీణిం చింది. భర్త దృష్టిని తనమీదికే కేంద్రీకరింపజేసుకునేం దుకు సూర్యకాంతమ్మ తన చేతనైన సాధనాలన్నీ విని యోగించి చూచింది. కాని అవి ఫలించలేదు. ఆ స్థితిలో ఆమె నూకరాజుకు డబ్బు ఆశ చూపి అతనిని లోబరుచు కుంది. వారి రహస్యం ఎంతోకాలం దాగలేదు.

భర్తకు, బిడ్డలకు, ఇంటినవుకర్లకుకూడా తెలిసిపో యింది. అయినా సూర్యకాంతమ్మ వెనకాడలేదు. నూక రాజును పని మాన్పించడానికి నారాయణరాజుగారు ప్రయ త్నించాడు. సూర్యకాంతమ్మ యెదురు తిరిగింది.

నూకరాజును పనిలోనుండి తీసివేస్తే నేను అతని తోనే కలిసివుంటాను'' అని చెప్పేసింది భర్తతో.

అప్పుడు నారాయణరాజు ఆలోచనలో బడ్డాడు. తను ఏమాత్రం తొందరపడినా పరిస్థితులు విషమిస్తాయనే విషయం అతనికి తెలుసు. సూర్యకాంతమ్మకు బోదకాలు అయిన కొద్దికాలానికే తను యిద్దరు, ముగ్గురు స్త్రీలను చేరదీశాడు. అదికూడ బహిరంగరహస్యమే. ఒకవేళ తను నూకరాజును తొలగించితే సూర్యకాంతమ్మ మరో డ్రైవరు తోనో, లేక రిక్షావాడితోనో సంబంధం పెట్టుకోదనే హామీ ఏమీలేదుకాబట్టి, చూచీచూడకుండాపోవటమే మంచిదనుకున్నాడు. లేక తను బయటపడి భార్యను వేరుగా వుంచితే యుక్తవయస్సువచ్చిన నలుగురు బిడ్డల జీవితాలు దెబ్బతింటాయని ఆలోచించాడు. "సమాజంలో ఇలాంటివి ఎన్నో జరుగుతున్నాయి'' అనుకుని నారాయణరాజు ఆత్మ సంతృప్తి చెందాడు. వాల్తేరునుండి తాను నాగార్జున సాగర్ ప్రాంతాలకు తరలిపోతున్నప్పుడుమాత్రం నారాయణరాజు, నూకరాజుకు పెద్ద మొత్తం డబ్బు ఆశచూపి అతనితో "నేను నాగార్జునసాగర్ ప్రాంతాలకు రాలేను'' అని చెప్పించాడు.

నూకరాజులేని జీవితం సూర్యకాంతమ్మకు దుర్భరమే అయ్యింది. కాని ఆడపిల్లలకు వివాహాలు అయ్యేంత వరకయినా తాను ఓర్పువహించక తప్పదనుకుంది ఆమె. ఆ విధంగా నాగార్జునసాగర్ ప్రాంతాలలో సంవత్సరం పైగా గడిచిపోయింది. హైద్రాబాద్‌కువచ్చిన కొత్తలోనే

ఆమె నూకరాజు అడ్రసు తెలుసుకుని అతనితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి అతనిని రప్పించింది.

భోజనాల సమయంలో పద్మ నూకరాజును అడిగింది. "నూకరాజూ, పంకజానికి భోజనం పెట్టావా?"

"పెట్టానమ్మా! కాని ఆమె యిక్కడ తినడానికి ఇష్టపడలేదు. వాళ్ళ యింటికి తీసుకుపోయింది."

"ఇంటిదగ్గర ఆమెకు మరెవరైనా వున్నారేమో?"

"ఎవ్వరూ లేరనే విన్నాను."

"అయితే మనఇంట్లో తినేందుకు అభ్యంతరం ఏమిటో?"

"యేమో తెలియదమ్మా!"

పంకజం దీనావస్తనుగురించి పద్మ తన మిత్రులు కొందరికి చెప్పింది. వారిలో కొందరు ఆర్టిస్టులు కూడా వున్నారు. ఒకరు యిద్దరు ఆర్టిస్టులు పంకజాన్ని కలుసుకొని తమకు మోడలుగా రావడానికి అంగీకరిస్తే కొంత ధనసహాయం చేస్తామని తెలియజేశారు. అంగూర్ వెంటనే వారికి సమాధానం చెప్పలేకపోయింది. రెండు నిముషాలు ఆలోచించి తన భర్తతో సంప్రతించిన తరువాత తెలియజేస్తానని వారితో చెప్పింది.

మరునాడు అంగూర్ పని త్వరత్వరగా ముగించుకుని హాస్పిటలుకు వెళ్ళింది. రామ్ సంతోషంగా మాట్లాడాడు. అతనిముఖం లోగడకంటె కాస్త తేజస్సుగా అగుపించింది. అతని ఆరోగ్యం కొంత మెరుగు అయిందని ఆమె అను

కుంది. మాటల సందర్భంలో ఆమె బెదురుతూ అతనితో చెప్పింది "రామ్, యీ మధ్య నాకు బొత్తిగా జరుగు బాటు లేదు. జోరా యింట్లో చాలాబదుళ్ళు తీసుకున్నాను. నాకే అసహ్యం వేసింది. చివరకు మన ఇంటిదగ్గరవున్న పెద్ద బంగళాలో పనిచెయ్యడానికి వెళ్ళాను. ఆ బంగళాలో మన శివరామ్‌బాబు మేనమామగారు ఉంటున్నారు. వారి అమ్మాయి పద్మ నన్ను సానుభూతితో చూస్తూంది." అని చెప్పి ఆమె అతని కళ్ళల్లోకి చూచింది. అతను జాలిగా ఆమెవైపు చూశాడు. "నువ్వు చెయ్యవలసినపని ఏమిటే అంగూర్, అక్కడా."

"పెద్దపని యేమీ లేదు రామ్, గదులు తుడవటం, పూలమొక్కలకు నీళ్ళు పొయ్యడం."

"యేమి యిస్తున్నారు?"

"రెండుపూటలా భోజనంపెట్టి నెలకు ఏడురూపా యలు యిస్తామన్నారు."

"గొప్పవారి యిండ్లలో పనిచేయడం అంత తేలిక కాదు అంగూర్! నీశీలం కాపాడుకోవాలి."

అంగూర్ అతనివైపు ప్రశ్నార్థకంగా చూచింది. అతను నీరసంగా నవ్వాడు. ఆమెతల అతనిగుండెలకు ఆన్చి "రామ్, నామీద నీకు విశ్వాసంలేదా!" అంది. ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

అతను అప్యాయంగా ఆమెతల నిమురుతూ అన్నాడు "లేకేం, అంగూర్, నీమీద నాకు సంపూర్ణవిశ్వాసంవుంది. కాని కలవారి వికారపుచేష్టలను తట్టుకోగలిగివుండాలి."

"ఫరవాలేదు, రామ్!"

అతను సంభాషణ మార్చాడు. "అంగూర్ మీ యజమానులకు మన దాదావిషయం ఏమైనా తెలుసునేమో"

"లేదు రామ్, శివరామ్ బాబు విషయం వారికి తెలుసునని నేను అనుకోను, కాని యీ మధ్య నేనూ, తారాకలిసి స్టుడియోకి వెళ్ళాము. వారి కీ వివరాలు తెలియవు. త్వరలో వస్తాడనిమాత్రం చెప్పారు."

"దాదావస్తే మన కష్టాలు తీరుతాయి అంగూర్."

ఆమె చిన్నగా నవ్వింది. "రామ్, నాచిత్రం గీస్తామంటూ యిద్దరు చిత్రకారులు వచ్చారు. కొంతడబ్బు కూడా యిస్తామన్నారు."

"యెవరు వాళ్ళు"

"మా ఇంటియజమానిగారి అమ్మాయి పద్మలేదూ! ఆమె స్నేహితులు."

అతను రెండునిముషాలు దీర్ఘంగా ఆలోచించాడు. "అంగూర్, దాదా త్వరలో వస్తాడని అంటున్నారుగా. ఆయనతో చెప్పకుండా మనం యేపని చెయ్యకూడదు. కాబట్టి యెవ్వరికీ మాటయివ్వద్దు" అన్నాడు అతను.

అంగూర్ సంచిలోనుండి చిన్నపొట్లంతీసి అతనికి యిచ్చింది. అతను పొట్లంవిప్పి చూచాడు. పూరీ, బంగాళా దుంపలకూరా. అతను అంగూర్‌ను అడిగాడు. "హోటల్లో కొని పట్టుకువచ్చావా?"

"లేదు రామ్, మా యజమానులుయిచ్చారు."

"అయితే నీవు తినకుండా నాకోసం దాచితెచ్చా వన్నమాట."

అంగూర్ చిన్నగా నవ్వింది. "లేదు రామ్, నేను తిన్నాను. నిన్ను చూడటానికి హాస్పిటలుకు వస్తున్నానని తెలిసి వంటాయన యీ పొట్లం తెచ్చి నీకు యిమ్మనమని చెప్పాడు."

"యెవరు, ఆ వంటతను"

"యేమో, నాకు తెలియదు. శివరామ్‌గారు అంటే అతనికి ఎంతో అభిమానం. నన్నుమాత్రం చాలా అభిమానంగా చూస్తున్నాడు."

భర్తదగ్గర శెలవుతీసుకుని అంగూర్ ఇంటికిచేరింది. ఘనేనాయక్. జోరా, తారా, రామ్ ఆరోగ్యవివరాలు అడిగారు.' లోగడకంటె కొంచెం తేటగా అగుపిస్తున్నాడు అని చెప్పింది ఆమె. జోరా సలహాయిచ్చింది. "బేటీ అంగూర్, మన రామ్‌కు ఫరవాలేదు, యిక తగ్గిపోతుంది. వాడు రాంగానే పోసిమ్మకు నైవేద్యం చెల్లిస్తామని మొక్కుకో బిడ్డా."

అంగూర్ తెల్లబోయిచూచింది. "నైవేద్యానికి ఏమి కావాలి, మామ్మా!"

"ఆఁ యేమికావాలిలే: ఒక శేరుబియ్యంలో అర్ధశేరు పెసరపప్పుపోసి పులగం తయారుచేద్దాం. యెనిమిదిజోళ్ళ గారెలు. నాలుగుజోళ్ళ బూరెలుఅయితే నైవేద్యంకూడా సరిపోతుంది పోతే ఒక కొబ్బరికాయ, దొరికితే ఒకకోడిని మన రామ్‌చుట్టూ దిగతుడిచి కోసుకుందాం" అందిజోరా.

అంగూర్ చిన్నగా నవ్వింది. "సరే మామ్మా! ఆ మొక్కటం ఏమిటో నాకుమాత్రం ఎన్నడూ అనుభవం లేదు. నీవు యిపుడు మొక్కితే రామ్ రాగానే ఆమొక్కు బడి చెల్లిద్దాం." అంది అంగూర్.

"అమ్మాయి అంగూర్, ఆరోజు కల్లుఅంగడి ఖర్చు కూడా నీదే" అన్నాడు ఘనేనాయక్.

అంగూర్ నవ్వుతూ సమాధానం చెప్పింది. "అలాగే బాబా, అందరం తృప్తితీరా తాగుదాం"

* * *

రామ్ హాస్పిటల్‌లో చేరినతరువాత అంగూర్ ఒంటరిగా పరుండటానికి భయపడి తారను సహాయంగా పిలిచింది. తార తప్పనిసరిగావచ్చి రాత్రిళ్ళు అంగూర్ ఇంట్లోనే పరుంటూంది.

ఒకనాటి సాయంకాలం శివానాయక్ తారతో రహస్యంగా చెప్పాడు. "తారా యీరాత్రి నీవు అంగూర్ ఇంట్లో పండుకోటానికి పోవద్దు."

ఆమె ఆశ్చర్యపడుతూ అడిగింది "ఎందుకని శివా?"

"నేను చెపుతున్నానుగా, నీవు పోవద్దు"

"నీవు చెప్పదలచుకున్నదేమిటో బయటపెట్టరాదూ!'

"యీరాత్రి అంగూర్‌దగ్గర పండుకోవటానికి నేను పోతాను."

తార నిర్ఘాంతపోయింది. "ఛీ, ఛీ పిచ్చిగావాగబోకు'

"నీకు తెలియదులే తారా"

"యేమిటీ నీబొంద నాకు తెలిసేదీ. అంగోర్ ఆమో దిస్తుందా?"

"ఆమోదించక యేమిచేస్తుంది. దాని భర్తలేడుగా దగ్గరా"

"అంగూర్ సంగతి నీకు తెలియదు. నీవు ఏదయినా పిచ్చిపనిచేస్తే అది నీపళ్లు రాలగొడుతుంది"

శివానాయక్ చిన్నగా నవ్వాడు. "అదీ చూస్తానుగా నేను, యే మాత్రం రాలగొడుతుందో. రామ్ వచ్చేలోగా అంగూర్‌ను గనుక చెరచకపోతే నేను మగవాడినే కాదు"

"నీ మగతనం మండిరి, వెధవ వాగుడూనువ్వూను. నీవు యీ పిచ్చిధోరణి తగ్గించుకోకపోతే నీ విషయం అమ్మకు, నాన్నకు చెపుతానుండు."

"చెపితే, అమ్మా నాయనా నన్ను ఏమిచేస్తారు? వాళ్ళు యేమయినా అంటే నేను యింట్లోనుండి పోయి బయట యెక్కడయినా చాకిరీచేసి హాయిగా బ్రతకగలను"

తార నోరు పిసుక్కుంది. "శివా, నీకు ఈ దుర్బుద్ధి ఎందుకు పుట్టింది! అంగూర్ చాలామంచిది, పైగా ఆమె భర్త ఆసుపత్రిలో వున్నాడు. నువ్వు అంగూర్‌ను ఏమైనా అంటే రామ్‌భయ్యా చాలాబాధ పడతాడు. ఆ పిచ్చిపిచ్చి ఆలోచనలు మానుకో శివా! మంచిదికాదు."

"తారా: యిప్పుడు నీవు యెన్నిచెప్పినా యిక లాభంలేదు. అంగూర్‌ను అనుభవించకుండా నేను బ్రతక లేను. రాత్రింబవళ్ళు నేను అంగూర్‌ను గురించే ఆలోచిస్తున్నాను. నాకు తిండికూడా సహించటంలేదు."

శివానాయక్ ఏదో ప్రమాదం తలపెడతాడని తార భయపడింది. జాగ్రత్తలోవుండమని అంగూర్‌ను హెచ్చరించాలనుకుంది ఆమె.

ఆ రోజు ఉదయం అంగూర్ మామూలుగా పనిలోకి పోయింది. గేటుదాటుతుండగా కాపలాదారు సింగు చెప్పాడు. "అంగూర్, పిల్లలందరూ ఇంతకుపూర్వమే చిన్న కారులో నిజాంసాగర్‌కు పోయారు." అంగూర్ ప్రశ్నార్థకంగా అతనివైపు చూచింది. "యెందుకుగాను వెళ్ళారు భయ్యా!"

"ఆఁ, యెందుకేముందీ! చూచిరావడానికి"

"అయితే మళ్ళీ యెప్పుడు తిరిగివస్తారు."

"బహుశా రాత్రికో లేక రేపు ఉదయమో"

అంగూర్ ముందుకు సాగిపోయింది. వంటఇంటి వరండాలో సూర్యకాంతమ్మ ఆమెను పలుకరించింది.

"అయ్యో! పాపం! యిప్పుడు వచ్చేవటే! కొంచెం ముందు వచ్చివుంటే నిన్నుకూడా నిజాంసాగర్‌కు తీసుకుపోవాలని చూచింది పద్మ. కాని నీకు ప్రాప్తిలేదు. ఏమి చేస్తాములే" అంటూ సానుభూతి వెల్లడించింది ఆమె.

అంగూర్ త్వరత్వరగా కిందిపనులన్నీ ముగించి మేడ మీద గదులు తుడవడానికి వెళ్ళింది. పైన ఎవ్వరూ వున్నట్టులేరు. ఒక గదిలోమాత్రం ఒకాయన పడకకుర్చీలో పడుకుని సిగరెట్టు కాలుస్తున్నాడు. మిగిలిన గదులు శుభ్రం చేసి అంగూర్ ఆయనవున్న గదిలోకిపోయి "బాబూ! గది

శుభ్రం చెయ్యాలి, మీరు కాస్సేపు అవతలి గదిలోకి పోతారా?" అని అడిగింది.

అతను కుర్చీలోనుండి లేవలేదు. అంగూర్ వైపు పరీక్షగా చూస్తూ అడిగాడు "యేయ్, ఎవరునువ్వు?"

"లంబాడీలం బాబుగారూ"

"నీ పేరు యేమిటీ?

"అంగూర్"

"ఇక్కడ ఎంతకాలంనుండి పనిచేస్తున్నావు?"

"వారం దినాలనుండి"

"నెలకు ఎంతయిస్తారు?"

"ఏడు రూపాయిలు"

"యింతేనా!"

"భోజనంకూడ పెడుతున్నారు."

"మా ఇంటికి వస్తావా? బట్టలు, భోజనము పెట్టి నెలకు పదిహేను రూపాయలు యిస్తాను"

"ఎక్కడ బాబూ, మీయిల్లు?"

"నాగార్జునసాగర్ దగ్గర"

"అంగూర్ పేలవంగా నవ్వింది"

"యేమి, నవ్వుతావేం"

"ఇక్కడ మాయిల్లూ, సంసారం వున్నాయిగా, నాగార్జునసాగర్‌కు ఎందుకువస్తాను బాబుగారూ"

"యేం, భోజనంపెట్టి పైన డబ్బుకూడా యిస్తామంటున్నానుగా. యిబ్బంది ఏముంటుంది"

"ఇక్కడ నాభర్త వున్నాడుగా"

"యేమి చేస్తున్నాడు"

"అల్విన్‌లో పని. కాని ప్రస్తుతం జబ్బుచేసి ఆసుపత్రిలో వున్నాడు" అని చెప్పి ఆమె వెనకకు తిరిగింది.

"యేం! గది తుడవకుండానే పోతావేం!" అతను ప్రశ్నించాడు.

"తమరు కుర్చీలోనుండి లేవలేదుగా బాబూ!"

అతను చిన్నగానవ్వాడు. "యేయ్, నేను ఎవరినో తెలుసునా"

"తెలియదు బాబూ"

"మీ సూర్యకాంతమ్మగారి తమ్ముణ్ణి"

"మంచిది బాబూ"

"పేరు నరసరాజు"

"మంచిది బాబూ"

"మా అన్నయ్య యిక్కడ పెద్దఅధికారి. నేను పెద్ద కంట్రాక్టరును"

అంగూర్‌కు వినలేక విసుగు తోచింది. "నాకు యింకా చాలా పనుంది బాబూ. పైకి పోవాలి" అంటూ ఆమె వెనకకు తిరిగింది. అతను కుర్చీలోనుండిలేచి నిలబడ్డాడు. ఐదుఅడుగులబారూ, నాలుగుఅడుగుల కైవారం-మనిషి పుష్టిగా బలంగా వున్నాడు. అంగూర్ ఒకచేతిలో చీపురు పుచ్చుకుని ముందునడిచింది. అతను ఆమె చెయ్యి పట్టుకున్నాడు. ఆమె విదిలించుకుంది. అతను వదలలేదు. ఆమె పెనుగులాడింది. అతను గట్టిగా వాటేసుకున్నాడు. ఆమె కంగారుగా కేకలు పెట్టింది. సింగు, నూకరాజు

యిద్దరూ పైకి పరుగుతీస్తూ వచ్చారు. ఆమె నూకరాజు చాటున నిలబడి "అన్నా, మీ బద్మాష్ నన్ను బలాత్కారం చేస్తున్నాడుఅన్నా" అంటూ వెక్కి వెక్కి ఏడ్చింది.

నూకరాజు కొరకొర లాడుతూ నరసరాజు వంక చూచాడు. సింగు నిర్ఘాంతపోయి నిలబడ్డాడు.

నరసరాజు తేరుకుని "అరే సింగూ, దీనిని పోలీసు స్టేషనుకు తీసుకుపో, దొంగముండ నా జేబులో పర్సు కాజేసింది" అన్నాడు సింగువైపు చూస్తూ.

నూకరాజు కల్పించుకుని అన్నాడు "ఏమయ్యోయ్, నరసరాజుగారూ! నువ్వో మహా తెలివికలవాడివని అనుకుంటున్నావేమో, నువ్వు తెలివితక్కువపని చేసి పైగా ఆమెకు ఎదురు రంకుకడతావటయ్యా!"

నరసరాజు మండిపడ్డాడు. "ఛా, నోరుముయ్యి, గాడిదా! పళ్లు రాలగొడతా" అన్నాడు.

నూకరాజు ముందుకుపోయి నరసరాజు చొక్కా పట్టుకుని "యేదీ, రాలగొట్టు చూస్తాను" అంటూ చెయ్యి పైకిలేపాడు! సింగుపోయి నూకరాజును యివతలికి లాగాడు. అంగూర్ యీలోపున కిందికిదిగి ఎవ్వరికీ చెప్పకుండా వెళ్ళిపోయింది.

నూకరాజు, సింగూ. నెమ్మదిగా వెనకకువచ్చారు. నరసరాజు మళ్ళీ కుర్చీలో పండుకొని సిగరెట్టు ముట్టించాడు. అవమానంతో అతని మనస్సు వికలమైంది. అతను చేతిలోవున్న సిగరెట్టు అవతలికి విసిరి బీరువా తెరచి వైట్ హార్సు విస్కీ సీసా బిరడాతీసి నోటికిపట్టించాడు. తరవాత

సీసా బిరడాబిగించి మళ్ళీ యధాస్థానంలో పెట్టి బీరువా మూశాడు. అతను మేడ నలువైపులాతిరిగి చూచాడు. యెవ్వరూ అగుపించలేదు. వంటయింటి వసారాలో నూకరాజు సూర్యకాంతమ్మ ఘర్షణపడుతున్నారు. వారి సంభాషణను అతను శ్రద్ధగా వినసాగాడు.

"నాకు అవన్నీ అనవసరం. నాడబ్బు నాకు లెఖ్ఖచూచి యివతల పారెయ్యి. నేను యిప్పుడేపోయి కారో, రైలో ఎక్కి అవతలికిపోతాను. నీ కొంపలో క్షణం వుండదలచుకోలేదు" అంటున్నాడు నూకరాజు.

"తొందరపడకు నూకరాజూ, ఆ పనిమనిషిగురించి నువ్వు వెళ్ళిపోవడం ఎందుకూ!"

"యీ అన్యాయం నేను చూడలేనులేవమ్మా! నీ తమ్ముడు ఆ పిల్లను బలాత్కరించి, పైగా దానికి దొంగతనం కడతాడా?"

"అక్కడఏమిజరిగిందోమనంచూడలేదుగానూకరాజూ!"

"చూడడానికేముందమ్మా! అంతా కళ్ళకుకట్టినట్టు తెలిసిపోతుంటేనూ, పైగా నన్ను పళ్ళు రాలదన్నుతానంటాడా, నీ తమ్ముడు? ఆ సింగు అడ్డంవచ్చి వుండకపోతే తెలిసేది, ఎవడిపళ్ళు రాలేయో!"

"పోనీలే నూకరాజూ, ఆ విషయం మరచిపో!"

"అదేమీ వీలుపడదు, నాడబ్బు యివతలపారెయ్యి, నేను పోతాను."

రెండునిముషాలు మౌనంగా గడిచాయి. సూర్యకాంతమ్మ నెమ్మదిగా అంది "నూకరాజూ, నువ్వు గట్టిగా

వెళ్ళిపోతాను అంటే, నీడబ్బు యిచ్చేస్తాను, కాని...."

"ఏమిటో ఆ కాని... చెప్పు అదికూడా"

"నువ్వు అంత గట్టిగా మాట్లాడవద్దు నూకరాజూ" ఆమె బ్రతిమాలుతూ అంది.

"సరే, చెప్పు"

"నేను నీకు వ్రాసినజాబులు నీ దగ్గరేవుండాలిగా! అవి నాకు యిచ్చెయ్యి. నీకు కావలసినడబ్బు యిస్తాను వెళ్ళి పోదువుగాని"

"ఏమి యివ్వదలచుకున్నావో అదికూడా బయట పెట్టరాదూ!"

"నీకు ఏమికావాలో నువ్వే అడుగు నూకరాజూ!"

రెండునిముషాలు మళ్లీ మౌనంగా గడిచాయి. నూకరాజు అడిగాడు, "నాకు రెండువేలు యివ్వు. నీ జాబులన్నీ నీకు యిచ్చేస్తాను. మన ఇద్దరిమధ్యా పేచీ అంటూ వుండదు."

"అమ్మబాబోయ్, రెండువేలే! అంత మొత్తం నేను ఎక్కడ తేగలను నూకరాజూ?"

"నీభర్త కంట్రాక్టులుచేసి లక్షలుగడిస్తున్నాడుగా!"

"ఆయన సంపాదిస్తున్నారేమో! నాచేతికి ఎలా వస్తాయి నూకరాజూ!"

"నువ్వు తేదలచుకుంటే రెండువేలుకాదు, యిరవై వేలు అయినా తేగలవు"

సూర్యకాంతమ్మ రెండునిముషాలు ఆలోచనలో మునిగింది. యేదో ప్రమాదాన్ని యెదుర్కోబోతున్నట్టు

ఆమె గడగడలాడింది. ఆమె కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. "నూకరాజూ, ఒక వెయ్యిరూపాయిలుమాత్రం యిచ్చు కుంటాను అంతకంటె నా వల్ల యేమీకాదు. నన్ను ఇంత టితో క్షమించి వదిలెయ్యి నూకరాజూ. నా జాబులన్నీ నాకు యిచ్చేస్తానని నీవు మాటయిస్తే చాలు. నీమీద నాకు అవిశ్వాసం వుంది."

నూకరాజు వ్యంగ్యంగా నవ్వాడు. "యేమమ్మా! నీ పెద్దకూతురు కమల వాల్తేరులో వున్నప్పుడు ఆ హాస్పి టలు కాంపౌండరును పట్టుకుని మెడికల్ విద్యార్థి అని భ్రమపడి వెనకాముందూ చూడకుండా వాడికి జాబులు మీదజాబు వ్రాసింది. అవి బయటపెడతానని వాడు బెది రించినప్పుడు మీరు వాడికి యెంత ఇచ్చారో గుర్తువుందా?"

"నాలుగువేలు"

"అందులో సగమేగా, నేను యిప్పుడు అడుగు తుంటా"

సూర్యకాంతమ్మ తల కిందికి దించుకుంది. పదినిమి షాల తర్వాత ఆమె నూకరాజువైపు చూస్తూ అంది, "సరే నూకరాజూ. రెండుదినాలు వ్యవధియివ్వు. ఆ మొత్తం చూచి యిస్తాను. అంతవరకు మన యిద్దరిమధ్య పొరపు వచ్చినట్టు ఎవ్వరికీ తెలియకూడదు."

నూకరాజు అక్కడనుండి వంటఇంట్లోకి పోయాడు. సూర్యకాంతమ్మ వెంటనే అతనిని వెనకకుపిలిచి "నాకు ఒక కప్పు కాఫీచేసి యివ్వగలవా!" అని అడిగింది. అతను కాఫీ అందిస్తుంటే జాలిగా అతని కళ్ళల్లోకి చూస్తూ అంది.

"నూకరాజూ! పిల్లలుగలదాన్ని, పెద్దతనంకూడా వచ్చేసింది. నన్ను యిక అల్లరి పెట్టకు నూకరాజూ!"

నేను అల్లరిపెట్టేవాడినే అయితే యింతకాలం ఎందుకు వుంటానమ్మా! నమ్మినవాళ్ళకు ద్రోహంచేసే దుర్బుద్ధి నాకులేదు, కాని నీ తమ్ముడుచూడు, పంకజాన్ని పట్టుకుని చెరచాలని చూచాడు. ఆ అమ్మాయి యెదురు తిరిగి గల్లంతుచేసేసరికి ఆమెకు దొంగతనం అంటగట్టాడు. పైగా పోలీసుస్టేషనుకు పంపుతానన్నాడు. న్యాయంఎక్కడ వుందంటావు? అనడిగాడు నూకరాజు. ఆమె మాట్లాడలేదు.

వారి సంభాషణ వింటున్నంతసేపూ నరసరాజు మేడమీద చిందులు తొక్కాడు. "నయానో, భయానో నూకరాజు చర్యలను అరికట్టాలి, లేదా తుదముట్టించాలి" అనుకున్నాడు అతను. కాని నూకరాజును నయాన లోబరుచుకునే అవకాశం తనకు యికలేదు. భయాన అతనిని సాధించేమార్గం యేమిటా! అని నరసరాజు ఆలోచించాడు. ఎంతసేపు ఆలోచించినా అతనికి యే మార్గమూ అగుపించలేదు అతను కిందకిదిగి తనకారు తీసుకొని బయటికి వెళ్ళాడు.

నూకరాజు వంటచేసి తనుపోయి తన గదిలో పండుకున్నాడు. అతనికి పంకజం గుర్తుకువచ్చింది. "పాపం ఆ అమ్మాయి యేమిచేస్తోందో!" అనుకున్నాడు అతను. అప్పటికి సాయంకాలం అయింది. అతను లేచి సరాసరి పంకజం యింటికి వెళ్ళాడు. ఆమె ఒటరిగా ఇంట్లో కూర్చొనివుంది. నూకరాజు రావడంచూచి ఆమె లేచి

నిలబడి "రా, అన్నా"అంటూ ఆహ్వానించింది. నూకరాజు, ఆమెతో పదినిముషాలు మాట్లాడాడు.

"పంకజం, నేనూ ఆ ఇంట్లో పనిమానేశాను. ఒకటి రెండు రోజులలో యిక్కడనుండి వెళ్లిపోతాను"

"సూర్యకాంతమ్మగారు ఏమంటూంది?"

"ఏమంటుంది? వాళ్లు అంతా ఒకటే. నీవు ఇక వారి ఇంటికిపోవద్దు"

"నాకు రావలసిన జీతండబ్బులు తెచ్చుకోవద్దూ!"

"పంకజం, నీకు ఎంతకావాలో చెబితే నేను ఇస్తాను. ఆ డబ్బులకోసం నీవు మళ్లీ అక్కడకు పోవద్దు"

"వెళ్ళితే నన్ను ఏమిచేస్తారు. రేపు పద్మ వాళ్ళు వచ్చినతరువాత పోయి నా జీతం అడిగితెచ్చుకుందామనుకుంటున్నా"

"వద్దమ్మా; వాడు నిన్ను అంత అవమానంచేసిన తరువాత నీవు మళ్లీ ఆ వెధవడబ్బులుకోసం అక్కడకు పోవడం మంచిదికాదు. నీకు కావలిస్తే నేను పదిరూపాయిలు యిస్తాను తీసుకో. శివరామ్‌గారు వచ్చినతరువాత నేను ఆయనగారిని కలుసుకుని మాట్లాడుతాను" అంటూ అతను లేచి నిలబడి జేబులోనుండి పదిరూపాయిలుతీసి పంకజానికి యివ్వబోయాడు. ఆమె "వద్దు అన్నా" అంది అతను బలవంతంమీాద ఆ పదిరూపాయలు ఆమె చేతిలో పెట్టి బయటికి నడిచాడు.

గుమ్మంలో శివానాయక్, లంగడా నూకరాజును నిలవేశారు. "యేయ్! ఎవరునువ్వు? శివానాయక్ డబాయిం

చాడు. నూకరాజు సమాధానం చెప్పకముందే లంగడా అతనిమీద కలియబడ్డాడు. అంగూర్ కేకలు పెట్టింది. ఘనే నాయక్, జోరా, తారా పరుగెత్తుకుంటూ వచ్చారు.

అంతా యేకమై ఆ ముగ్గురినీ విడదీశారు "మగ వాళ్ళు ఎవ్వరూ లేకుండా చూచి నువ్వు ఆ ఇంట్లో ఎందుకు జొరబడ్డావు?" శివానాయక్ నూకరాజును సవాలు చేశాడు.

"ఆమె పనిలోకి రాకపోతే పిలుద్దామని వచ్చానురా, నువ్వు ఎవడివిరా, నన్ను అడగటానికి" నూకరాజు గట్టి గానే ఎదుర్కొన్నాడు. ఘనేనాయక్ సర్ది చెప్పి నూకరాజును సాగనంపాడు. అంగూర్ చాలా బాధపడింది.

ఆ రాత్రి శివానాయక్ తారను అంగూర్ యింటికి పోవద్దన్నాడు, జోరా, లంగడా అతనిని సమర్థించారు. ఘనేనాయక్ మాట్లాడలేకపోయాడు. అంగూర్ బిక్కు-బిక్కు మంటూ పండుకుంది. ఆమె ఆలోచనలు పరిపరివిధాల పోయాయి. రామ్ హాస్పిటలునుండి బయటికి వచ్చేంతవరకు తను తండ్రి దగ్గరకుపోయి వుందామనుకుంది. చాలా ప్రొద్దు పోయినతరువాత ఆమెకు మగతగా నిదురపట్టింది. మంచం దగ్గర ఎవరో కదలినట్లనిపించింది. ఆమె దిగ్గున లేచి కూచుంది. ఇంట్లో దీపంలేదు.

"నేనే అంగూర్, భయపడబోకు" ఎవరిదో కంఠం పలికింది.

"ఎవరు నువ్వు?" ఆమె గట్టిగానే అడిగింది.

"శివానాయక్ ని"

"శివా: నువ్వా, ఎందుకు యిక్కడకువచ్చావు?"

"నువ్వు భయపడుతుంటావని వచ్చాను అంగూర్"

"నాకు భయంలేదులే, ముందు నువ్వు యిక్కడి నుండి బయటికి నడు."

"నేను పోకపోతే యేమిచేస్తావు?"

"మీ అమ్మను, నాయనను పిలుస్తాను" అంటూ ఆమె గుమ్మంవైపు నడిచింది. అతను అమాంతం వాటేసుకుని కిందపడవేసి ఆమెను అదిమిపట్టాడు. ఆమె పెనుగులాడింది. అతను అవకాశం యివ్వలేదు. ఆమె బట్టలు తొలగించే ప్రయత్నంలో అతనిపట్టుసడలింది. ఆమె కాలు పైకితీసుకుని అతని డొక్కలో తన్నింది. అతను నేల మీద వెల్లికిలాపడ్డాడు. ఆమెలేచి బయటికి పరుగుతీసింది. ఆమె వంటిమీద బట్టలేదు. ఘనేనాయక్ ఇంటిముందు నిలబడి "బాబా! శివాయ్ చూడు బాబా!" అంటూ గొల్లున యేడ్చింది.

ఘనేనాయక్, జోరా, తారా బయటికివచ్చారు. అంగూర్ తారను కౌగలించుకుంది" తారా, శివాయ్ నామీద పడ్డాడు. తారా" అంటూ ఏడ్చింది. జోరా బట్ట తెచ్చి అంగూర్‌కు యిచ్చింది. ఘనేనాయక్ అంగూర్ ఇంట్లో జొరబడ్డాడు. దీపంలేదు.కటికిచీకటి. అతను తారను పిలిచి దీపం తీసుకురమ్మన్నాడు. తార వచ్చి బుడ్డి వెలిగించింది. ఇంట్లో శివాయిలేదు. ఘనేనాయక్ అటకమీద వెతికాడు, అక్కడాలేదు.

తార తిరిగిపోయి చెప్పింది. "అక్కడ చిన్నన్నాయి లేడే" అంది.

"అంగూర్ బాధపడింది. "మన శివాయో, మరి యెవడన్నానో!" అంది జోరా. "మన చిన్న అన్నయ్యే అమ్మా! అందుకు సందేహంఏమీలేదు. వాడు నిన్ననే చెప్పాడు నాతో" అంది తార.

"ఏడీ, శివాయ్ ఎక్కడచచ్చాడు!" అంటూ ఘనే నాయక్ లోపల ప్రవేశించాడు. "ఎటు పొయ్యాడో" అంది జోరా.

"ఇంటికి రానియ్యి గాడిదకొడుకుని, ఎముకలు విరగ కొడతా" అన్నాడు ఘనే నాయక్.

తెల్లవారకపూర్వమే అంగూర్ లేచి తనబట్టలన్నీ మూటకట్టుకుని జోరాకు చెప్పింది. "మామ్మా, నేను మా నాయనదగ్గరకు పోతాను. రామ్ హాస్పిటలునుండి బయటకు వచ్చేంతవరకు అక్కడేవుంటాను. మా యిల్లు కాస్త కనిపెట్టుకునివుండుమామ్మా!"

"మంచిది పోయిరా అమ్మా" అంది జోరా.

"ఆసుపత్రిదాకా, తారను జతతీసుకుపోతాను మామ్మా, రామ్‌ను చూచినతరువాత తార యింటికి తిరిగి వస్తుంది."

"తార నీకూడావస్తే ఇక్కడ నీళ్ళు ఎవరు తెస్తారు?" అంది జోరా.

"నీళ్లు నేను చేరబోస్తానులే, మీరు యిద్దరు బయలు దేరి పొండమ్మా" అన్నాడు ఘనేనాయక్.

"అంగూర్, తారా, యిద్దరు నెమ్మదిగా కబుర్లు చెప్పుకుంటూ బయలుదేరారు. తార అంది "అంగూర్, మొన్న అంగడిరోజున మా నాయన నాకు రెండు రూపాయలు యిచ్చాడు. అవి నేను ఖర్చు చెయ్యనేలేదు, నీకు అవసరం అయితే అవి తీసుకో అంగూర్. మళ్ళీ ఎప్పుడైనా తిరిగి యిద్దువుగాని"

"వద్దు తారా, నా దగ్గర పదిరూపాయలకు పైగానే వున్నాయి. మా రామ్ కావాలంటే అందులో కొంత అతనికి యిస్తాను. మా నాయనదగ్గరకుపోతే నాకు ఖర్చు యేమీ వుండదుగా! నాకు యింకా డబ్బుతో అవసరం యేమి వుంది?"

"మళ్లీ ఎప్పుడు తిరిగివస్తావు అంగూర్"

"మా రామ్ ఆరోగ్యం కుదుటపడినతరువాత"

"నువ్వు బంగళాలో పనిచెయ్యటం మానుకున్నావా"

"మానుకున్నాను తారా!"

అంగూర్ వెంటనే సమాధానం చెప్పలేదు. అక్కడ జరిగిన ఘటనలు ఎవ్వరికీ చెప్పకూడదని ఆమె అంతకు పూర్వమే నిర్ణయించుకుంది. రెండునిముషాలు తటపటాయించి "ఆ ఇంటివాళ్లు మంచివాళ్ళుకారు తారా! అందుకే మానుకున్నాను."

"మరి నిన్నసాయంకాలం వాళ్ళవంటాయనవచ్చాడే నీదగ్గరికి"

"అవునుతారా! నిన్న వుదయమే ఆ ఇంటివారికీ

నాకూ ఘర్షణజరిగింది. నేను ఎవ్వరికీ చెప్పకుండా వచ్చేశాను. ఆ వంటాయన మంచివాడు. నా జీతండబ్బులు ఇచ్చిపొయ్యాడు. ఆ భాగ్యానికే మీ అన్నలు యిద్దరు పెద్దరగడచేశారు" అంగూర్ చేసిన విమర్శవిని తార చిన్నబుచ్చుకుంది "ఆ విషయం ఇక వదిలెయ్యి అంగూర్" అంది.

ఎర్రగడ్డ సమీపించారు. అప్పటికే ఉదయం ఎనిమిదిగంటలు అయ్యింది. "అంగూర్, ఆ హోటలుకుపోయి చా తీసుకుందాం" అంది తార. అంగూర్ ఆమోదించింది. గోట్టెతిని, చా తీసుకున్నారు. బిల్లు తార చెల్లించింది. రామ్ కోసం అంగూర్ రెండు బన్నులు పొట్లంకట్టించింది. గేటు దాటి హాస్పిటల్‌లోనికి పోయారు. వారిని చూచి రామ్ చాలా సంతోషించాడు.

"ఈరోజు ప్రొద్దుటే వచ్చారే, యేమిటీ కారణం?" అన్నాడు అతను.

అంగూర్ చెప్పుకుపోయింది. "రామ్ నీవేమో యిక్కడ ఆసుపత్రిలో వుంటివి. నీవు లేకుండా నాకు బయట ఏమీ తోచదు. నిన్నటినుండి ఆ బంగళాలో పనికూడ మానేశాను. నీ అరోగ్యం బాగుపడేవరకు నేను కూనాయనదగ్గరే వుండిపోదామనుకుంటున్నాను? నీఅభిప్రాయం చెప్పు రామ్" ఆమె జాలిగా అతని కళ్ళల్లోకి చూచింది. అతను నీరసంగా నవ్వాడు. అలాగేవెళ్లు, అంగూర్, కాని యెప్పుడైనా వచ్చి నన్ను చూచిపోతుంటావుగా?"

"నీవు ఎప్పుడు రమ్మంటే అప్పుడు వస్తాను, రామ్"

"మరి చాలాదూరం నడవాలిగా"

"దేనికి, అక్కడ అరమైలుదూరంనడిస్తే బస్సు చిక్కుతుంది. దానిలో యెక్కితే యీ ఆసుపత్రిముందు దిగవచ్చుగా"

"మరి బస్సు ఛార్జీలకు పైసలు"

ఆమె సంచితీసి చూపెట్టింది. పదిరూపాయలు, పైన చిల్లర వున్నాయి. "ఇందులో నీకు ఎంత అవసరమో తీసుకో రామ్"

"నాకేమీ అవసరములేదు అంగూర్, నీ దగ్గరే వుంచుకో."

అంగూర్ బన్నులపొట్లం అతనికి యిచ్చి "మేము పోయివస్తాము రామ్" అంది. అతను మందస్మితంచేశాడు. "భయపడకు అంగూర్, నేను త్వరలోనే బయటికి వచ్చేస్తాను" అన్నాడు రామానాయక్.

హాస్పిటలునుండి బయటికివచ్చిన తరువాత అంగూర్ తారతో అంది. "తారా, రాత్రి శివానాయక్ చేసిన అల్లరినిగురించిన ప్రస్తావన రామ్‌దగ్గర యెప్పుడూ తేవద్దని అమ్మకు, నాన్నకు చెప్పు అమ్మా" బస్సువచ్చి రోడ్డుమీద నిలబడింది. అంగూర్ దానిలో ఎక్కింది. తార బయలు దేరిపోయింది.

# 6

సూర్యకాంతమ్మ ఆ ఉదయం కొంచం ఆలస్యంగా పడకనుండి లేచింది. నిజామ్‌సాగర్ చూడడానికి పోయిన పిల్లలు యింకా తిరిగిరాలేదు. ఇంట్లో ఎక్కడా చడీచప్పుడు లేదు. "నూకరాజుకూడా యింకా లేచినట్టులేదు. పిల్లలు ఎప్పుడువచ్చి దిగుతారో! నూకరాజునులేపి టిఫిను, కాఫీ తయారుచేయించాలి" అనుకుందామె.

ఆమె పోర్టికోలో నిలబడి సింగును పిలిచింది. అతను ఆమెకు సలాముచేసి చేతులుకట్టుకుని ఎదురుగా నిలబడ్డాడు.

"సింగూ, పనిమనిషి అంగూర్ యేమైనట్లు!"

"తెలియదు అమ్మగారూ"

'అది మాటమాత్రంకూడా చెప్పకుండానేపోయిందే'

"యేమో! అమ్మగారూ"

"అయితే మరో పనిమనిషిని పిలుస్తావా?"

"ఇప్పుడా అమ్మగారూ!"

"అవును, యిప్పుడే సింగూ, పిల్లలు ఎప్పుడువచ్చి దిగుతారో, పని చాలావుంది. త్వరగాపోయి ఎవరినైనా తీసుకురావాలి"

సింగు ఆమెకు మళ్ళీ సలాముచేసి వెనుకకుతిరిగాడు. సూర్యకాంతమ్మ ఇంట్లోకి నడిచింది. స్టోరురూము ప్రక్కన వున్న చిన్నగది నూకరాజు పడకగదిగా వుపయోగించుకుం

టున్నాడు. అతని పెట్టె, పరుపు, బట్టలు అన్నీ ఆ గదిలోనే వున్నాయి.

సూర్యకాంతమ్మ తలుపునెట్టి చూచింది. తలుపులు లోపల బిగించి వున్నాయి. ఆమె నెమ్మదిగా పిలిచింది. కాని సమాధానంలేదు. గట్టిగా తట్టింది. కేకపెట్టిపిలిచింది. లోపల అలికిడిలేదు. ఆమె అక్కడినుండి వసారాలోకి పోయి కిటికీదగ్గర నిలబడి లోపలికి చూసింది. లోపల చీకటిగావుంది. కిటికీకి చువ్వలులేవు. ఆమె కిటికీ తలుపులు పూర్తిగా తెరచి లోపలికి చూచింది. ఆ దృశ్యం చూడలేక వెర్రిగా కేకపెట్టి ఆమె అక్కడే కూలబడింది. పదినిముషాలు గడిచాయి. ఆమె తేరుకుని నెమ్మదిగా తన గదిలోకిపోయి మంచంమీద వాలింది. మరో అరగంట గడిచింది. ఆమె తేరుకుని గదినలువైపులా చూచింది. ఎదురుగా ఫోన్ అగుపిస్తోంది. ఆమె రిసీవరు అందుకుని నెంబరు చెప్పింది.

అవతలినుండి "ఎవరూ?" అని ప్రశ్న.

"నేనుసూర్యకాంతమ్మను,అన్నయ్యతోమాట్లాడాలి."

రెండు నిముషాలతరువాత మళ్ళీ ప్రశ్న "ఎవరమ్మా!" సూర్యకాంతమేనా!"

"అవును అన్నయ్యా"

"యెందుకమ్మా, పిలిచావు"

"యేమిచెప్పమంటావు అన్నయ్యా, నాకు దడపుడుతూంది. నీవు వెంటనే బయలుదేరి రావాలి. అంతకుమించి నేనేమీ చెప్పలేను అన్నయ్యా"

అవతల రిసీవరు క్రిందపెట్టేశారు. సూర్యకాంతమ్మ కూడా రిసీవరు యథాస్థానంలోవుంచి తాను మంచంమీద తాపీగా పండుకుంది. ఆమె ఆలోచనలు పరిపరివిధాల పోయాయి. యీ ఆపద గడిస్తే ఏడుకొండలవాడికి వెయ్యి నూటపదహార్లు చెల్లించుకుంటానని మొక్కుకుంది. కొద్ది నిముషాలు గడిచాయి. ముందు పోర్టికోలో కారువచ్చి ఆగింది. "బహుశా రామరాజు అన్నయ్య వచ్చివుంటాడు" అనుకుందామె. ఆ మరుక్షణంలో రామరాజు తలుపుతోసుకుని లోపలికి వచ్చాడు.

"ఏమిటమ్మా, యిల్లు అంతా నిర్మానుష్యంగా వుంది?"

"అవును అన్నయ్యా, నిన్న పిల్లలు నిజామ్‌సాగర్ చూడటానికి పోయారు,"

"గేటులోవుండేవాడు యేమయ్యాడు?"

"పనిమనిషికోసం పంపించాను అన్నయ్యా

"నన్ను పిలిచినపని యేమిటమ్మా?"

"మాకువంటచేసే నూకరాజును హత్యచేశారు, అన్నయ్యా!"

రామరాజు ఒక్కసారిగా నోరు తెరిచి "ఆఁ, ఆఁ" అన్నాడు.

ఆమె చెప్పుకుపోతూంది. "అన్నయ్యా, నిన్న మన నరసరాజు యిక్కడే వున్నాడు. యింట్లో పనిచేసేవానిని గురించి మన నరసరాజు, వంటవాడు పేచీపడ్డారు. ఇద్దరూ కలబడబోతే కాపలావాడు సింగు వెళ్ళి విడదీశాడు. అంతే!

ఆ తరువాత నూకరాజు యిక్కడనుండి వెళ్ళిపోవడానికి అన్నీ సర్దుకున్నాడు. కాని రాత్రే ఎవరో అతన్ని హత్య చేశారు."

"యెవరుచేసి వుంటారంటావు?"

"యేమో అన్నయ్యా, నేను ఎలా చెప్పగలుగుతాను"

"నరసరాజు ఎక్కడ వున్నాడు."

"తెలియదు అన్నయ్యా"

"ఇక్కడనుండి యెప్పుడు వెళ్ళిపోయాడు?"

"నిన్న ఉదయం పదిగంటల సమయంలో కారు తీసుకు వెళ్ళిపోయాడు. తిరిగి రాత్రి ఒంటిగంట సమయంలో వాడి కారువచ్చింది. తరువాత యేమైందీ నాకు తెలియదు అన్నయ్యా."

రామరాజు రెండు నిముషాలు ఆలోచించాడు. "ఇప్పుడు ఇంట్లో యింకా ఎవరెవరున్నారు?"

"యెవ్వరూలేరు అన్నయ్యా"

"ఆ వంటవాడు యెక్కడా?"

"వెనక వరండాలో ఆస్టోరురూము ప్రక్కన చిన్న గదిలో"

రామరాజు సూర్యకాంతమ్మనుకూడా తీసుకుని అక్కడకు వెళ్ళాడు. తలుపులు గట్టిగా నొక్కి చూచాడు. అవి విడలేదు. పక్కకుపోయి కిటికీలోనుండి లోపలికి దిగి తలుపులు తెరిచాడు. యీ లోపున సూర్యకాంతమ్మ పోయి సింహద్వారం మూసివచ్చింది.

సూకరాజుశవం మంచంమీద వెల్లికిలా పడివుంది. అతనినోరూ, కళ్ళూ తెరిచేవున్నాయి. బట్టలన్నీ రక్తంతో తడిసి అంటుకుపోయాయి. రామరాజు పరీక్షగా చూచాడు. గుండెల్లో ఒక పెద్దగాయం! "యే గడ్డపలుగో వుపయోగించి వుంటారు" అన్నాడు ఆయన.

తలుపులన్నీ జాగ్రత్తగామూసి యిద్దరూపోయి సూర్యకాంతమ్మగదిలో కూచున్నారు. సూర్యకాంతమ్మ కుమిలికుమిలి యేడ్చింది. "అన్నయ్యా, యీ గండంగడిచే మార్గమేమిటి అన్నయ్యా."

రామరాజు విసుక్కున్నాడు. "ఇస్సో, నీవు కాసేపు ఆ యేడుపు ఆపవమ్మా. యేమిచేస్తాం! యేదోవిధంగా మాపుచేసుకోవాలి. నరసరాజు ఎక్కడవచ్చాడు!"

"యేమో అన్నయ్యా! వాడు ఈమధ్య విపరీతంగా తాగుతున్నాడు. వాడు యిక్కడకు వచ్చినప్పుడల్లా బ్రాందీ,విస్కీ,సీసాలు తెచ్చి ఆ బీరువాలో దాస్తాడు. పిల్లలుగల కొంప. అవి యిక్కడకు తీసుకురావద్దురా నాయనా, అని యెన్నోసార్లు చెప్పాను. అయినా వాడికి లక్ష్యంవుంటేగా. నిన్న ఆ తాగినమైకంలో పనిమనిషి యేదో అనేసరికి అది గల్లంతుచేసింది. వంటవాడు కల్పించుకున్నాడు. చివరకు యీ విధంగా పరిణమించింది"

"యీ అఘాయిత్యం వాడేచేశాడో, మరెవడన్నా చేశాడో యిప్పుడప్పుడే మనమేమీ చెప్పలేమమ్మా! అయినా యీ విషయం బయటకు పొక్కకూడదు. మనం యిప్పుడే జాగ్రత్త పడాలి" అన్నాడు రామరాజు.

సింహద్వారంలో సింగు నిలబడి "అమ్మగారూ" అని పిలిచాడు. సూర్యకాంతమ్మ గదిలోనుండి బయటకువచ్చి

"ఏమిటి, సింగూ!" అంది.

"పనిమనిషి యెవ్వరూ దొరకలేదు అమ్మగారూ"

రామరాజు గుమ్మంలో నిలబడి "పనిమనిషి ఎందుకుగాని సింగూ, నీవుపోయి మన నరసరాజుగారిని తీసుకురావాలి" అన్నాడు.

"నరసరాజుగారు ఎక్కడవున్నారు బాబూ" సింగు ప్రశ్నించాడు.

"ఆయన ఎక్కడికిపోయేదీ నీకు చెప్పిపోలేదూ"

"లేదు బాబుగారూ"

"ఇక్కడనుండి ఎప్పుడు బయలుదేరాడూ?"

"తెల్లవారుఝామున నాలుగుగంటల వేళ "

"బహుశా రిడ్జి, బృందావన్, రాయల్ హోటళ్ళలో ఎక్కడో వుంటాడు. నీవు వెతికి పట్టుకుని తీసుకురావాలి"

"సరే బాబుగారూ!"

"సాయంకాలానికైనా సరే వెతికి పట్టుకోవాలి"

అట్లాగే బాబుగారూ"

"సూర్యకాంతమ్మ పర్సులోనుండి నాలుగు రూపాయిలు తీసి సింగుచేతిలో పెట్టింది. సింగు బయలుదేరిపోయాడు.

"ఇప్పుడు మనం ఒకపనిచెయ్యాలి సూర్యకాంతం" అన్నాడు రామరాజు.

"అదేమిటో చెప్పు అన్నయ్యా" అంది ఆమె.

"వంటవాడి శరీరంమీదవున్న ఆ రక్తపు బట్టలు మార్చి మంచిబట్టలు తొడగాలి"

"సరే! అన్నయ్యా"

అన్నా చెల్లెళ్లు యిద్దరు యేకమై సూరరాజు వంటి మీదవున్న గుడ్డలు అన్నీ మార్చి మంచిగుడ్డలు వేశారు. పక్కదుప్పట్లుకూడా మార్చారు. రామరాజు ఆ రక్తపు గుడ్డలన్నీ ఒకచోట పోగుగాపెట్టి వాటిమీద పెట్రోలు చల్లి అగ్గిపుల్లగీసి ముట్టించాడు. అతను చెల్లెలు వెపుచూస్తూ అన్నాడు "సూర్యకాంతం, యిప్పటికి సగంపని పూర్తి చేశాం. ఇక మిగిలినది వీడి దహనం. వీడు పాముకరచి చచ్చిపోయాడని చెబుదాం. నేను మా ఇంటికిపోయి నలుగురుమనుష్యులను చూచి పంపుతాను. వాళ్ళతో నీవు ఏమీమాట్లాడవద్దు. మిగిలినపని వాళ్ళే పూర్తిచేస్తారు"

"యేమో! అన్నయ్యా నాకు భయంగావుంది. నన్నువదలిపెట్టిపోకు అన్నయ్యా, నేను వంటరిగా యిక్కడ వుండలేను" అంది సూర్యకాంతమ్మ.

రామరాజు నాలుగునిముషాలు ఆలోచించాడు. అతను ఫోను రిసీవరు తీసుకుని ఒకరు ఇద్దరితో మాట్లాడాడు. అరగంట తరువాత పదిమంది మనుష్యులు వచ్చారు. రామరాజు స్వయంగా దగ్గరవుండి శవదహనం పూర్తిచేయించాడు. సూర్యకాంతమ్మ స్వేచ్ఛగా గాలి పీల్చుకుంది. తెల్లవారి కాఫీకూడా తాగలేదు. ఆమెకు ఆకలి అనిపించింది.

ఆమె వంటఇంటిలో ప్రవేశించింది. గ్యాస్ పొయ్యిలు రెండు ముట్టించి కాఫీ తయారుచేసింది. రెండు ఫ్లాస్కులనిండా కాఫీపోసి తను ఒకగ్లాసునింపుకుని అది చప్పరిస్తూ కుర్చీలోకూచుంది. అనుక్షణం ఆమెకు నూకరాజు జ్ఞప్తికివస్తున్నాడు. అతను తనకు నమ్మినబంటు. తను యేపనిచెప్పినా అది సాధించేవరకూ అతను నిద్రపోయేవాడుకాదు. అతను ఇంత దారుణంగా హత్యచెయ్యబడతాడని ఆమె ఎన్నడూ వూహించలేదు. అతనిపట్ల ఆమెకు సానుభూతి వుంది. అందుకే అతనికోసం ఆమె బాధపడుతూంది.

సూర్యకాంతమ్మ కాఫీ తాగుతూండగా ఇంటిముందు పోర్టికోలో కారు నిలబడింది. బహుశ పిల్లలువచ్చి వుంటారనుకుంది. కాని రామరాజుభార్య సరస్వతమ్మ, పిల్లలు ఆ కారులోనుండి దిగారు. సరస్వతమ్మను చూడగానే సూర్యకాంతమ్మ "ఎంతపనిజరిగింది వదినా! మా నూకరాజు మాయమైపొయ్యాడు." అంటూంటే ఆమె కంఠం రుద్ధమైంది. కళ్ళవెంట నీళ్ళుకారాయి. కొంగుతో కళ్ళు వత్తుకుంది.

సరస్వతమ్మ సానుభూతిగా మాట్లాడింది.

"అవును వదినా. చెట్టుఅంతమనిషి పాముకాటుకు బలి అయిపోయాడు. కాస్త ముందుగాతెలిస్తే శవాన్ని అయినా చూచిపోయేదాన్ని. పాపం! ఎంతపని జరిగింది"

"పాపమో! పాడో వాడికి యిట్టారాసిపెట్టి వుంది గాబోలు వదినా! ఆ వెధవ వాత్తేను వదలిపెట్టిరాను

అంటే రానుఅన్నాడు. ఇందుకోసమే గాభోలు బలవతం పెట్టి రప్పించాను.” ఆమె కొంగుతో మళ్ళీ కళ్ళు తుడుచుకుంది.

“పోనియ్యి వదెనా ఏమిచేస్తాం! ముందు క్షణంలో యేమిజరుగుతుందో మనం చెప్పలేముగదా!”

“ఎంతచాకిరి చేసేవాడు వదినా, వాడు ఇంట్లో వుంటే ఎంతమంది బంధువులు, అతిథులు వచ్చినా నేను నిశ్చింతగా గడిపేదాన్ని. యింకెక్కడ దొరుకుతాడు నూకరాజు. అయ్యో నూకరాజూ, యెక్కడమాయమై పోయావురా నాయనా!” అంటూ ఆమె చేతులు నలుపుకుంది.

ఇంటిముందు కారు ఆగింది. పిల్లలు గలగలలాడుతూ కారులోనుండి దిగి లోపలికివచ్చారు. పిల్లలను చూడగానే సూర్యకాంతమ్మకు దుఃఖం పొరుక్కొచ్చింది. “అమ్మా పద్మా, నూకరాజును మాయదారి మృత్యువు ఎత్తుకుపోయిందే నా తల్లీ!” అంటూ కూనిరాగం తీసింది. పిల్లలు నలుగురు నిర్ఘాంతపోయి చూస్తూ నిలబడ్డారు.

సరస్వతమ్మ చెప్పింది “అవునమ్మా! నూకరాజును రాత్రి పాముకరచిందట, తెల్లవారేసరికి చచ్చిపోయాడు. పాపం ఎంతమంచివాడో!”

“అయితే నూకరాజు శవం యేదీ?” చినబాబు అడిగాడు.

“అయ్యో! ఆ కాస్తజీవి పొయ్యాక ఆ శవాన్ని యింకా యిక్కడ వుంచుతారటయ్యా. ప్రొద్దుటే మీ

పెదమామయ్యొవచ్చి దగ్గరవుండి శవదహనం చేయించారు" అంది సరస్వతమ్మ.

"అయ్యో నూకరాజూ!" అంటూ శోకంపెట్టింది. కమల. పద్మ బింకంగా చూస్తూ నిలబడింది.

సూర్యకాంతమ్మ తేరుకుని "డైనింగు హాలులో కూచుందాం పదండి వదినా. కాఫీలు పట్టుకువస్తాను" అంది.

కాఫీలు తాగుతూ నూకరాజు మంచితనాన్ని గురించి తలా ఒకమాటా చెప్పారు. సరస్వతమ్మ అందరినీ తమ ఇంటికి భోజనానికి రమ్మనమని ఆహ్వానించింది.

"నాకు యీపూట భోజనం సహించదు వదినా, నేను రాలేను. పిల్లలను తీసుకుపో" అంది సూర్యకాంతమ్మ.

కార్లురెండూ కదలిపోయాయి. సూర్యకాంతమ్మ ఒంటరిగా తన గదిలోపలికి పోయి కూచుంది. గుమ్మంలో సింగు నిలబడి సలాంచేశాడు. ఆమె ప్రశ్నార్థకంగా అతని వైపుచూచింది. "నరసరాజుగారు ఎక్కడా అగుపించలేదు. అమ్మగారూ"

"అగుపించకపోతే నువ్వేమిచేస్తావులే"

సూర్యకాంతమ్మ గుటకలు మింగింది. రెండునిము షాలతరువాత "నూకరాజు చనిపోయాడు సింగూ" అని చెప్పింది.

సింగు నోరుతెరచి చూస్తూ నిలబడిపోయాడు. "ఎప్పుడు చనిపోయాడు, అమ్మగారూ?"

"రాత్రి"

"ఎలాచనిపోయాడు"

"పాముకరచిందట"

"అయితే నాకు చెప్పలేదేం అమ్మగారూ"

"నాకుమాత్రం తెలుసా సింగూ, శవం గదిలోపడి వుంటే ప్రొద్దుట నలుగురువచ్చి తీసుకుపోయి తగలేశారు"

సింగు' మళ్ళీ యేదోఅడగాలని చూచాడు. ఆమె నీరసంగా అంది "నన్ను యిప్పుడేమీ మాట్లాడించకు సింగూ"

సింగు పోయి గేటులో కూచున్నాడు. పిల్లలు భోజనాలు చేసి కారులో తిరిగివచ్చారు. పద్మ సరాసరి తల్లి దగ్గరకు పోయి కూచుంది సూర్యకాంతమ్మ పరధ్యానంగా కళ్ళు మూసుకుని దిండ్లకు ఆనుకుని కూచునివుంది.

"అమ్మా! నిద్రవస్తోందా" పద్మ ప్రశ్నించింది.

"లేదమ్మా!"

"పంకజం అగుపించడంలేదే అమ్మా"

"నీపంకజంపాడుగాను, ఆముండమూలంగానే యిన్ని తిప్పలు వచ్చాయి.!" సూర్యకాంతమ్మ అనాలోచితంగా అనేసింది.

"పంకజం వల్లతిప్పలు యేమిటమ్మా?" పద్మ నిలదీసి అడిగింది.

సూర్యకాంతమ్మ తేరుకుని "అవునమ్మా, అది ఎవ్వరికి చెప్పకుండా అయిపూ, ఆనాలేకుండా పోయింది. మనం మరోపనిమనిషిని వెతుక్కోవాలిగా" అంది.

తల్లి యిచ్చినసమాధానం పద్మను తృప్తిపరచలేదు.

తల్లి మొదట అన్నమాటలలో యేదోరహస్యం యిమిడి వున్నదని ఆమె వూహించింది. కాని ఆమె పైకి యేమీ అనలేదు. "అమ్మా! అత్తయ్య నీకుకూడా భోజనం పంపించిందమ్మా, పళ్ళెంలో పెట్టి తీసుకువస్తాను, రెండుముద్దలు తిందువుగాని" అంది పద్మ.

"నాకు భోజనం వద్దుతల్లీ, నేనుయిప్పుడు ఏమీ తినలేను"

కమల, మగపిల్లలు యిద్దరు ఆ గదిలోకి వచ్చారు. పద్మ బయటికి నడిచింది. ఆమె సరాసరి సింగుదగ్గరకు పోయి "సింగూ, పంకజం యేమైందీ?" అని అడిగింది. సమాధానం చెప్పటానికి సంకోచించాడు. పద్మ గ్రహించి "ఫరవాలేదు, చెప్పు సింగూ" అంది.

సింగు రెండునిముషాలు తటపటాయించి "ఏమో! అమ్మాయిగారూ, చాలాగొడవ అయ్యింది" అన్నాడు.

"భయంలేదు, చెప్పుసింగూ" పద్మ హెచ్చరించింది.

"నిన్నమీరు నిజాం సాగర్‌కు పొయ్యేముందు మీ చిన్నమామ నరసరాజుగారు మేడమీద వున్నారు"

"అవును; వున్నాడుసింగూ"

"పంకజం పైన గదులుతుడవడానికి పోతే ఆయన దానిని పట్టుకుని బలవంతం చేశాడు. అది గట్టిగా ఏడ్చింది. నూకరాజూ, నేనూ పైకి పరుగెత్తాం. మమ్ములను చూచి ఆయన వెనుకకు తగ్గాడు."

"తరువాత ఏమైందీ?"

"అదేమో తనను మీ చినమామ చెరచడానికి బలవంతంచేశాడని అంది. ఆయనగారేమో అంగూర్ తన పర్ను కాజేసిందని అన్నాడు. దానిమీద నూకరాజు మీ చిన్నమామను కొట్టబోయాడు. నేను ఆపుజేశాను. అంతే! అంగూర్ మేడదిగి వెళ్ళిపోయింది. మళ్ళీరాలేదు."

పద్మ ఒకచేతితో గుండెలు అదుముకుని "ఎంత ఘోరం" అనుకుంది. రెండునిముషాలతరువాత ఆమె మళ్ళీ ప్రశ్నించింది. "ఆ తరువాత నూకరాజు యేమిచేశాడు సింగూ"

"మీ అమ్మగారూ, నూకరాజూ చాలాసేపు ఘర్షణపడ్డారు. సాయంకాలం నూకరాజు అంగూర్ దగ్గరకు వెళ్ళివచ్చాడు. రాత్రి అతను భోజనం చేసినట్టులేడు. ఒక సారిమాత్రం నాదగ్గరకు వచ్చి తనుకూడా ఇక్కడ పని మానుకుని వెళ్ళిపోతానని చెప్పాడు. అంతే, నేను తరువాత అతన్ని చూడలేదు"

"నూకరాజు యెలాచచ్చిపోయాడు సింగూ"

"యేమో అమ్మాయిగారూ! నేను చూడలేదు. అసలు నూకరాజు చనిపోయ్యాడనే వార్తనాకు యింతకు ముందే తెలిసింది."

"పాముకరచిందని అంటున్నారుగా, డాక్టరును పిలువలేదూ!"

"లేదు అమ్మాయిగారూ! నాకు ఆ విషయం తెలియదు"

"రాత్రి నువ్వు యెక్కడవున్నావు!"

"యిక్కడే వున్నాను."

"నూకరాజు?"

"తలుపులుబిగించుకుని అతనిగదిలో పడుకున్నాడు"

"నరసరాజుగారు రాత్రి యిక్కడే వున్నారా?"

రాత్రి పన్నెండు గంటలసమయంలో వచ్చారు. కారు పోర్టికోలోనేవుంచి మేడమీదికి వెళ్ళారు. మళ్ళీ తెల్లవారు జామువేళ తన కారుతీసుకుని బయటికి వెళ్ళిపోయారు"

"నూకరాజుశవాన్ని నీవు చూడలేదంటున్నావు గదా! నీకు అగుపించకుండా ఎవరు తీసుకుపోయారు?"

"నాకు తెలియదు అమ్మాయిగారూ, యీ ఉదయం మీ పెద్దమామ రామరాజుగారువచ్చి నన్ను బయటికి పంపించారు. నేను నగరంలోవున్న హోటళ్ళన్నీ నరసరాజు గారికోసం గాలించివచ్చాను. కాని ఆయన ఎక్కడా లేరు. నేను తిరిగివచ్చినతరువాతనే నూకరాజు చనిపోయాడనే వార్త తెలిసింది. అంతకుమించి నాకు యేమీ తెలియదు అమ్మాయిగారూ" అన్నాడు సింగు.

నూకరాజు మరణించింది పాముకాటువల్ల కాదనీ, దానిలో యేదో కుట్రవుందని పద్మ గ్రహించింది. ఆమె నాలుగునిముషాలుఆగి "సింగూ, పంకజాన్ని నేను రమ్మ న్నానని చెప్పి తీసుకురా" అని చెప్పింది. సింగుపోయి పదినిముషాలతరువాత తిరిగివచ్చి "అంగూర్ వాళ్ళ నాయన దగ్గరకు వెళ్ళిపోయిందటమ్మాయిగారూ" అని చెప్పాడు.

విదేశాలనుండి శివరామ్ తిరిగివచ్చాడు. అతను ఆ సాయంకాలం రామానాయక్‌ను కలుసుకునేందుకు ప్రయత్నించాడు. కాని రామానాయక్ యెర్రగడ్డ టి. బి. హాస్పిటలులో చేరాడనీ, అంగూర్ తండ్రిదగ్గరకు పోయిందనీ తెలిసింది.

మరునాటిఉదయం శివరామ్ కారుతీసుకుని హాస్పిటలుకు వెళ్ళాడు. అప్పటికి రామ్ కాఫీముగించి మంచంమీద పండుకుని పత్రిక చూస్తూన్నాడు. శివరామ్ సరాసరి అతని మంచందగ్గరకుపోయి రామ్ చేతిలోని పత్రికను లాగేశాడు. రామ్ ఆశ్చర్యంగా అతనివైపు చూచాడు. "దాదా!" అంటూ మంచంమీద లేచికూర్చుని రెండు చేతులతో శివరామ్‌ను కౌగలించుకుని తల అతని పొట్టకు ఆన్చి "దాదా! దాదా" అంటూ వలవల ఏడ్చేశాడు.

శివరామ్ అతని తల పైకిఎత్తి సూటిగా కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు "అరే! రామ్ దేనికిరా అలాఏడుస్తావు?" అన్నాడు.

ఆ ఏడుపులోనే అతను నవ్వుతూ అన్నాడు "ఏడుపు కాదు దాదా! సంతోషం"

"ఛీ, వెధవా, నాచొక్కా అంతా పాడుచేశావు. చూడుచొక్కా ఎలా తడిసిపోయిందో"

"ఫరవాలేదు దాదా! ఇంటికిపోయి మరోచొక్కా వేసుకో"

వార్డుబోయ్ ఒక కుర్చీతెచ్చి రామ్ మంచందగ్గరగా వేశాడు శివరామ్ దానిలో కూచుంటూ అన్నాడు

"ఒరేయ్ రామ్, నా-చో కా్కా తడిపేశావు. నామీద నీకు అంతబెంగ వుందిరా"

"అవును దాదా! రోజూ కలలో కన్పిస్తావు దాదా"

శివరామ్ ఆప్యాయంగా అతని తలనిమురుతూ "అంగూర్ అగుపించదురా?"

"అంగూర్, గింగూర్ అంతా నీతరువాతనే దాదా."

"అరేరామ్, నీవు బాగా ఆరోగ్యంగానే అగుపిస్తున్నావు. నిన్ను యిక్కడ యింకా యెదుకు వుంచినట్లు?"

"యేమోదాదా! ఆ డాక్టర్లు రోజూ ఉదయమూ, సాయంకాలమూ వచ్చి చూచిపోతుంటారు. కాని మనతో ఒక్కమాటైనా చెప్పరు దాదా!"

శివరామ్ చిన్నగా నవ్వాడు. "ఎంతకాలం అయ్యిందీ నువ్వు యీ హాస్పిటలులో చేరి?"

"మీరు వెళ్ళిపోయినతరువాత సరిగ్గా నెలరోజులకు"

"అంటే రెండుమాసాలయిందన్నమాట"

"అవును దాదా"

"అంగూర్‌ను యెక్కడికి పంపించావు?"

"నేను పంపించలేదు దాదా! అదే వాళ్ళ నాయన వద్దకు వెళ్ళిపోయింది"

"ఎందుకనీ?"

"వంటరిగావుండడానికి భయంగా వుందట దాదా"

శివరామ్ చిన్నగా నవ్వాడు "నేనుపోయి రమ్మంటే వస్తుందా"

"పరుగెత్తుకువస్తుంది దాదా."

"సరే! యీ పూట నీవిషయం డాక్టరతో మాట్లాడి సాయంకాలంగాని, రేపుగాని అంగూర్ వద్దకు పోతాను."

శివరామ్ హాస్పిటల్ సూపరిండెంటును కలుసుకొని రామ్ విషయం అడిగాడు. సూపరిండెంటు అందుకు సంబంధించిన ఛార్టులు, ఫైళ్ళు అన్నీ తిరగవేసి అతనిని త్వరలో డిశ్చార్జి చేస్తామనీ, కాని కొంతకాలం అతనిని ఏదైనా నర్సింగ్ హోములో పెట్టడం మంచిదని సలహాయిచ్చాడు.

శివరామ్, రామ్ దగ్గరకువచ్చి "రామ్, సాయంకాలం నేనువచ్చి నిన్ను కారులో తీసుకుపోతాను. నీకోసం వేరే ఇల్లు చూస్తాను." అనిచెప్పాడు

శివరామ్ ఆరోజు అంతా స్టుడియోలో కూచుని స్టుడియో వ్యవహారాలన్ని సరిదిద్దుకున్నాడు. సాయంకాలం అయిదుగంటలకు అతను రిసీవరు అందుకుని విజయనర్సింగ్ హోముకు ఫోనుచేసి వివరాలు తెలుసుకున్నాడు. కారులో హాస్పిటలుకుపోతూ బట్టలషాపులో రామ్‌కు రెండుజతల మంచిదుస్తులు, రెండుజతల నైట్ దుస్తులు తీసుకున్నాడు. హాస్పిటలుకు పోయేసరికి రామ్ డిశ్చార్జి అయి వెయిటింగు రూములో తనకోసం యెదురు చూస్తున్నాడు. ఆరాత్రికి రాత్రి రామ్‌ను నర్సింగ్ హోములో అప్పజెప్పి శివరామ్ సినిమాకు పోయాడు.

శివరాం లాడ్జింగు చిక్కటపల్లిలోవుంది. అది అతని స్వంతఇల్లు కాదు. చిన్న రెండుఅంతస్థుల మేడ. నెలకు వందరూపాయిలకు అద్దెకు తీసుకున్నాడు. ఇంటికి ఒకవైపున చిన్నతోట, ముందు రకరకాల పూలమొక్కలు, ఒకవైపు గ్యారేజి, అన్నిసౌకర్యాలతో యిల్లు ఆకర్ష ణీయంగా వుంటుంది. ఇంట్లో వంటవాడుమాత్రంవుంటాడు. పనిమనిషి ఉదయం, సాయంకాలంవచ్చి పనిచేసి పోతుంది. అంతకుమినహా ఆ ఇంట్లో మనుష్యులు యెవరూ మెదలరు. పోతే స్టుడియోకి సంబంధించినవారుగాని శివరాం మిత్రులు గాని అప్పుడప్పుడు ఏ ఒకరో ఇద్దరో వచ్చిపోతుంటారు.

ఇంటిక్రిందిభాగంలో ముందువరండా, ఆతరువాత డ్రాయింగురూమూ, మూడుగదులు, డైనింగుహాలూ, స్నానాలగది వున్నాయి. డైనింగుహాలుకు ఆనుకునే కిచన్ వుంది. పైభాగంకూడా అదేనమూనాలో వుంది. డ్రాయింగురూములో గోడలకు పెద్దపెద్ద చిత్రపటాలు, వేళ్ళాడుతుంటాయి. గౌతమబుద్ధుడు, క్రీస్తు, మహాత్మా గాంధి, మార్క్సు, లెనిన్ తదితర చిత్రాలు తను తయారు చేసినవే అక్కడక్కడా తగిలించాడు.

మేడపైనవున్న హాలులో నగ్నచిత్రాలు, అనేక ఫోటోలువున్నాయి. శివరామ్ పడకగది మేడమీద వుంది. దానిలో ఇటలీ, ఫ్రెంచి, అమెరికన్ సినీతారల చిత్రాలు అనేకం వున్నాయి. అంగూర్, తారాకలసి తీయించు కున్నచిత్రం, రాం, అంగూర్ నాటకం వేసినప్పుడు కలిసి

తీయించుకున్న పెద్దసైజు చిత్రాలుకూడా వున్నాయి.

ఆ ఇల్లు శివరాంకు బాగా నచ్చింది. తన ఇంటి పరిశుభ్రతను, పరిసరాలను గురించి అతను తన స్నేహితులతో గొప్పగా చెప్పుకుంటాడు.

శివరాం ఉదయం కాఫీతీసుకుని కారులో నర్సింగ్ హోముకు వెళ్ళాడు. అప్పటికి రాం యింకా నైట్‌దుస్తులలోనే వున్నాడు. అతనివైపు పరీక్షగాచూస్తూ శివరాం అన్నాడు "అరే రాం, నీవు ప్రిన్స్‌లాగా వున్నావురా"

"అంటే ఏమిటిదాదా?"

శివరాం చిన్నగా నవ్వాడు "ప్రిన్స్ అంటే రాజకుమారుడురా"

"అబ్బే, నేను యెలా రాజకుమారుడనవుతాను దాదా, నీవు రాజకుమారుడవు అయితే, నేను నీ సేవకుణ్ణి."

"ఛీ, వెధవా" అంటూ శివరాం అతనివీపుమీద చరిచాడు.

రాం గాఢాలింగనం చేశాడు. అతని చేతులు విడిపించుకుంటూ శివరాం అన్నాడు "అరే, రాం! నీవు అంత గట్టిగా కౌగలించుకుంటే నావళ్ళు గగుర్పొడుస్తుందిరా"

"అయితేకానీయి దాదా! దానివల్లనాకు ఎంతో హాయి, ఆనందం కలుగుతుంది దాదా"

ఇద్దరు కుర్చీలలో కూర్చొని సంభాషణలో మునిగారు. "రాం, మనఅంగూర్‌చిత్రం పారిస్‌లో అమ్ముడు పోయింది."

"ఎంతకు అమ్మావు దాదా"

"వేయి పౌనులకు"

"అంటే ఎంతదాదా"

"దాదాపు ఇరవై అయిదు వేల రూపాయిలు"

"బాప్ రే!"

"ఆ మొత్తం కాక ఢిల్లీ, బొంబాయి, రోమ్ ప్రదర్శనలలో పెద్ద పెద్ద బహుమానాలుకూడా వచ్చాయి రాం, ఆ బహుమానాలు మాత్రం నేను వుంచుకుని చిత్రం విలువ మీకు యిస్తాను"

రాం జాలిగా అతనివైపు చూచాడు "మాకూ అంటూ మమ్మల్ను వేరుచెయ్యకు దాదా, పైగా అంత పెద్దమొత్తం మేము ఏవిధంగా సద్వినియోగం చేయగలం? నీఇష్టంవచ్చినవిధంగా ఆ మొత్తం వినియోగంలోకి తీసుకురా దాదా"

శివరాం ప్రశ్నార్థకంగా రాం కళ్ళల్లోకి చూశాడు.

అతను మందస్మితం చేస్తూ అన్నాడు "నిజం దాదా! కావాలంటే నాగుండెలు పరీక్షచేసుకో" అంటూ రాం చొక్కాగుండీలుతోలగించి ఛాతీ చూపెట్టాడు. తెల్లని శరీరంమీద నల్లగా, గుబురుగా పెరిగిన వెంట్రుకలతో అతని ఛాతీ విశాలంగావుంది. శివరాం నవ్వుతూ అన్నాడు. "నీ గుండెలకు మాటలుచెప్పే శక్తికూడా వున్నదా, యేమిటి రాం"

"అవును దాదా, నేను అన్నమాటలు నాగుండెల్లోనుంచే వచ్చాయి."

నీమొహం. ఇకచాలులేగా, ఆ గుండీలు పెట్టుకో"

రాం చిన్నబుచ్చుకున్నాడు. "కోపం వచ్చిందా, దాదా!"

అతను నవ్వుతూ అన్నాడు "కోపంయెందుకురా! సరేగాని నేనుపోయి అంగూర్‌ను తీసుకురానా"

"తీసుకురా, దాదా!"

"మరి నీవులేకుండా నేనుపోతే వస్తుందో, రాదో!"

"పరుగెత్తుకువస్తుంది దాదా."

"తీసుకువచ్చి యెక్కడ పెడదామంటావు?"

"మా ఇంటి దగ్గరే"

"అబ్బే! ఇంకా అక్కడికి ఎందుకురా? యీ రోజున మీకు పాతికవేలరూపాయిలు నగదువుంది. ఎక్కడైనా చవుకలో చిన్నఇల్లు కొందాం. అంతవరకు మా ఇంటిదగ్గరే వుంటుంది."

"సరే దాదా, నా అభ్యంతరం యేమీలేదు."

"అంగూర్ వున్న ప్రదేశం నాకు తెలియదుగా, ఎవరువస్తారు నావెంట?"

"నేను వస్తానుదాదా"

"ఛా, ఛా, నీవు కదలవద్దు రామ్"

"అయితే ఘనేనాయక్‌ను తీసుకుపొండి"

అంగూర్‌ను సాధ్యమైనంత త్వరలో కలుసుకుని ఆమె చిత్రం పాతికవేలరూపాయిలకు అమ్ముడుపోయిందనే శుభవార్త ఆమెకు తెలియజేయాలని శివరాం తహతహలాడాడు.

అంగూర్‌ను గురించి అతను పదేపదే ఆలోచించాడు. ఆమె ఈ నాటివరకు కూలినాలిచేసుకు బ్రతికే స్త్రీల లాగానే బ్రతుకుతూంది. కాని యిప్పుడు ఆమెకు బాగా బ్రతికే అవకాశాలు కలిగాయి. ఆమె వేషభాషలు పూర్తిగామార్చాలని, ఆమెను సంస్కరించాలని అతను అనుకున్నాడు. ఒకమధ్యతరగతి స్త్రీగా ఆమెను తయారు చేయాలని సంకల్పించుకున్నాడు. అందుకు రాం యేవిధమైన అభ్యంతరంచెప్పడనే విశ్వాసం అతనికుంది. తన సలహాలను పాటించడానికి అంగూర్ ప్రథమంలో సంకోచించినా రోజులు గడచినకొలదీ మధ్యతరగతి వాతావరణానికి ఆమె అలవడుతుందనే నమ్మకం అతనికి వుంది. తన ప్రయత్నంలో స్వల్పఅవరోధాలు వాటిల్లినా వాటిని అధిగమించి ముందుకు పోవాలనే సంకల్పంతో అతను అంగూర్ కోసం బయలుదేరాడు.

శివరాం కారుతీసుకుని బంజారాగుట్టలకు వెళ్ళాడు. గుట్టలు యెక్కుతుండగా మేనమామ నారాయణరాజుగారి కారు అతనికి యెదురైంది. నారాయణరాజు శివరాంను ఆనవాలుపట్టి చెయ్యివూపాడు. శివరాం కారుఆపి బ్యాక్ చేశాడు. యెదురుగా మేనమామ! ఇద్దరూ కార్లుదిగారు.

"యెక్కడనుండి మామయ్యా?" అడిగాడు శివరామ్.

"మేము ఇక్కడకువచ్చి మూడుమాసాలకుపైగా అయ్యింది బాబూ! నవాబుగారి బంగళాలో వుంటు

న్నాము. ఇంటికిపోదాముర్రా, పిల్లలు. మీ అత్తయ్య
ఇక్కడే వున్నారు."

నారాయణరాజు కారు వెనుకకుతిప్పి ముందుకుపోని
చ్చాడు. శివరాంకారు అనుసరించింది. శివరాం రాక
సూర్యకాంతమ్మకు, పిల్లలకు చాలా సంతోషం కలిగిం
చింది. కుశలప్రశ్నలతరువాత మేనమామ "బాబూ! శివ
రామ్,నాకు వేరేపనివుంది, రాత్రికిగాని మళ్ళీతిరిగిరాలేను.
నీవు ఈ రోజు ఇక్కడవుండిపో. నేను తిరిగివచ్చినతరువాత
సరదాగా మాట్లాడుకుందాం" అన్నాడు.

మరొకసారి కలుసుకుంటాను మామయ్యా! నాకుపని
వుంది, పోవాలి" అన్నాడు శివరాం.

"అయితే యెప్పుడుకలుసుకుందాం అంటావు?"

"మీయిష్టంమామయ్యా, మీరుఖాళీగావున్నప్పుడు
నాకుఫోన్ చెయ్యండి.వచ్చికలుసుకుంటాను"అంటూ శివరాం
జేబులోనుండి తనఫోన్ నెంబరువున్నకార్డును మేనమామకు
అందించాడు.నారాయణరాజు కారుతీసుకుని వెళ్ళిపోయాడు.

సూర్యకాంతమ్మ, పిల్లలు అతనిచుట్టూ మూగారు.
సూర్యకాంతమ్మ అంది "బాబూ, మేము యిక్కడ
వుండగా నీవు వేరేఎక్కడోవుండటం యేమంత బాగుం
టుంది! నీబస యిక్కడకు మార్చుకో, కావాలంటే పై
అంతస్థుఅంతా నీవేవుపయోగించుకుందువుగాని, నామాట
తోసివెయ్యవు అనుకుంటాను."

శివరాం సమాధానంచెప్పకముందే పద్మ అందు
కుంది "బావా యీ బంగళాపైఅంతస్థు అంటే నాలుగో

అంతస్థు ఎంత బ్రహ్మాండంగా వుంటుందనుకున్నావు. అక్కడనిలబడి యెటుచూచినా చక్కనివ్యూ, సికిందరాబాద్, హైదరాబాదు నగరాలురెండు పూర్తిగా అగుపిస్తాయి. ఒకవైపున నిలబడితే చార్మినార్ నుండి గోల్కొండ వరకుచూడవచ్చు. మరొకవైపునుండి టాంక్ బండు స్టేషను కూడా అగుపిస్తాయి. రాత్రిపూట ఆ దీపాలుచూస్తూ నేను తన్మయత్వం చెందుతూంటాను బావా"

"ఓహో! పద్మా, నీవు ఆర్టుస్టూడెంటువి కదూ! అందుకే అలామాట్లాడుతున్నావు" అన్నాడు శివరాం.

"దీనిలో ఆర్టేమివుంది బావా! కళ్ళతోచూచి ఆనందించేదానినిగురించి చెప్పటంకూడా ఆర్టేనా?"

"యెందుకుకాదూ! ఏదీ మీ అక్కను చెప్పమను అలా చెప్పగలుగుతుందేమో! చూదాం. యేం కమలా నీవు పద్మలా మాట్లాడగలుగుతావా? "

కమల నవ్వివూరుకుంది. సూర్యకాంతమ్మ అంది "కమలకు మగవాళ్ళంటే మహాభిడియం బాబూ! మగగాళ్ళ ముందు అది నోరువిప్పదు. వట్టి అమాయికపుపిల్ల నాయనా!"

"బావా! మీ పంకజం ఆమధ్య మా ఇంటిదగ్గర వుంది" అంది పద్మ.

శివరాం ఆశ్చర్యం వెల్లడించాడు. "పంకజం అంటే అంగూర్, అనేనా"

"అవును బావా!"

"మీ ఇంటికి ఎందుకువచ్చింది?"

"ఆవిడభర్త హాస్పిటలులో వున్నాట్టగా! జరుగు బాటులేక మా ఇంట్లో పనికి కుదిరింది"

శివరాం లోలోపల బాధపడ్డాడు. కాని పైకి అగు పించనీయలేదు. "ఎంతకాలం వుందేమిటీ పంకజం యిక్కడా?"

"అబ్బే! ఒక వారంరోజులే బావా"

"మరి ఎందుకువెళ్ళిపోయింది?"

పద్మ సూటిగా సమాధానంచెప్పకుండా తల్లివైపు చూచింది. సూర్యకాంతమ్మ చెప్పుకుపోయింది.

"యేమో! నాయనా! అది మంచిపిల్లలాగానే అగు పిస్తుంది. మేమూ అంతేననుకున్నాం. ఆపిల్ల చిత్రం నీవు తయారుచేశావని తెలిసి మాపిల్లలతోపాటు ఆ అమ్మా యికికూడా భోజనాలు, ఫలహారాలు అన్నీ యిచ్చేవాళ్ళం. శుభ్రంగానేవుంటూ వచ్చింది. ఒక వారంరోజులు వుందో లేదో మాతో మాటమాత్రంకూడా చెప్పకుండా వెళ్ళి పోయింది బాబూ! తరువాత ఫ్యూ జవానుతో కబురు చేశాను. కాని ఎక్కడికో పొరుగూరు వెళ్ళిపోయిందని తెలిసింది."

"బావా! మా నూకరాజు చనిపోయాడు బావా" చినబాబు చెప్పాడు.

శివరాం నిర్ఘాంతపోయాడు "ఏ నూకరాజు, మీా వంటవాడేనా?"

"అవును బావా"

"పాపం ఎలాచనిపోయాడు. కండరాలుతేలిన శరీ

రమూ, వాడూను. ఫైల్మ్యానులా అవుపించేవాడు. వాత్తే రులోవుండగా నాచుట్టూ తిరుగుతూండేవాడు. నేను అంటే ఎంతో అభిమానంచూపేవాడు" అన్నాడు శివరాం.

"అవును నాయనా! చెట్టుఅంతమనిషి పాముకరచి అకస్మాత్తుగా చనిపోయాడు." సూర్యకాంతమ్మ విచారం వ్యక్తంచేసింది.

శివరాం నలుగురు ముఖాల్లోకిచూస్తూ "నాకూ వేరేపనివుంది పోయివస్తాను" అన్నాడు.

"అయ్యో! నాయనా, నేను అడిగినదానికి సమాధానంచెప్పనే లేదు." అంది సూర్యకాంతమ్మ.

శివరాం విస్తుపోయి చూశాడు "క్షమించాలి అత్తయ్యా! మాటలసందడిలో ఆ విషయం మరిచేపోయాను. నేను తిరిగితిరిగివచ్చాను. స్టుడియోపని చాల యెక్కువగావుంటూంది. రెండుసంవత్సరాలనుండీ నేను చిక్కటపల్లిలో ఇల్లుతీసుకుని అక్కడవుంటున్నా. వంటవాడిని కూడా పెట్టాను. ఇప్పుడు అవన్నీవదిలేసి యిక్కడకురావటం సాధ్యమయ్యేపనికాదుఅత్తయ్యా! నా పట్ల మీకు ఆ మాత్రం ఆదరం వున్నందుకు ధన్యవాదాలు అత్తయ్యా!" అన్నాడు శివరాం.

"అదేమాటబాబూ? మాకంటె ఆత్మీయులు నీకు మాత్రం యెవరున్నారు! నీ పట్ల ఆదరంచూపకుండా ఎలా వుండగలం చెప్పు. యేమో! నీవు ఒకఇంటివాడివి అయితే చూచి సంతోషిస్తాం బాబూ."

శివరాం నవ్వుతూ అన్నాడు "ఇల్లుఅయితే వుంది

అత్తయ్యా! ఇల్లా లేలేదు."

"మేముకోరేది అదే నాయనా"

శివరాం కారులోకూర్చుని అందరికి బైబై చెప్పాడు, కారు కదలిపోయింది.

శివరాంకారుఘనేనాయక్ ఇంటిముందుఆపుజేశాడు. ఘనేనాయక్, జోరా, తారా, పిల్లలు కారుదగ్గరకు చేరారు. కుశలప్రశ్నల అనంతరం అంగూర్‌ను గురించి తలొకమాటా చెప్పారు. ఘనేనాయక్‌ను కారులోఎక్కించు కుని శివరాం కారుముందుకుపోనిచ్చాడు. ఘనేనాయక్ దారిచూపుతుంటే శివరాం కారు గుట్టలు, మిట్టలుదాటి చిట్టడవిలో ప్రవేశించింది. అక్కడ ఇళ్ళూ, దొడ్లూ లేవు. అక్కడక్కడా గుడ్డలతోకప్పిన చిన్నచిన్న డేరాలు మాత్రంవున్నాయి. కారు ఒక డేరాముందు ఆపి శివరామ్ ఘనేనాయక్ కారుదిగారు. పిల్లలు, పెద్దలు కారుచుట్టూ మూగారు. శివరాం అంగూర్ కోసం వెదుకుతూ అందరి ముఖాలలోకి చూచాడు. కాని ఆమె అగుపించలేదు. "అంగూర్, వాళ్ళనాయనా యిప్పుడే పక్కనవున్న పొలా -లలోకి పోయారు" అన్నారు ఒకరు.

శివరాం వారిమధ్యనిలబడి దిక్కులు చూచాడు. గజ్జెలుకట్టిన గుర్రపుపిల్లలా ఆమె పరుగెత్తుతూవచ్చి అతని పాదాలముందు వాలింది. ఆమె ఆయాసంతో రొప్పుతూ "బాబూజీ ఆగయా" అంది. అతను నవ్వుతూ ఆమెకళ్ళ ల్లోకి చూచాడు. "బాబూజీ, రాం యెలావున్నాడు?" అడిగింది.

"రాం హాయిగావున్నాడు అంగూర్, రాంను నిన్ననే హాస్పిటలునుండి తీసుకుపోయి వేరే నర్సింగ్ హోములో పెట్టాను. ఒకనెలదినాలలో అతనుఆరోగ్యం కోలుకోగలుగుతాడని డాక్టరుచెప్పారు. నీవుకూడావచ్చేయి అంగూర్, అక్కడే వుందువుగాని"

"రాం నన్ను తీసుకురమ్మన్నాడా బాబూజీ"

"అవును అంగూర్. నీబట్టలు వగైరా యేమైనా వుంటే సర్దుకో, పోదాం"

అంగూర్ తల్లి, తండ్రీ పొలంలోవున్నారు. ఆమె వాళ్ళకోసం కబురుచేసి తాను త్వరగా మూటసర్దుకుంది. తల్లి, తండ్రీ రాగానే ఆమె వారికిచెప్పి శివరాంకంటె ముందుగా కారులోయెక్కి కూచుంది. ఘనేనాయక్ శివరామ్ ప్రక్కసీటులో కూచుని కబుర్లు ప్రారంభించాడు. "బాబూజీ! మీరువెళ్ళిపోయినతరువాత రామ్, అంగూర్ చాలాఅవస్థలుపడ్డారు బాబూజీ."

"నేను వెళ్ళేప్పుడు రామ్‌కు ఒకవందరూపాయిలు ఇచ్చిపోయాను నాయక్"

"వాడిమందులకు ఎక్కడెక్కడ డబ్బు చాలలేదు బాబూజీ."

"అవును, ఆ రోగం అలాంటిదే నాయక్"

"అంగూర్ మా ఇళ్ళదగ్గర బంగళాలో పనికి కుదిరింది. అందులో ఒక బద్మాష్ అంగూర్‌ను చాలా కంగారు పెట్టాడు బాబూజీ."

"నిజమేనా అంగూర్!" అంటూ శివరాం మెడ

ప్రక్కకుతిప్పి ఆమెవైపు చూచాడు. ఆమె "నిజమే" అన్నట్లు తలవూపింది.

ఘనేనాయక్ ను బంజారాగుట్టలదగ్గరదించి కారు సరాసరి చిక్కటపల్లికి పోనిచ్చాడు. కారు తమఇంటి ముందుఆపి "అంగూర్ నువ్వు ఇక్కడదిగి లోపలికిపో, నేను బజారుకుపోయి పదినిముషాలలో తిరిగివస్తాను." అన్నాడు. ఆమె బెదురుతూ అతనివైపుచూచింది. కాని కారు దిగలేదు.

శివరామ్ "నాయర్" అని కేకవేశాడు. లోపలి నుండి నాయర్ పరుగెత్తుకుంటూవచ్చాడు. శివరామ్ అత నిని కారుదగ్గరకుపిలిచి "నాయర్, యీ కారులో కూర్చున్నఆమె తెలుసునా?" అనిఅడిగాడు.

"తెలియదు సార్" అన్నాడు అతను.

"నేనులోగడ పంకజం చిత్రంగియ్యలేదూ. ఆ చిత్రం యీామెదే. యీామెపేరు అంగూర్. మాస్నేహితుని భార్య. అతను ప్రస్తుతము ఆరోగ్యంబాగులేక నర్సింగ్ హోములో వున్నాడు. అతనిఆరోగ్యం కుదుటపడేవరకు యీామె మనఇంట్లోవుంటుంది. ఆమె మనయింట్లోవున్నంత కాలం నీవు ఆమెను జాగ్రత్తగా తోబుట్టువులాగా చూచు కోవాలి తెలిసిందా!" అన్నాడు శివరామ్.

"అలాగే సార్." అంటూ నాయర్ బుర్రవూపాడు.

శివరామ్ మళ్ళీచెప్పాడు "నాయర్, డ్రాయింగురూము ప్రక్కగది ఆమెకు యేర్పాటుచెయ్యి. దానిలోకి అవసర మైన మంచము, ఒక డ్రాయరు, రెండుకుర్చీలుకూడా

దానిలో పెట్టించు, నేను మళ్ళీ అరగంటలో తిరిగివచ్చేస్తాను. ఆమెను లోపలికి తీసుకువెళ్ళి స్నానానికి నీళ్ళు పెట్టు."

అంగూర్ కారులోనుండి దిగి నాయరు వెంట లోపలికి నడచింది. నాయరుకు చిన్న వయస్సు. పద్దెనిమిదో సంవత్సరం. నమ్మకమైన సేవకుడు. యజమానిపట్ల అతనికి అపారమైన భక్తివిశ్వాసాలు వున్నాయి.

నాయర్ మొదటిసారిగా అంగూర్‌ను అక్కా అని పిలిచాడు. ఆపిలుపు అంగూర్‌కు ఎంతో ఆనందం అయ్యింది. ఆమెకు తమ్ముళ్ళుగాని, చెల్లెళ్ళుగాని లేరు. ఇద్దరు అక్కలు, ముగ్గురు అన్నలు వున్నారు. కడసారి సంతానం అవడంచేత తల్లీ, తండ్రీ, అన్నలు, అక్కలు అందరు ఆమెను అతిగారాబంగా చూచారు. అందరూ "చెల్లీ" అనిపిలిచేవారే, ఆమెవాడకు, గ్రామానికికూడా చెల్లిగానే వుండిపోయింది. నాయర్ అక్కా అని పిలవడంతో ఆమె అనిర్వచనీయమైన దివ్యానుభూతిని పొందింది. ఆమె ఆప్యాయంగా అతనివైపు చూచింది.

అతను డ్రాయింగురూములో ప్రవేశించి ప్రక్కగది తలుపులు తెరచి "అక్కా! యీ గది నీకు ప్రత్యేకం. యితరులెవ్వరూ దీనిలోకిరారు" అన్నాడు. అంగూర్ గోడలకు వున్న చిత్రాలవైపు పరీక్షగా చూచింది. కాని వాటిలో ఒక్కటికూడా ఆమెకు తెలిసిందిలేదు. ఆమె గదిలో ప్రవేశించి మంచంమీద పదినిముషాలు కూచుంది. యీలోపున నాయర్ వచ్చి "అక్కా నీకు స్నానానికి నీళ్ళు పెట్టాను" అన్నాడు.

అంగూర్ సంకోచిస్తూ అతనివైపుచూచింది. ఆమెపరిస్థితిని నాయర్ గ్రహించాడు. అతను ఆమెను వెంటపెట్టుకుని యిల్లుఅంతా తిప్పిచూపించాడు. మేడమీదిగదిలో తమ ఫోటోలుచూచి ఆమె మందస్మితంచేసింది. ఆ ఫోటోలు నాయర్‌కుచూపి "తమ్ముడూ యీ ఫోటోలు మావే" అంది. తను రామ్‌వున్న ఫోటోతీసి "ఇతనే మా రామ్. హాస్పిటల్లోవున్నాడు" అని చెప్పింది.

నాయర్ మళ్ళీ ఆ ఫోటోను గోడకుతగిలించాడు.

అంగూర్ స్నానంచేసి తనగదిలోకిపోయి కూచుంది. శివరామ్ ఒక పెద్దపెట్టె పట్టించుకుని లోపల ప్రవేశించాడు.

అతను అంగూర్‌ను డ్రాయింగురూములోకి పిలిచి తాపీగా చెప్పాడు. "అంగూర్ నీ చిత్రానికిపాతికవేల రూపాయిలు వచ్చాయి. ఆ మొత్తం మీకేయివ్వడానికి నిర్ణయించుకున్నాను. నిన్న యీ విషయం మన రామ్‌తో మాట్లాడాను. వాడు బయటకురాగానే మీ కుటుంబానికి కావలసిన ఏర్పాట్లుఅన్నీ ముగ్గురంకలసి ఆలోచించి చూచుకోవచ్చు. ప్రస్తుతం నీకు బట్టలు, కొద్దిగా ఆభరణాలుతీసుకువచ్చాను. నీ చేతులకువున్న ఆ గాజులన్నీ తీసేసి బంగారుగాజులు వేసుకో. మెడలో వేసుకునేందుకు చంద్రహారం, చెవులకు ముత్యాలదుద్దులు తెచ్చాను. అవన్నీ చక్కగా అలంకరించుకో. సాయంకాలం నర్సింగు హోముకుపోయి రామ్‌ను చూచివద్దాం" అంటూ నగల పెట్టె ఆమెకు అందించాడు.

అంగూర్ భయపడుతూ అంది "బాబూజీ! రామ్ యేమైనా అంటాడేమో!"

"నేను రామ్‌తో మాట్లాడాను అంగూర్, వాడు యేమీ అనడు."

డైనింగుహాలులో నాయర్ భోజనాలు వడ్డించాడు. శివరామ్‌తో కలసి కూచోడానికి అంగూర్ భిడియపడింది. అతను బలవంతం చేశాడు. ఆమె బెదురుతూ అతనికియెదురుగా కూచుంది.

నాయర్ రెండుగ్లాసులతో సూప్ తెచ్చి వారిముందు పెట్టాడు. శివరామ్ గ్లాసు అందుకుని చప్పరిస్తూ "సూప్ తాగు అంగూర్" అన్నాడు. ఆమె గ్లాసుఅందుకుని కొద్దికా చప్పరించింది. శివరామ్ ముఖంలోకి చూచింది. "యేమిటిఅంగూర్, అలా చూస్తావు"

"ఇదేమిటోగాని చప్పగావుంది బాబూజీ."

శివరామ్ చిన్నగానవ్వాడు "సూప్‌అంటే పానకం అనుకున్నావా! యెముకలరసం. అది అలాగేవుంటుంది. తాగేసెయ్యి, శరీరానికి మంచిది" అన్నాడు అతను.

నాయర్ పూరీలు, బంగాళాదుంపలు, బఠాణీలు కలిపివేసిన కుర్మా, మాంసంవేపుడూ పెట్టాడు. అది అయిన తరువాత కొద్దిగా అన్నమూ, పెరుగూ వడ్డించాడు. భోజనం అయినతరువాత శివరామ్ అడిగాడు "అంగూర్, భోజనం యెలావుంది?"

"బాగుంది బాబూజీ!" అని చెప్పి ఆమె నాయర్

వైపుతిరిగి "తమ్ముడూ యీ కూరలలోకి మసాళాలు నీవే తయారుచేసుకుంటావా, లేక బజారునుండి తెప్పిస్తావా?" అని అడిగింది.

అతను మందస్మితంచేస్తూ అన్నాడు "నేనే తయారు చేస్తాను అక్కా!"

శివరామ్ ఆశ్చర్యం వెల్లడిస్తూ వారిరువురివైపు చూచాడు. "ఓహో! మీరు ఇద్దరు అప్పుడే బంధుత్వం కూడా కలుపుకున్నారే" అన్నాడు.

అంగూర్ నవ్వుతూ సమాధానంచెప్పింది "అవును బాబూజీ! నేను యిక్కడకు రాగానే నాయర్ నన్ను అక్కాఅంటూ పిలిచాడు. నాకు చాలా సంతోషం అయ్యిందిబాబూజీ."

శివరామ్ మేడమీదికిపోయాడు. అంగూర్ తన గదిలో ప్రవేశించి శివరామ్ తెచ్చిన పెట్టెతెరచి చూచింది. రకరకాల విలువైన చీరలు, బ్లవుజులు, లంగాలు, అవీ వున్నాయి. నగలపెట్టెతీసి చెవులకు దుద్దులుపెట్టుకుని అద్దంముందు నిలబడి చూచుకుంది. ప్రతిబింబం చూస్తూ తనలోతాను నవ్వుకుంది "ఇవన్నీ తగిలించుకుని సాయంకాలం రామ్‌దగ్గరకు పోతే యేమనుకుంటాడో! యేమనుకుంటాడు, చూచి సంతోషిస్తాడు" అనుకుందామె.

మధ్యాహ్నం టీ తీసుకున్నతరువాత శివరామ్ నాయర్‌ను బజారుకుపంపి స్నోబాటిల్, పౌడరుడబ్బా, లిప్‌స్టిక్ తెప్పించాడు. శివరామ్ స్నోబాటిలు చేతిలో

పుచ్చుకుని అంగూర్‌కు చూపుతూ "ఇది యేమిటో చెప్పుకో అంగూర్" అన్నాడు.

"స్నోసీసా బాబూజీ"

అతను లిప్‌స్టిక్ చూపి "యిదో" అన్నాడు.

"పెదాలకు పులుముకునేది" అంది ఆమె.

అతను నవ్వుతూ అన్నాడు "అయితే నీకూ తెలుసు నన్నమాట. సరే త్వరగా ముస్తాబవ్వు. రామ్ దగ్గరకు పోదాము."

అంగూర్ తన గదిలోకిపోయింది. శివరామ్ డ్రెస్‌చేసుకోడానికి మేడమీదికి వెళ్ళాడు. గంటతరువాత అతను క్రిందికివచ్చి అంగూరును పిలిచాడు.

"వస్తున్నా బాబూజీ!" గదిలోనుండే సమాధానం వచ్చింది.

అతనుపోయి కారులోకూర్చుని హారను మోగించాడు. ఆమె సిగ్గుపడుతూ తలవంచుకుని కారుదగ్గరకువచ్చి నిలబడింది. అతను రెండునిముషాలు రెప్పలువాల్చకుండా ఆమెవైపు చూచాడు. తన ప్రక్క-సీటు డోరు తెరచి "లోపలికివచ్చికూర్చో అంగూర్." అన్నాడు. ఆమె కదలలేదు. రెండు నిముషాలు గడచిపోయాయి. "నేను వెనుక సీటులో కూచుంటాను బాబూజీ!" ఆమె భయపడుతూ అంది.

శివరామ్ జాలిగా ఆమెకళ్ళల్లోకి చూచాడు. అతను వెనక డోర్ తెరిచాడు. ఆమె మాట్లాడకుండా యెక్కికూర్చుంది.

కారు నర్సింగుహోముచేరేసరికి రామ్ అక్కడ తోటలో షికార్లుచేస్తున్నాడు. శివరామ్ కారుఆపి వెనుక డోర్ తెరచాడు. అంగూర్ క్రిందికిదిగింది. యిద్దరు గేటు వైపు నడిచారు, రాం పరుగుపరుగునవచ్చి శివరాం చెయ్యిపుచ్చుకుని "దాదా! యీ బేగమ్ సాహెబా యెవరు?" అని ప్రశ్నించాడు. అంగూర్ అమాంతం భర్తను కౌగలించుకుని "రాం, ఇక అంతటితో ఆపు." అంటూ ఆమె తనచేతిని అతని పెదవులమీద పెట్టింది. రాం ఆమెచేతిని రెండుచేతులతో గట్టిగా పట్టుకుని ముద్దులు కురిపించాడు. ఆమె కొంచం ఎడంగాజరిగింది. అతను ఆమెను ఆపాదమస్తకం పరిశీలించాడు. నొసట సింధూరం, చెవులకు ముత్యాలదుద్దులు, మెడలో చంద్ర హారం, క్రీమ్‌కలరు బ్లౌజు, నీలంరంగు జార్జెట్‌చీరా, కాళ్ళకు స్లిప్పర్లు అందాల రాణిలా వెలిగిపోతూంది.

రాం భార్యవైపుచూస్తూ అన్నాడు "అంగూర్, సమాజంలో ఎక్కడో అట్టడుగునపడి, కీటకాలలా కొట్టుకు లాడే మనను యీ స్థితికి తీసుకువచ్చిన దాదాకు సాష్టాంగ నమస్కారం చేదాంరా" అన్నాడు. ఇద్దరూ జంటగా శివరాం పాదాలముందు వంగి నమస్కరించారు.

శివరాం కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. అతను ఆప్యా యంగా ఆ భార్యాభర్తలనిద్దరినీ పైకిలేవదీసి "అరేరాం! యేమిటిరా యీ పిచ్చివేషాలు" అన్నాడు నవ్వుతూ.

"లోపలికిపోయి కూచుందాం దాదా" అన్నాడు.

"వద్దు రాం నీవూ, అంగూర్ పోయి కాసేపు కబుర్లు చెప్పుకోండి. నేను స్టుడియోకి పోతాను. ఒకగంట తరు వాత వచ్చి అంగూర్‌ను తీసుకుపోతాను" అన్నాడు శివరామ్.

# 8

శివరామ్ స్టుడియో వ్యవహారాలు చూచుకుంటూనే రామ్‌కోసం ఇల్లు బేరంచేశాడు. అమ్మకానికివచ్చిన అనేక ఇళ్ళుచూచి అతనికినచ్చక తిరిగివచ్చాడు. అమీర్ పేటలో ఒక ముసల్మానుల యిల్లు అమ్మకానికి పెట్టారని తెలిసి శివ రామ్ చూచి వచ్చాడు. అతనికి ఆ ఇల్లు నచ్చింది. ఇల్లు యేమంత పురాతనమైనదికాదు. ఇటీవలే కట్టినట్లు ఇంటి వాళ్ళు కాగితాలు, లెక్కలు చూపెట్టారు. ఇల్లు చిన్నదే అయినా ఇంటిచుట్టూ మరోనాలుగుఇండ్లకు చాలినంత స్థలం వుంది.

ఇంటివాళ్ళు పదహారువేలు చెప్పారు. శివరాం దళారులద్వారా బేరాలు సాగించి చివరకు అది పన్నెండు వేలకు ఖాయంచేశాడు. ఆ సాయంకాలం అంగూర్‌ను తీసుకువెళ్ళి ఇల్లుఅంతా తిప్పి చూపెట్టాడు. ఆమె అంతా చూచినతరువాత ఇంటి మంచిచెడ్డలనుగురించి యేమైనా వ్యాఖ్యానిస్తుందేమోనని శివరాం వూహించాడు. కాని ఆమె నోరు మెదపలేదు.

శివరామ్ అడిగాడు. "అంగూర్, యెలావుందీ ఇల్లు? కొందామంటావా?" అని అడిగాడు. ఆమె నవ్వుతూ సమాధానం చెప్పింది. "బాబూజీ! నిన్న మొన్నటివరకు డబ్బారేకులలో వుండివచ్చిన నాకు ఈ ఇంటియొక్క మంచి చెడ్డలు యేమితెలుస్తాయి. అది యేమిటో మీరే నిర్ణయించండి బాబూజీ"

ఆమె ఇచ్చిన సమాధానంవిని శివరాంఅనుకున్నాడు. "అంగూర్ నేను అనుకున్నంత అమాయకురాలు మాత్రం కాదు."

ఆ సాయంకాలం ఇంటివిషయాలు మాట్లాడడానికి శివరామ్ నర్సింగ్‌హోమ్‌కు వెళ్ళాడు. రామ్ అక్కడ ప్రవేశించి కొద్దిదినాలే అయినా అతని ఆరోగ్యం చాలా మెరుగైంది. అతన్ని చూస్తూ శివరామ్ అన్నాడు. "అరేరాం; యీ కొద్దిరోజులకే పహిల్వాన్‌లా తయారయ్యావురా!"

"దాదా ! నువ్వుకూడా కొంతకాలం యిక్కడ వుంటే నాలాగే తయారవుతావు దాదా!"

"నాకు తయారుయెందుకులేరా! భార్యా, బిడ్డలా"

"అవును దాదా, నీవు వివాహం ఎందుకుచేసుకోలేదూ?"

"చేసుకుంటాను యెప్పుడో ఒకప్పుడు"

"దాదా! నీవు రోమ్, ప్యారిస్ నగరాలు తిరిగి వచ్చావుగదా! అక్కడ నీకునచ్చిన దొరసాన్లు యెవ్వరూ లేరూ!"

"యెందుకులేరూ! బోలెడుమంది."

"అయితే అందులో ఒక్కరినైనా అనుభవించావా, దాదా"

"ఒక్కరేమిటిరా, డజన్లు"

రామ్ ఆశ్చర్యంగా శివరామ్ ముఖంలోకిచూచాడు. అతను మందస్మితం చేశాడు. రామ్ అమాంతంగా శివరామ్‌ను కౌగలించుకుని "దాదా! నువ్వు చాలా అదృష్టవంతుడివి దాదా!" అన్నాడు.

శివరామ్ గంభీరంగా అన్నాడు. "అరే రామ్, నేను ఒకమాట చెప్పనా!"

"చెప్పుదాదా!"

"నాకేగనక అంగూర్‌లాంటి భార్య వుండివుంటే మరో స్త్రీని కన్నెత్తి చూచేవాడినేకాదు."

రామ్ నెత్తి గోకుకుంటూ అన్నాడు "దాదా! నువ్వు వివాహం చేసుకోదలుసుకుంటే అంగూర్‌ను మించిన వాళ్ళే దొరుకుతారు దాదా!"

"రాం, అది యేమంత తేలికమాత్రం కాదురా"

"అయితే యీ సారి ప్యారిస్ పోయినప్పుడు మంచి దొరసానిని లాక్కురా దాదా!"

శివరామ్ చిన్నగానవ్వాడు. అమీర్‌పేటలో చూచి వచ్చిన ఇంటివిషయాలు అతను రామ్‌కు వివరించాడు. "రామ్! ఆ ఇల్లు మనకు పన్నెండువేలకు వస్తుంది. ఇల్లు యేమంత పెద్దదికాకపోయినా మీకు విశాలంగానే సరిపోతుంది. పైగా ఇంటికి పడమరవైపునవున్నస్థలం మనం విడగొట్టి అమ్మకానికిపెడితే దానికే పదివేలవరకు రావచ్చు.

కాబట్టి అది మంచి లాభసాటిబేరమేనని అనుకుంటారా!"

"అయితే కొనెయ్యిదాదా!"

"రేపు కాగితాలు వ్రాయిస్తాను"

"దాదా! నన్ను ఇక్కడనుండి బయటికి ఎప్పుడు తీసుకుపోతావు ?"

"ఆ విషయం డాక్టరును కనుక్కున్నానురా! మరో రెండువారాల తరువాతగాని సాధ్యపడదు అన్నాడు. యేం నీకు కష్టంగా వుందా ఇక్కడ?"

"కష్టమేమీలేదు దాదా! త్వరగా బయటికివస్తే నీతోకలసి సరదాగా తిరగాలనివుంది దాదా?"

"నాతోనా, అంగూర్‌తోనా?"

రామ్ శివరామ్‌ను వాటేసుకుని పైకిఎత్తి దించాడు.

"దాదా, నేను నిజంచెప్పనా?"

"చెప్పరా!"

"పగలు నీతో, రాత్రి అంగూర్‌తో"

"నీమొహంగానీ, నేను రేపువచ్చి డాక్టరుతో మాట్లాడతానులే"

శివరామ్ బయలుదేరి పోతుంటే రామ్ చెప్పాడు "దాదా! రేపు అంగూర్‌నుకూడా తీసుకురా దాదా"

శివరాం కారులోకూచుని చెయ్యి వూపాడు. రాం గేటులోనిలబడి బైబై చెప్పాడు. కారు కదలిపోయింది.

శివరాం ఒక్కసారి స్టుడియోలో కూర్చునివుండగా అతనిమిత్రుడొకాయన మాటలసందర్భంలో అడిగాడు.

"శివరాంగారూ! ఆ లంబాడీవాళ్ళను మీరు అంత ఆకాశానికి యెత్తుతున్నారేమిటండీ!"

శివరాం మిత్రునివైపు విస్తుపోయి చూచాడు. "యే లంబాడీవాళ్ళనండీ?"

"అదే మీరు పంకజం చిత్రంగీచిన ఆమెనూ, ఆమె భర్తనూ."

శివరాం చిన్నగా నవ్వాడు "ఆ భార్యాభర్తల స్వభావాలు మీరు యేమాత్రం తెలుసుకొనివున్నా నన్ను అంత చిన్నప్రశ్న వేసివుండేవారు కాదనుకుంటానండీ"

"యేమో! వాళ్ళవిషయం నాకు తెలియదులెండి, అయినా ఒకమాట అడుగుతాను, నాలుగుడబ్బులు పారేస్తే యీ ప్రపంచంలో అణగిమణగివుండేవారు ఎందరు లేరూ?"

శివరాం మిత్రునివైపు సీరియస్‌గా చూచాడు. అతను అనర్గళంగా చెప్పుకుపోయాడు. "వున్నారండీ, వున్నారు. లేరని నేను అనను. దానితోపాటు సహృదయులు, నిరాడంబరజీవులు, నిష్కపటులుకూడా యీ సమాజంలో వున్నారనే విషయం మీరూ గుర్తించడం మంచిది. పంకజంభర్త రామానాయక్ నిష్కల్మషహృదయుడు, నిరాడంబరజీవి, సూటిగా మాట్లాడుతాడు. అలాంటివాడు లంబాడీవాడైనా, మాల మాదిగవాడైనా నాకేమీ అభ్యంతరంలేదు. నాకు కావలసింది అతని గుణగణాలు, రూపురేఖలు. నేను అంటే అతను పడిచస్తాడు.

అలాంటివాడిని నా ఆత్మీయుడుగా యెంచుకోవటంలో చాలా మంచిపని చేశాననే విశ్వాసం నాకువుంది మిత్రమా.

"ఇక పంకజంవిషయం. ఆమె లంబాడీస్త్రీయే కావచ్చు. కాని అందాలతార. నేను ఆమెచిత్రం గీశాను. ఆ చిత్రంద్వారా యెన్నెన్నో ప్రశంసలుపొందాను. నాకు పదిహేనువేలు రూపాయలు విలువజేసే బహుమతులు వచ్చాయి. ప్యారిస్‌లో జరిగిన ప్రదర్శనలో ఆ చిత్రం అమ్ముడుపోయింది. వెయ్యిపౌనులు అంటే దాదాపు పాతిక వేల రూపాయిలు వచ్చాయి. యీ పాతికవేలూ వారికే యివ్వదలుచుకున్నాను. ఆమెకులం యేదైతే నాకేం. ఆమె సాక్షాత్తూ ప్రకృతి ప్రసాదించిన పంకజమే. అందుకు సందేహంలేదు మిత్రమా."

కొద్దిదినాలు గడిచాయి. రాం దంపతులకొరకు అమీర్‌పేటలో కొన్న ఇల్లు మరమ్మత్తులు చేస్తున్నారు. ఒకరోజు మధ్యాహ్నం శివరాం అంగూర్‌తో అన్నాడు. "అంగూర్ ! నీవు యింతకుముందు సాలార్‌జంగ్ మ్యూజియం చూశావా!"

"లేదు బాబూజీ!"

"అయితే, యీపూట తీసుకుపోయి చూపెడతాను వస్తావా!"

అంగూర్ సందేహించింది. "రాం వచ్చిన తరువాత పోయిచూదాం బాబూజీ"

"రాం వచ్చినతరువాత మీరు మీ క్రొత్త ఇంటికి వెళ్ళిపోతారుగా అంగూర్"

ఆమె సమాధానం చెప్పలేదు. రాం మళ్ళీ ప్రశ్నించాడు. "యేమిటి అంగూర్ నీ సందేహం?"

"యేమీలేదు బాబూజీ! పోదాం"

"అయితే త్వరగా బట్టలుమార్చుకో, పోదాం"

ఆమె లేచి తన గదిలోకిపోయింది. అరగంట తరువాత శివరాం కారులో కూర్చొని హారన్ ప్రమోగించాడు. అంగూర్ అప్సరసలా శృంగారించుకుని వచ్చింది. శివరాం ఆమెముఖంలోకి చూస్తూ అన్నాడు. "అంగూర్, నీ పెదవులమీద లిప్‌స్టిక్ యెక్కువగా మెత్తావు. పెదవులు మోటుగా అగుపిస్తున్నాయి."

"అయితే లోపలికిపోయి తుడుచుకుని వస్తాను బాబూజీ"

"ఫరవాలేదు అంగూర్, యివాల్టికి అలానే వుండనీ, రేపటినుండి తేలికగా వేసుకో."

కారు ఒకఫ్యాన్సీ షాపుముందు ఆపి శివరాం లోపలికి పోయాడు. అతను నాలుగైదుహ్యాండుబాగ్‌లు పుచ్చుకుని అంగూర్‌దగ్గరకువచ్చాడు. "అంగూర్, యీ బ్యాగ్‌లలో నీకు నచ్చినది తీసుకో"

అంగూర్ సిగ్గుపడింది. "నాకు బ్యాగ్ యెందుకు బాబూజీ!"

"నీకు కాకపోతే మరెవరికీ? తీసుకో అంగూర్."

"మీకు యిష్టంవచ్చింది తీసుకోండి బాబూజీ"

శివరాం వైలెట్‌రంగు బ్యాగ్‌తీసి "ఇది బాగుందా! చూడు అంగూర్"

"బాగానేవుంది బాబూజీ"

శివరాం కౌంటరుదగ్గర బిల్లు చెల్లించి బ్యాగ్ తెచ్చి అంగూర్‌కు అందించాడు. కారు నయాపూల్ మీదినుంచి పోతున్నప్పుడు అక్కడచేరిన జనం తనవైపు పరీక్షగా చూడడం గమనించి అంగూర్ సిగ్గుపడింది. "వెధవలు. తెల్లమొహాలువేసుకుని ఆడదానివంక యెందుకు అలా గుడ్లు అప్పగించి చూస్తారు?" అనుకుంది. వేలాదిజనం తన వైపే చూస్తుంటే ఆమె వారివైపు చూడలేకపోయింది. అప్రయత్నంగా స్తనాలమీదికి చెయ్యిపోనిచ్చి జాకెట్టూ, పమిట సర్దుకుంది."

మ్యూజియం దగ్గరకు పోయినతరువాత శివరాం కారు ప్రక్కకుతీసి ఆపుజేశాడు. అతనుపోయి టిక్కెట్లు తీసుకువచ్చాడు. అంగూర్ అతనిప్రక్కకు వచ్చినిలబడింది. ఆమెవైపు చూస్తూ అతను అన్నాడు.

"బ్యాగ్ యేదీ? అంగూర్?"

"కారులోనే వదిలేశాను బాబూజీ!"

"ఛా! వెళ్ళి తీసుకురా" అతను కొంచం కటువుగానే అన్నాడు.

ఆమె చిన్నబుచ్చుకుంది.

"అంగూర్ బ్యాగ్ కారులో వదిలేస్తే ఎవరైనా ఎత్తుకుపోరూ అదీ" అన్నాడు శివరామ్.

"అవును బాబూజీ! పొరపాటు చేశాను"

తమను తప్పుకుని ముందుకుపోతున్న ఒక పార్టీ జంటను చూపి "ఇదుగో అంగూర్ వాళ్ళవైపుచూడు. ఆవిడ బ్యాగ్ ఎలాపట్టుకుందో నీవుకూడా అలాగే పట్టుకోవాలి."

ఆమె చిన్నగానవ్వింది. పిల్లలసెక్షనులో ప్రవేశించిన తరువాత అక్కడిశిల్పాలను, చిత్రాలను, బొమ్మలను గురించి శివరాం ఒక్కొక్కటే ఆమెకు తెలియజెప్పాడు. అతను చెప్పే కబుర్లువింటూ ఆమె యెంతో ఆనందించింది. "బాబూజీ! ఇదివరకే మీరు మ్యూజియం చూచారా?"

"ఒక్కసారా! యెన్నోపర్యాయాలు చూచాను అంగూర్."

"అయితే యిప్పుడు మళ్ళీ యెందుకువచ్చారు!"

"నీకు చూపెట్టడానికి అంగూర్."

"బాబూజీ! నాకోసం యింతశ్రమతీసుకోవాలా."

అతను చిన్నగానవ్వాడు. "అంగూర్ నిన్నూ, రాంని సంతోషపెట్టే యేకార్యము చెయ్యవలసివచ్చినా అది శ్రమఅని నేను అనుకోను. అంగూర్!"

ఆమె జాలిగా అతనివైపు చూచింది. మనస్సులోనే అతనికి ధన్యవాదాలు అర్పించుకుంది.

బర్మా, చైనా, జపాన్, ఈజిప్టు, టర్కీ, గ్రీస్, ఇటలీ, ఫ్రాన్సు, ఇంగ్లండు మొదలగుదేశాల చిత్రాలను,

శిల్పాలను, కళాఖండాలను, వస్తువులను చూస్తూ ఆమె తన్మయత్వం చెందింది. ఆమె వుత్సాహంతో అతనిని అడిగింది. "బాబూజీ యిన్నిదేశాల కళాసంపదను యిక్కడ చేర్చారే! ఇదంతా యెవరు సేకరించారు బాబూజీ!"

శివరామ్ నవ్వుతూ చెప్పాడు. "ఇవన్నీ సేకరించిన మహనీయుడు సాలార్ జంగ్. అందుకే దీనిని సాలార్ జంగ్ మ్యూజియం అని పిలుస్తారు."

"ఆయనగారు ఇంకా జీవించి వున్నారా బాబూజీ"

"లేదు అంగూర్, కొద్ది సంవత్సరాలక్రితమే చనిపోయారు."

మొగల్ సెక్షనులో ప్రవేశించారు. శివరామ్ మొగల్ పాదుషాలు, రాణులయొక్క చిత్రాలను పేరు పేరుతో వివరించి చెప్పాడు. అతను నూర్జహాన్ చిత్రం ఆమెకు చూపి "ఆమె యెవరో నీకు తెలుసునా అంగూర్" అన్నాడు.

"తెలియదు బాబూజీ!"

"ఆమె నూర్జహాన్, జహంగీర్ పాదుషా ప్రియురాలు, ఆమె ఎలా వుందంటావు అంగూర్"

"చాలా చాలా బాగుంది బాబూజీ"

"నేను ఒక యదార్థం చెప్పనా అంగూర్"

"చెప్పండి బాబూజీ"

"ఆమె నీకు అక్కగారు"

"అది యెట్లా బాబూజీ ! ఆమె మహారాణి, నేను సామాన్యురాలిని."

"నీవు చెప్పేది నిజమే అంగూర్, కాని అందచందా లలో, బ్రతుకుబాటలో ఆమె నీకు అక్షరాలా అక్కగారే నని మాత్రం నేను చెప్పగలను. అదుగో ఆమె కళ్ళు చూడు. నీకళ్ళకు వాటికిమేమంత తేడాలేదు. అంతేకాదు అంగూర్, ఆ చెంపలు, ఆ ముక్కు, ఆ గడ్డం, ఆ కంఠం, భారంగా వున్న ఆ రొమ్ములు ఆమెకూ, నీకూ ఏమీ భేదంలేదు అంగూర్. ఇన్ని ఎందుకు, నీవు ఆమెలోనుండి వూడిపడ్డావు అంటే దానిలో అతిశయోక్తి యేమీ లేదు అంగూర్"

"బాబూజీ, నన్ను ఆకాశానికి ఎత్తుతున్నారు."

"లేదు అంగూర్, నేను యదార్థమే మాట్లాడు తున్నాను."

"ఆమె మహారాజ్ఞిగా! ఆమె బ్రతుకుకు నాబ్రతుకుకు పోలికయేముంటుంది. బాబూజీ"

"అదీ నిజమే అంగూర్, కాని నీవు కంగారుపడను అంటే నీకు మరో విశేషంకూడా చెప్పతాను అంగూర్"

"అంత తేలికగా కంగారుపడను, చెప్పండి బాబూజీ!"

"నూర్జహాన్‌కు ప్రారంభంలో ఒక యువకునితో వివాహం జరిగింది. ఆమె అందచందాలుచూచి ఎంద రెందరో రాజులు, యువరాజులు ఆమెను పొందాలని చూచారు. అయినా ఆమె యెవ్వరికీ లోబడలేదు. కాని జహంగీరుబాదుషా రాజ్యానికి రాగానే ఆమె భర్తను చంపించి ఆమెను తెచ్చుకున్నాడు."

అంగూర్ భయపడుతూ అంది "బాబూజీ మా రామ్‌కు నేను అన్యాయం చెయ్యలేను, చెయ్యను, అలాంటి

విపత్తు నాకు వాటిల్లకుండా చూడండి, బాబూజీ!" అంటూ ఆమె శివరామ్ చేతిని గట్టిగా పట్టుకుంది. అతను ఆమె చేతిని ఆప్యాయంగా తట్టి నేను జీవించి వున్నంతవరకు మీకు ఎలాంటి విపత్తూ వాటిల్లకుండా నేను ప్రయత్నిస్తాను అంగూర్" అన్నాడు. ఆమె మనస్సు కొంత కుదుట పడింది. కాని సంకోచం పూర్తిగా విడిపోలేదు. ఆమె ఆలోచిస్తూ అతని వెనుక నడిచింది.

జేడ్ రూమ్ ప్రవేశించగానే ఆమె ఆలోచనలు ఆగిపోయాయి. వింతవింత కాంతులు వెదజల్లే రత్నాలు పొదిగిన కైజారులు, ఖడ్గాలు, ఆభరణాలతో ఆ హాలుఅంతా దేదీప్యమానంగా వెలిగిపోతూంది. అంగూర్ శివరామ్‌కు దగ్గరగా జరిగి "బాబూజీ, ఇవన్నీ యెవరు ఉపయోగించినవి?" అని అడిగింది.

అతను వెంటనే సమాధానంచెప్పాడు "ఒకరేమిటి అంగూర్! ఢిల్లీ పాదుషాలు, గోల్కొండ నవాబులు, వారి మంత్రులు,సామంతులు ఒకప్పుడు అలంకరించుకున్నవే ఇవన్నీ"

గ్రీకు, రోమన్ శిల్పాలలు తిలకిస్తున్నప్పుడు శివరామ్ నగ్నంగావున్న ఒక శిల్పాన్ని అంగూర్‌కు చూపుతూ "ఈ శిల్పం నీలాగేవుంది అంగూర్" అన్నాడు.

ఆమె సిగ్గుతో తలవంచుకుంది. "బాబూజీ ! అలాంటి మాటలు అనకండి" అంది.

"ఇందులో తప్పేమీ లేదు అంగూర్. ఆ శిల్పం యొక్క శరీరసౌష్ఠవంవంపులు చూడు ఎంత అందంగా వున్నాయో!"

"అయితే నన్ను ఆ శిల్పంతో పోల్చడానికి మీరు ఎన్నడూ నా శరీరం చూచి వుండలేదుగా!"

"నేను చిత్రకారుణ్ణి అంగూర్! ఆమాత్రం గ్రహించలేనంటావా!"

"బాబూజీ! మీ మాటలవల్ల నేను సిగ్గుతో కుంగిపోతున్నాను."

"అయితే, ఇకనుండి అలా మాట్లాడను. అంగూర్"

అంగూర్ ఆశ్చర్యం వెల్లడిస్తూ "బాబూజీ! బాబూజీ ఆ శిల్పం చూడండి, ఎంత బాగుందో "అంటూ ఆమె ముసుగులోనున్న ఒకశిల్పందగ్గరకుపోయి నిలుచుంది. శివరామ్ చెప్పాడు "అవును అంగూర్, యిది బ్రహ్మాండమైన శిల్పమే సందేహంలేదు. దీనినే రెబెకాయిన్ వెయిల్" అంటారు. ప్రపంచంలో దీనితో తులతూగేశిల్పం మరొకటి లేదనే పెద్దలు అంటారు."

అంగూర్ తృప్తితీరేట్టు ఆ శిల్పంవంక చూస్తూ "బాబూజీ! ఆ ముసుగులోకూడా చక్కని ఆ కళ్ళు, చిరునవ్వులు చిందించే పెదవులు చూడు ఎంత స్పష్టంగా అగుపిస్తున్నాయో!" అంది.

అతను సంతృప్తిగా ఆమెవైపు చూచి అన్నాడు. "అవును అంగూర్" అన్నాడు. అప్పటికి అయిదుగంటలు కావచ్చింది. మరో అయిదునిముషాలలో అయిదుగంటలు కొడతారు. అతనుఅంగూర్ చెయ్యి పుచ్చుకుని "నీకు ఇంకో తమాషా చూపెడతాను. తొందరగా రావాలి" అంటూ

ఆమెను దాదాపు తనతోపాటు అక్కడవున్న పెద్ద గడియారందగ్గరకు యీడ్చుకుపోయాడు. అప్పటికే అక్కడ జనం మూగివున్నారు. వాళ్ళంతా గడియారంవైపు పరీక్షగా చూస్తున్నారు. శివరామ్ మాట్లాడకుండా వేలుచూపి ఆమెదృష్టిని గడియారంవైపు మరల్చాడు. గడియారంలో ఒకచిన్నబొమ్మ సుత్తెపుచ్చుకుని ఆగి ఆగి సెకనుకి ఒకదెబ్బ గంటమీద కొడుతూంది. అయిదు గంటలకు ఇంకొక్క నిముషంమాత్రమే వుంది.

అప్పుడు గడియారంలోవున్న తలుపు తెరచుకొని మరోబొమ్మ వచ్చింది. సరిగ్గా అయిదుగంటలకు అయిదు దెబ్బలు కొట్టి తిరిగి లోపలికిపోయి తలుపు మూసుకుంది. అక్కడచేరిన వారందరు ఆ వింతచూచి చప్పట్లుకొట్టారు. అంగూర్ శివరామ్‌వైపు చూస్తూ అంది "చాలా బాగుంది, బాబూజీ!"

అంగూర్‌ను ఇంటిదగ్గర దిగబెట్టి శివరామ్ స్టుడియోకి వెళ్ళాడు.

కొద్దిదినాలు గడిచాయి. చిక్కటపల్లి మధ్యతరగతి వాతావరణంలో అంగూర్ బాగా కలసిపోయింది. శివరాం వున్నా లేకపోయినా ఆమె నర్సింగ్‌హోముకు, బజారుకు, ఇంటికి తిరుగుతూంది. అప్పుడప్పుడు నాయర్‌కు వంట పనిలో తోడ్పడేది. నాయర్ చేసేవంటకాలు ఆమెకు బాగా నచ్చాయి. నాయర్‌నుండి రకరకాల వంటలు చేసే పద్ధతి నేర్చుకుంది.

అంగూర్ ఒకరోజున వంటరిగా రామ్‌ను చూడ డానికి నర్సింగ్ హోముకు వెళ్ళింది. రాంగదిలో కూచుని చాలాసేపు అతనితో మాట్లాడింది. "రాం నువ్వు యీ నర్సింగ్‌హోములో యింకా యెంతకాలం వుండాలో!"

"నిన్నను డాక్టర్లు పరీక్షచేశారు. ఇంకా రెండు వారాలు వుండవలసి వస్తుందని అంటున్నారు అంగూర్?"

"మన ఇంటిమరమ్మత్తులు చాలావరకు పూర్తికావ చ్చాయి. రామ్, నీవు బయటికి రాగానే మనం ఆ ఇంటికి పోదాం."

"అప్పటికి అమ్మను, చెల్లినీ, తమ్ముడినీకూడా కబురుచేసి తీసుకువద్దాం"

అంగూర్ ముభావంగా విని వూరుకుంది. అతను మళ్ళీ అడిగాడు "అంగూర్ అమ్మావాళ్ళు ఇక్కడకు రావటం నీకు యిష్టమేనా!"

"నాది యేముందిరాం! నీ యిష్టప్రకారం నడచు కోవటం తప్ప నాకు వేరే అభిప్రాయంలేదు."

అతను సంతోషంతో ఆమెను దగ్గరకుతీసుకున్నాడు. "దాదా యేమంటున్నాడు అంగూర్."

"యేమంటారు! ఆయనగారిగోడవ ఆయనది. స్టుడి యోకి పోతారు. అక్కడపనులు చూచుకుంటారు. మొన్న సాయంకాలం ఒక ముస్లిం స్త్రీని వెంటపెట్టుకువచ్చి మేడ మీదిగదిలోకి పోయి తలుపువేసుకు కూర్చున్నారు. చీకటి పడుతూండగా క్రిందికి దిగివచ్చారు."

"ఛా! యెవరు ఆమె?"

"యేమో నాకుమాత్రం యేమి తెలుసు. ఆ వచ్చిన ఆమె బురఖాలో వుంది."

"అయితే యీసారి దాదా వచ్చినప్పుడు అడుగుతానుండు"

"ఛీ! వద్దురాం"

"యేం అడిగితే తప్పు యేముందీ! దాదా ఏమీ అనుకోడు."

"అదికాదు రాం, బాబూజీ ఆమెను వెంటపెట్టుకుని పైకిపోయినతరువాత నాకు అనుమానం వేసింది. వాళ్ళు ఎంతసేపటికీ కిందికి రాకపోయేసరికి నేనే పైకిపోయి నెమ్మదిగా తలుపుసందుల్లోనుంచి చూచాను. ఆమె నగ్నంగా ఒక స్టూలుమీద కూచునివుంది. బాబూజీ ఆమె చిత్రం గీస్తున్నాడు. నేను చప్పుడుకాకుండా వెనుకకుతిరిగి వచ్చేశాను."

"ఆమె యెవరో నీవు పోల్చుకోలేవూ!"

"లేదురాం, ఎక్కడో చూచినముఖమే! బహుశా స్టుడియోలో ననుకుంటాను"

"మన తార అయివుండదుగదా!"

"అబ్బే కాదురాం! నేను ఆ మరునాడు బాబూజీ ఇంట్లో లేనప్పుడు పైకిపోయి ఆ చిత్రం చూశాను. ఆమె మధ్యవయస్సులోవున్న స్త్రీ. కాని చాలా బలంగా వుంది."

"దాదా నీ చిత్రం ఇంకొకటి గీస్తానని అన్నాడే!"

"అన్నారు, కాని నేను హాయిదా వేశాను. నీవు బయటికి వచ్చినతరువాత నే గియ్యమని చెప్పాను."

"అంగూర్ నీవు పొరపాటు చేశావని అనుకుంటు న్నాను. దాదాకు యెదురుచెప్పి వుండవలసింది కాదు."

"యేమో రాం! మీ దాదా మాటలు, చర్యలు చూస్తుంటే నాకు అనుమానంగా వుంది."

అదేమిటో నాకుకూడా కాస్త చెప్పు వింటాను"

సాలార్ జంగ్ మ్యూజియంలో నూర్జహాన్ చిత్రాన్ని గురించి శివరాం అన్నవాక్యాలు అంగూర్ యేకరువు పెట్టింది. అంతావిన్నతరువాత రాం అన్నాడు "యీ మాత్రానికి నీవు దాదాను అనుమానించడానికి కారణం నాకు యేమీ అగుపించదు అంగూర్"

"అంతేకాదు రాం, కారులో బయలుదేరితే నన్ను ఆయనగారి ప్రక్కనే కూచోమంటారు. మొన్న ఒకరోజున బలవంతపెట్టి సినిమాకు తీసుకుపోయారు. అక్కడకుపోయిన తరువాత నేను ఆడవాళ్ళస్థలంలో కూచుంటానని చెపితే ఆయనగారికి కోపం వచ్చింది. తిరిగి ఇంటికిపోదామన్నారు. ఇక వారిప్రక్క కూచోడానికి అంగీకరించక తప్పలేదు."

"దాదా ప్రక్క కూచోడానికి నీకు అంత కష్టం యెందుకు అంగూర్"

"కష్టంకాదు రాం! నేను ఆయనగారి పక్కనే ఆ పైక్లాసులలో కూచుంటే చుట్టుపక్కల కూచున్న వాళ్ళంతా దర్యా వెర్రిగా నాకేసి చూస్తుంటారు. యేమో! యెవ

రైనా నావంక అలా చూస్తుంటే నాకు భయం అవుతుంది రాం!''

రాం చిన్నగా నవ్వాడు "దాదా వుండగా నీవు అంతగా భయపడవలసిన అవసరం లేదు అంగూర్''

"యేమో రాం! నీవు వచ్చేవరకు నేను ఎక్కడికి పోదలచుకోలేదు.''

"నీయంతటనీవు పోకపోయినా యిబ్బంది లేదు. కాని దాదారమ్మంటే నీవుపోకతప్పదు అంగూర్.''

ఆమె బుంగమూతి పెట్టిఅంది "ఎందుకని యేమిటీ?''

"యెందు కేముందీ! మర్యాదకోసం, మనలను యీ స్థితికి తీసుకువచ్చినదాదా సంతోషంకోసం అంగూర్''

భర్తఇచ్చిన సమాధానంవిని ఆమె ఆలోచనలో పడింది. "బాబూజీపట్ల నేను అమర్యాదగా ప్రవర్తించానా!'' అని ప్రశ్నించుకుంది.

ఆమె వెళ్ళిపోడానికి లేచింది. రాంకూడా లేచి నిలబడి ఆమెను దగ్గరకుతీసుకున్నాడు. ఆమె అభ్యంతరం చెప్పలేదు. ఒకరినొకరు పెనవేసుకుని ముద్దుపెట్టుకుంటుండగా తలుపుతోసుకుని డాక్టరు లోపల ప్రవేశించాడు. ఆయనవెనక శివరాం వున్నాడు.

"నమస్తే డాక్టరు సాహబ్'' అన్నాడు రాం. తొందరతొందరగా అంగూర్‌ను వదలిపెట్టి తరువాత అతను శివరాంవైపు తిరిగి "దాదా రెండురోజులనుండి అగుపించలేదేం దాదా!'' అన్నాడు.

డాక్టర్ ఆ భార్యాభర్తలవైపు సీరియస్‌గా

చూచాడు. "మిస్టర్ రాం, మీ ఆరోగ్యం పూర్తిగా కుదట పడలేదు, మీరు యిప్పటినుండి మీ భార్యతో కాల క్షేపంసాగిస్తే మళ్ళీ మీ ఆరోగ్యం దెబ్బతింటుంది. జాగ్ర త్తగా వుండాలి.''అన్నాడు ఆయన. ఆతరువాత ఆయన అంగూర్ వైపుతిరిగి "యేమమ్మాయ్! మీరు మీ భర్తతో మాట్లాడదలచుకుంటే బయట విజెటర్సు రూములోకూర్చుని మాట్లాడివెళ్ళిపోవాలి. అంతేగాని లోపలిగదిలోకి రావటం మంచిదిగాదు'' అని చెప్పాడు.

అంగూర్ చిన్నబుచ్చుకుని తలవాల్చుకుంది. శివ రామ్ కల్పించుకుని చెప్పాడు. "ఇలాంటివిషయాలు ఆమెకు అంతగా తెలియవు డాక్టరుగారూ! రేపటినుండి జాగ్రత్తగానే వుంటుంది.''

డాక్టరు రాంను పూర్తిగా పరీక్షచేసి మరికొంత కాలం అక్కడేవుండవలసి వస్తుందని చెప్పాడు. డాక్టరు వెళ్ళినతరువాత రాం చెప్పాడు "దాదా! అంగూర్ తప్పు యేమీలేదు దాదా! ఆమె వెళ్ళిపోతుంటే నేనే ఆమెను దగ్గరకుతీసుకుని బలవంతంగా ముద్దుపెట్టుకున్నాను. యీ లోపుగా మీరువచ్చేశారు.''

"అవునులేరా! నీకు యీమధ్య బాగా కండపడు తూంది'' అన్నాడు శివరాం.

"దాదా నాకంటే అంగూర్ కే బాగా కండపట్టింది. యీ నెలరోజులకే మనిషి పూర్తిగామారిపోయింది దాదా.''

"నీమొహంలే! మరీకుర్రతనంగా వాగబోకు. నీవు

పోయి నీ మంచంమీద పండుకో, మేము పోతాము" అంటూ శివరాం లేచి నిలబడి అంగూర్ వైపుతిరిగి "పోదామా, అంగూర్" అన్నాడు.

ఆమె "పోదాం బాబూజీ" అంది.

కారు ట్యాంకుబండుమీద ఆపి "ఇక్కడకాసేపు వుండిపోదాము అంగూర్" అన్నాడు

ఆమె మాట్లాడకుండా కారుదిగి అతనిని అనుసరించింది. శివరాం రెయిలింగ్సును ఆనుకుని హుస్సేన్‌సాగర్ వైపు చూస్తూ అన్నాడు "అంగూర్ పౌర్ణమియెప్పుడు?"

ఆమె నవ్వుతూ అంది "పౌర్ణమి వెళ్ళిపోయి పది దినాలైంది బాబూజీ!"

"ఓహో! రాబోయ్యేది అమావాస్యఅన్నమాట. అయితే ఆపైనవచ్చే పౌర్ణమికి యీ హుస్సేన్‌సాగర్ మీద పడవషికారు పోదాం అంగూర్."

ఆమెనుండి సమాధానం లేదు. "మాట్లాడవేం అంగూర్."

"అలాగే పోదాం బాబూజీ!"

"అంగూర్ యీరోజు నీవు యిచ్చేసమాధానాలలో చాలామార్పు అగుపిస్తూంది!"

"యేమిమార్పు బాబూజీ"

"ప్రథమంలో నేను యేదైన చెపితే "వద్దు" అనేదానివి. ఆ తరువాత "మీ ఇష్టం" అంటూ వచ్చావు. ఇక యిప్పుడు "అలాగే బాబూజీ" అంటున్నావు. ఇది మార్పుఅవునా, కాదా?"

"అవును బాబూజీ! నేను యిప్పుడిప్పుడే మిమ్మల్ని అర్థంచేసుకోగలుగుతున్నాను. మీరు నాకూ, రాంకీ కూడా సంరక్షకులు, మీకు సన్నిహితంగా మెలగటం, మీరు చెప్పినట్లు నడుచుకోవడం మాధర్మం బాబూజీ!"

శివరాం సూటిగా ఆమె కళ్ళల్లోకి చూచాడు "నీవుకూడా పెద్దకబుర్లు నేర్చావు అంగూర్."

"మీదయ బాబూజీ"

"అదిగో! దయాగియామాటలు మాత్రం అనవద్దు" అంటూ అతను ఆమె చెయ్యిపుచ్చుకుని "ఇక పోదాం, రా" అనిచెప్పి కారుదగ్గరకు నడిచాడు. వారికియెదురుగా మరోకారువచ్చి నిలబడింది. దానిలోనుండి శివరాం మేన మామ్మబిడ్డలు పద్మ, కమల, పెదబాబు, చినబాబు దిగి వారిచుట్టూ మూగారు.

శివరాం వారిముఖాలలోకిచూస్తూ "హలోపద్మా, కమలా యెక్కడికి బయలుదేరారు?"

"నీకోసం తిరిగి తిరిగి వచ్చాం బావా!" అంది పద్మ.

"యెక్కడెక్కడ తిరిగారేమిటీ?"

"మీ స్టుడియోకి, మీ ఇంటికి" చినబాబు చెప్పాడు.

"మరి ముందుగా మీరు కాస్త ఫోన్‌లో చెప్తే నేను ఇంటిదగ్గరే వుండేవాడినిగా"

"అలాచెయ్యక పోవడం పొరపాటేబావా!" పద్మ వొప్పుకుంది.

ఇంతసేపూ అంగూర్ చేతిని అతను వదలిపెట్టలేదు. ఆమె ఒకటి రెండుసార్లు తనచెయ్యి విడిపించుకోవడానికి ప్రయత్నించింది. శివరాం అది గ్రహించి పట్టు ఇంకా బిగించాడు. పద్మ ఆమెవైపుచూస్తూ "యేం పంకజం కులాసాగావున్నావా" అంది.

అంగూర్ బెదురుతూ చూచింది. శివరాం ఆమె చేతిని వదలిపెట్టాడు. "కులాసాయే అమ్మాయిగారూ. మీ అమ్మగారు క్షేమంగావున్నారా?"

"ఆ క్షేమమే పంకజం" పద్మ సమాధానం చెప్పింది "పంకజం, ఆ రోజున ఇంట్లో చెప్పకుండానే వెళ్ళిపోయావటగా!" పెదబాబు అడిగాడు. పద్మ అతనిని మందలించింది. "పెదబాబూ అంతటితో ఆపు."

శివరాం అందుకున్నాడు "అయితే! ఇక్కడనిలబడి మాట్లాడడం బాగులేదు పద్మా! మా ఇంటికి పోదాం రండి"

"లేదుబావా! మేము ప్రస్తుతం రామరాజు మామయ్యగారి ఇంటికి పోతున్నాం. రేపు నాపుట్టినరోజు పండుగ. అందుకే స్వయంగాకలుసుకొని ఇన్విటేషన్లు యిచ్చిపోదామని వచ్చాను" అంటూ ఆమె ఒక ఇన్విటేషన్‌తీసి శివరాం చేతిలోపెట్టింది. మరో ఇన్విటేషన్‌మీద పంకజంపేరు వ్రాసి ఆమెకు అందిస్తూ అంది "పంకజం, నీవుకూడా రేపు తప్పకుండారావాలి. అమ్మ చాలా సంతోషిస్తుంది."

"అలాగే అమ్మాయిగారూ!" అంది అంగూర్.

కార్లురెండూ రెండువైపులకు కదలిపోయాయి.

# 9

ఆరాత్రి భోజనాలసమయంలో సూర్యకాంతమ్మ అడిగింది. 'యేమమ్మా! పద్మా, యిన్విటేషన్లు ఎంతమందికి అందజేసావు?'

'పోస్టుద్వారాపంపిచినవి, ఇరవై పర్సనల్‌గా ఇచ్చినవి నలభై అయిదు. మొత్తం అరవై అయిదేనమ్మా!'

'చాలులేఅమ్మా! అంతకంటే మోపుఅయితే ఇక్కడ నిర్వహించుకోవడం కష్టంఅవుతుంది తల్లీ!'

'మనదియేముంది అమ్మా! అంతా హోటలువాళ్ళే యేర్పాటు చేస్తారుగా, మనం కష్టపడవలసిన అవసరం యేముందీ?'

'అవుననుకో; పిల్లాజల్లా వందమందిదాకా ఇక్కడ పోగైతే బంగాళాఅంతా చికాకుగా తయారుఅవుతుంది. ఇంతటితోసరిపెట్టు. కొత్తగా ఇకను యెవ్వరికి ఇన్విటేషన్లు పంపకు తల్లీ!'

'మాకాలేజీ ప్రొఫెసర్లు ఇద్దరు ముగ్గురు మిగిలిపోయారు అమ్మా!'

'ఇద్దరు ముగ్గురు అయితే సమస్య యేముందిలే తల్లీ!'

'అమ్మా! మాక్లాసుమేట్సు నలుగురు వున్నారమ్మా!' చినబాబు అన్నాడు.

సూర్యకాంతమ్మ కొడుకువైపు ఆప్యాయంగా చూచింది. 'చినబాబూ, నీ స్నేహితులను నీపుట్టినరోజు పండుగకు పిలుద్దువుగానిలే బాబూ!'

'అమ్మా! మా ముఖ్యస్నేహితుడు ఒక్కఅతను మాత్రమే వున్నాడమ్మా' పెదబాబు చెప్పాడు.

'యెవరు అంతముఖ్యస్నేహితుడు. పెదబాబూ?' సూర్యకాంతమ్మ అడిగింది.

'మంత్రిగారికొడుకు, సురేష్.'

'జూబిలీహిల్సులో ఆ పెద్ద బంగళాలో వుంటున్న వారి అబ్బాయేనా! పెదబాబూ' సూర్యకాంతమ్మ మళ్ళీ ప్రశ్నించింది.

'అవును అమ్మా'

సూర్యకాంతమ్మనుండి జవాబురాకపూర్వమే పద్మ అందుకుంది 'ఆ సురేష్‌యెక్కడో ఇంజనీరింగు కాలేజీలో చదువుతున్నాడుగదా! నీకూ అతనికి స్నేహంఎలా కుదిరింది పెదబాబూ!'

'అతనుకూడా అప్పుడప్పుడు క్రికెట్ ఆడటానికి వస్తాడు, పద్మ అక్కా'

'అంతేనా, బస్సులోకలసిన స్నేహంకాదుగదా!' పద్మ విమర్శించింది.

'యేం, బస్సులలో కలసినస్నేహితులైతే పనికిరారు కాబోలు' కమల అందుకుంది.

'నీ పుట్టినరోజుపండుగనాడు అలాంటివాళ్ళనే పిలుచుకో కమలా! నా అభ్యంతరం యేమీలేదు' పద్మసమాధానం.

'అసలు నేను పుట్టినరోజు పండుగ చేసుకోబోవటం లేదుగా యెవరినిపిలవడానికైనా?' కమల కోపంతో అంది.

'అబ్బ! ఇక అంతటితో ఆపండమ్మా! మీ వాదనలు, మీరూనూ వినలేక నా ప్రాణం విసికిపోతూంది. ఒకరిని మించినవారు ఇంకొకరు' కుమార్తెలవైపు చూస్తూ సూర్యకాంతమ్మ అంది.

'అమ్మా! పద్మ ఆ పంకజానికికూడా ఇన్విటేషను యిచ్చిందమ్మా' కమల చెప్పింది.

సూర్యకాంతమ్మ బెదురుతూ చూచింది. 'యే పంకజమే'

'అదే! ఆ లంబాడిది. మనఇంట్లో పాచిపని చెయ్యలేదూ! అది' కమల అక్కసు వెళ్ళబుచ్చింది.

సూర్యకాంతమ్మ దవడలు నొక్కుకుంది. 'అవ్వ, సెక్రటేరియట్ సభ్యులు, మంత్రులు, శాసనసభ్యులు, ప్రముఖ ఇంజనీర్లు, కంట్రాక్టర్లు పాల్గొనేవిందులో ఆ పంకజం ఏమిటే నీ పంకజంపాడుగాను, దానికి ఇన్విటేషను ఎందుకు ఇచ్చావు?'

'అమ్మా నీకు అంతకంగారు పనికిరాదమ్మా, నేను ఇన్విటేషను ఇచ్చినా ఆ పంకజం మనగడప తొక్కుతుందని నేను అనుకోను. ఆమె చాలా నీతీ నిజాయితీ గలపిల్ల. నాకు ఆవిషయం తెలుసు. ఆమె, బావాకలిసి వుండగా నేను బావకు ఇన్విటేషను అందించడం సందర్భపడింది. మర్యాదకోసం ఆమెకుకూడా ఒకటి యిచ్చాను' పద్మ ఆవేశంతో అంది.

సూర్యకాంతమ్మ వెంటనే అందుకుంది. "అయితే మాత్రం కాస్త వెనకాముందూ ఆలోచించుకోరూ! మన అంతస్థుఎక్కడా? ఆ పంకజం ఎక్కడా? వూడిగంచేసుకుని బ్రతికేదానికి మనం ఇన్విటేషన్ ఇవ్వడం యేమిసబబు పద్మా!"

పద్మ మండిపడింది. "అమ్మా! ఆ పంకజం కడజాతి కుటుంబంలోనే పుట్టివుండవచ్చు. ఆమె నిరుపేదకూడా కావచ్చు. సందేహంలేదు. కాని వ్యక్తులయొక్క నైతిక విలువలను కొలిచేవి ధనమూ, దర్పమూ కాదు, నీతీ, నిజాయితీ అనే సంగతి గుర్తుంచుకోవాలి. ఆ విధంగా పంకజం మనకంటె పై అంతస్తులోనే వుందని నా అభిప్రాయం."

"కమల రెట్టించింది. "పద్మా! నీ పంకజం యెవరికంటె పై అంతస్తులోవుందంటావు! నీకంటెవుందేమో! మమ్మలనుకూడా కలుపుతావు యెందుకూ"

కమలా! నువ్వేనా ఆ మాట అనేది?"

"అవును నేనే పద్మా! నేను యెప్పుడో యెవడికో జాబులు వ్రాశాననేగా నీవు అనేది. నీ బ్రతుకు ఏమిటో చెప్పు. వాడు యెవడో మెడికల్ కాలేజీ విద్యార్థికి నెలకు పాతిక వుత్తరాలు రాస్తావే, పైగానన్ను రెట్టిస్తావు ఎందుకు?"

"అవును కమలా! నేను మెడికల్ కాలేజీ విద్యార్థికి నెలకు పాతిక జాబులుకాదు యాభై రాస్తాను. మేము యిద్దరము వివాహంచేసుకుంటాం. అది నిర్ణయం అయిపోయింది.

కాని నీవో! నీ బ్రతుకు యేమిటి? వార్తేరులో వాడెవడో వివాహితుడైన కాంపౌడరును పట్టుకుని జాబులుమీద జాబులు వ్రాశావు, వాడితో విచ్చలవిడిగా తిరిగావు. అది మాపుచేసుకోడానికి అమ్మా, నాన్నా ఎన్ని యాతనలు పడ్డారంటావు? సిగ్గులేకుండా ఇంకా బింకంగా వాగుతావు దేనికి? పంకజం పాదధూళితోకూడా నీవు సరితూగవు, తెలిసిందా!" అంది పద్మ.

కమల వెక్కి-వెక్కి యేడుస్తూ బల్లదగ్గరనుండి లేచి పోబోయింది. సూర్యకాంతమ్మ ఆమెను పట్టుకుని "మీతో నాకు చావువచ్చిందేతల్లీ! మీ వాదనలు మీరూనూ, నాకు మతిపోతూంది అమ్మా! కాస్త పెరుగువేస్తాను ఆ నాలుగుమెతుకులుకలుపునితినవేలేమ్మా! మా తల్లివికదూ!" అంటూ బుజ్జగించింది. కమల మళ్ళీపళ్ళెంముందుకూచుంది. సూర్యకాంతమ్మ పెరుగుగిన్నె పుచ్చుకుని తలా ఒక గరిటె పెరుగుపోసింది.

సూర్యకాంతమ్మ పద్మవైపు చూస్తూ అంది. "అమ్మా! పద్మా! యీ మెడికల్ స్టూడెంటు ఎవడే! వాడికి వుత్తరాలు ఎందుకురాస్తున్నావు. నా బొందెలో ప్రాణం వుండగా కులం గోత్రం తెలియనివాడికి నా పిల్లలను యివ్వను. అది అక్షరాలా నిజం. నీవు బావను చేసుకుం టావని నేనూ మీ నాన్నకూడా అభిప్రాయపడుతూన్నాం. మీ బావకోసమే రేపు యీ విందు యేర్పాటుచేస్తున్నాం. వెయ్యిరూపాయిలకుపైగానే ఖర్చుఅవుతూంది. నువ్వు

యెవడో మెడికలువిద్యార్థిని వివాహంచేసుకోదలిస్తే యింత పెద్దయెత్తున యిందు ఏర్పాట్లు దేనికిచేస్తానమ్మా! నీ పిచ్చ గానీ"

"అమ్మా! బావ నన్ను చేసుకోడమ్మా"

"యెందుకని చేసుకోడంటావు?"

"మన కుటుంబంపట్ల బావకు సదభిప్రాయంలేదు"

"యెందుచేత లేదంటావు?"

పద్మ తల్లివైపు తీవ్రంగా చూసింది. "అమ్మా! నా నోటితో ప్రతీదీ చెప్పించడానికి ప్రయత్నించవద్దు. అది మనకు యెవ్వరికీమంచిదికాదు; అయినా నేను ఒకవిషయం అడుగుతాను. పంకజం మన ఇంట్లో పని యెందుకు మానేసింది అంటావు. సూరిరాజు ఎలా చచ్చిపోయాడుఅంటావు. నన్ను ఇక అట్టే వాదించవద్దు అమ్మా! అవమానంతో నా హృదయం కుంగిపోతూంది." అంటూ పద్మ తల్లిసమాధానంకొరకు యెదురుచూడకుండా అక్కడనుండి లేచి చెయ్యికడుక్కుని వెళ్ళిపోయింది.

"యెప్పుడో జరిగిన పాతగొడవలన్నీ మళ్ళీ తవ్వుతావు యెందుకేతల్లీ!" అంది సూర్యకాంతమ్మ.

సూర్యకాంతమ్మ తనగదిలోకిపోయి కూచుని పద్మకు కబురుచేసింది. పద్మవచ్చి తల్లికి యెదురుగా కుర్చీలాక్కుని కూర్చుంది. రెండు నిముషాలు మౌనంగా గడిచాయి. సూర్యకాంతమ్మ నెమ్మదిగా ప్రారంభించింది. "పద్మా! మన కుటుంబ ఆర్థికపరిస్థితి నానాటికీ దిగజారి

పోతూంది. కంట్రాక్టులలో మీ నాన్నగారికి పెద్ద లాభాలు యేమీ రావటంలేదు."

"అయితే నన్నేమిచెయ్యమంటావు అమ్మా!"

"నీవు బావను వివాహంచేసుకోతల్లీ! అతనిమీద ఆశపెట్టుకునే నేను ఇంతపెద్దవిందు ఏర్పాటు చేస్తున్నాను."

"మరి ఆ విషయం ముందుగా నాకు ఎందుకుచెప్ప లేదమ్మా! బావమాత్రం నన్ను వివాహంచేసుకోడు. ఆ విషయం నేను ఖచ్చితంగా చెప్పగలను"

"నిన్ను చేసుకోనని అతను ఎప్పుడైనా నీతో అన్నాడా?"

"లేదమ్మా! అంత సూటిగా నేను బావనుఅగడనూ లేదు, ఆయన చెప్పనూలేదు"

"మరి నీవు వూహించావన్నమాట"

"కేవలం వూహమాత్రమేకాదు. అమ్మా, ప్రారం భంలో నాకు బావతో పరిచయమైనప్పుడే అతన్ని వివా హంచేసుకోవాలని అనుకున్నా. పోయిన వేసవిలో వాల్తే రులో బావతో కలిసిమెలసి తిరిగాను. ఒకసారి ఆయనను అడిగానుకూడా. "బావా, నీవు వివాహం ఎందుకు చేసు కోలేదూ"అని. "వివాహం చేసుకోవాలనే అభిలాష కలుగ లేదుకాబట్టి" అని అతను వెంటనే సమాధానం చెప్పాడు.

నేను మరో ప్రశ్నవేశాను. "అయితే జీవితమంతా అవివాహితుడిగానే వుండిపోతావా బావా" ఆ ప్రశ్నకు అతను "వివాహం విషయంలో నేను యిప్పటివరకు ఒక

నిర్ణయానికి రాలేదు పద్మా!'' అని చెప్పాడు. కాబట్టి అలాటివాడిమీద మనం ఆశలుపెట్టుకోవడం మంచిది కాదు అమ్మా'' అని చెప్పింది పద్మ.

బిడ్డచెప్పిన సమాధానం విని సూర్యకాంతమ్మ దీర్ఘాలోచనలో పడింది. నాలుగు నిముషాలతరువాత ఆమె తాపీగా అంది. "పోనీలే అమ్మా! అతను అంటే అన్నాడు, అయినా మనం నిరుత్సాహపడవలసిన పనిలేదు. నేను మీ నాన్నగారు అతనివిషయంలో గట్టి ప్రయత్నాలు చేస్తాం. మా మాటకాదని అతను తోసిపుచ్చలేడు. ఇక పైకిపోయి పడుకో'' అంది సూర్యకాంతమ్మ.

కాని పద్మ అక్కడనుండి కదలలేదు. సూర్య కాంతమ్మ ప్రశ్నార్థకంగా ఆమెవైపుచూచింది. "పొద్దుపో తూంది. వెళ్ళి పడుకో అమ్మా'' అంది.

పద్మ భయపడుతూ అంది. "అమ్మా! నా కోసం బావను మీరు బలవంతం చెయ్యడం నాకు ఏమీ యిష్టం లేదు అమ్మా!''

"ఆ విషయం నీకు సంబంధించినదికాదు. పద్మా'' సూర్యకాంతమ్మ కొంచం కటువుగానే అంది.

పద్మ బెదురుతూ చూచింది. "అమ్మా! ముందు కమలవివాహం జరిగిన తరునాత కదా, నా వివాహం విషయం ఆలోచించవలసింది.''

"అవును ఆమాటనిజమే. కమలకు వేరేసంబంధం చూస్తున్నాం''

"మీకు బావతో సంబంధం నిలబెట్టుకోవాలని వుంటే కమలనే బావను చేసుకోమనండి,"

"మరి నీవు"

"నేను ఆ వైద్య విద్యార్థిని చేసుకుంటాను."

"వాడెవడే! ముక్కూ మొహం తెలియనివాడిని చేసుకుంటాననటా వేమిటే! నీకేమైనా మతిపోయిందా!"

"వాడూ—వీడూ అని నీవు అతన్ని చులకనగా మాట్లాడటం మంచిదికాదు అమ్మా! అతను చాలా యోగ్యుడు. చక్కని సంస్కారం కలవాడు. విద్యావంతుడు. ఆరోగ్యంగానూ, అందంగాను ఉంటాడు. నేను అతన్ని వివాహం చేసుకోడానికి నిర్ణయించుకున్నాను. మీరు అంగీకరించినా, అంగీకరించకపోయినా నేనువివాహమంటూ చేసుకుంటే అతనినిమాత్రమే చేసుకుంటాను. బావనుగాని, మరొకరినిగాని మీరు కుదిర్చినా నేను వారినెవరినీ చేసుకోను."

"అతని కులం యేమిటో?"

"యేమో! అతనికులం అడిగి తెలుసుకోవలసిన అవసరం నాకు కలుగలేదు."

"నీ తెలివి తెల్లార. కులం తెలియనివాడితో పెండ్లేమిటే!"

పద్మ కుర్చీలోనుండి లేచి నిలబడింది. ఆమె బింకంగా తల్లివైపు చూస్తూ చెప్పుకుపోయింది. "అమ్మా! అతని కులం యేమిటో నాకు తెలుసు. కాని ఆ విషయం నీకు చెప్పటం ఇష్టంలేక బయటపెట్టలేదు. నీవు బహుశా

నా స్నేహితురాలు పరిమళను చూచివుంటావు. ఆ మధ్య మన యింటికి నాలుగైదుసార్లు వచ్చింది. ఆమె నా క్లాసు మేటు. నేను వివాహంచేసుకునేది వాళ్ళ అన్నగారినే. అతనిపేరు చంద్రశేఖర్. వాళ్ళది కర్నూలుదగ్గర యేదో పల్లెటూరు. వాళ్ళు రెడ్లు. అంతకుమించిన వివరాలు నాకు తెలియవు. తెలుసుకోవలసిన అగత్యమూలేదు, మీకు కష్టమూ, నష్టమూ లేకుండ నేను అతనిని వివాహం చేసుకుంటాను. ఒకవేళ మీరు ఆమోదించకపోయినా నేను అతనిని వివాహం చేసుకోవటం తథ్యం,''

''కులంకాని కులంవాడితో పెండ్లా!'' సూర్యకాంతమ్మ గుండెలు బాదుకుంది. ''ఓరి దేవుడా! యేడుకొండలవాడా! వెంకటరమణా, ఎక్కడున్నావురా తండ్రీ! నన్ను ఎత్తుకుపోరాదూ! కులంకానివాడితో పెండ్లేజరిగితే నేను యెక్కడ తలయెత్తుకు తిరగగలను, నుయ్యో, గొయ్యో చూచుకోవాలిసిందే'' అంటూ వెక్కి వెక్కి యేడ్చింది.

''దేనికమ్మా! అంత విచారపడతావు, నేనేమీ కాని పనిచెయ్యడంలేదు. నాకు యిష్టమైనవాడిని, నేను మనసారా ప్రేమించిన యువకుడిని వివాహం చేసుకుంటానని చెపుతున్నాను. నా యీ నిర్ణయానికి తిరుగులేదు. నా మీద నీకేమైనా ప్రేమ అనేదివుంటే నా వివాహానికి అంగీకరించు. అంతకంటే నేను చెప్పేది యేమీలేదు. నన్ను బావకు కట్టాలనే ప్రయత్నం విరమించుకోండి. అది మీకూ నాకూకూడ మంచిది'' అంది పద్మ.

సూర్యకాంతమ్మ తేరుకుని "నీ పట్టుదల యేమిటో నేనూ చూస్తాను. నేను జీవించివుండగా నీకు ఆ రెడ్డితో వివాహం జరగదు. జరుగనీయనుగాక జరుగనీయను. కన్న బిడ్డవుకదా అనే కనికారంతో యింతవరకు ఓర్పువహించాను. ఇక నా ఓర్పుకు అర్థంలేదు. ముమ్మాటికీ వీలుపడదు. ఇది నా నిర్ణయం. మమ్మలను అందరినీ కాదని నీవు యెలా బయటపడతావో నేనూ చూస్తాను" అంది ధీమాగా.

"అమ్మా! దేనికి అంత బింకంగా మాట్లాడతావు. నీవు కాదుగదా బ్రహ్మ దిగివచ్చినా మావివాహం ఆగదు. మేము లోగడ యెప్పుడో నిర్ణయించుకున్నాం, నేను పోతున్నాను" అంటూ ఆమె ద్వారంవైపు నడిచింది.

సూర్యకాంతమ్మ మంచంమీద లేచికూచుంది.

"ఒసే, రాక్షసీ: నువ్వు మా కడుపున చెడబుట్టావు. మా పరువు గంగలో కలుపుతావుటే: ఛండాలపుదానా, రేపు విందు జరుపనేజరుపను" అంది ఆవేశంతో.

పద్మ తల్లివైపు తిరిగి "అమ్మా నేను రాక్షసిని మాత్రం కాదమ్మా. రాక్షసులు అనిపించుకునేవాళ్ళు వేరే వుండనేవున్నారు. నూకరాజు హత్యకు కారకులు ఎవరో నీకూ, నాకూకూడా తెలుసు. వాళ్ళు రాక్షసులు. నీపరువు నాన్నగారిపరువు నాకు తెలియనిదికాదు. మీగర్భవాసాన పుట్టినందుకు నేను యెంత బాధపడుతూన్నానో నేను నీకుఎలా చెప్పగలను. యీ యమకూపంనుండి బయటపడడానికి నేను అహర్నిశలు కుమిలిపోతున్నా. నీ డాబులు, దర్పాలు నాకు అవసరంలేదు. నీవు విందుమానేస్తే నేను

చాలాసంతోషిస్తాను. నన్నుగురించి నీవు యేమీ బాధ పడవద్దు. ఒకటి రెండురోజులలో నేను యిక్కడనుండి వెళ్ళిపోదలచుకున్నాను." అని చెప్పి ఆమె గుమ్మందాటి మేడమెట్లు యెక్కి పైకిపోయింది.

సూర్యకాంతమ్మ ఇల్లుఅంతా అదరిపోయేట్టు కెవ్వున కేకపెట్టింది. ఆమెకు ఫిట్టువచ్చింది. నౌకర్లంతా పరుగెత్తుకువచ్చారు. కమలా, పెదబాబు, చినబాబు మేడ దిగివచ్చారు. సూర్యకాంతమ్మ పరుపుమీదపడి అటూ ఇటూ కొట్టుకుంటూంది.

పోర్టికోలో కారు ఆగింది. నారాయణరాజుగారు కారుదిగి లోపలికివచ్చారు. చినబాబు ఆయనకు యెదురై 'నాన్నగారూ, అమ్మకు ఫిట్టువచ్చిందండీ.' అని చెప్పాడు. నారాయణరాజు మాట్లాడకుండా సూర్యకాంతమ్మ మంచం దగరకుపోయి ఆమె ముఖంలోకి పరీక్షగా చూచాడు. తరువాత ఆయన పిల్లలవైపుతిరిగి 'పెదబాబూ! నీవు లోపలికి పోయి ఫ్రిజిడరీలో అయిస్‌వాటర్ ఒకగ్లాసుతో తీసుకురా' అని చెప్పాడు.

పెదబాబు అయిస్ వాటర్ జార్ తెచ్చి ఆయనకు అందించాడు. 'ఒరీ నీ తెలివితెల్లారా! గ్లాసుతో తీసుకు రమ్మంటే జార్ పట్టుకొచ్చావేమిటిరా' అని ఆ చల్లని నీళ్లు తీసి సూర్యకాంతమ్మ ముఖంమీద చల్లాడు. సూర్యకాంతమ్మ వెంటనే కళ్ళు తెరిచింది. నాలుగునిముషాలతరువాత ఆమె లేచికూర్చుంది. పదినిముషాలు కబుర్లయినతరువాత సూర్యకాంతమ్మ పిల్లలనందరినీ వెళ్ళిపొమ్మని చెప్పిం...

వాళ్ళు పోయినతరువాత ఆమె భర్తతో తాపీగా పద్మ విషయం చెప్పేసింది.

నారాయణరాజు పదినిముషాలు దీర్ఘంగా ఆలోచించాడు. 'పద్మఅసలే కంకమతిపిల్లగదా, దానిని ఎందుకు రెచ్చగొట్టాలి నువ్వు?' అన్నాడు ఆయన.

'అయ్యో ఖర్మ నాదేముందండి. అన్నీ అదే ఏకరువు పెడితేను.'

'సరేలే, నీవు ఆవేశపడకు. నేను పైకిపోయి పద్మను తీసుకువస్తాను' అని చెప్పి ఆయన మేడపైకివెళ్ళాడు.

పద్మ తలుపులుబిగించుకుని గదిలోపల పండుకుంది. తండ్రిపదిసార్లుపిలవగాపిలవగాఆమెలేచివచ్చి తలుపులు తెరచింది. గదిలో లైటులేదు. 'అదేమిటమ్మా! అప్పుడే లైటు తీసివేశావు' అంటూ ఆయన స్విచ్ నొక్కాడు. ఆ వెలుతురులో ఆయన పద్మవైపు చూచాడు. ఆమె కళ్ళు ఎర్రబడ్డాయి. తలఅంతా రేగివుంది. 'పిచ్చితల్లీ! కళ్ళు ఎర్రబడేట్టుఏడ్చావు, తప్పుకదూ!' అంటూ ఆయన బిడ్డతలను ఆప్యాయంగా తట్టాడు. ఆమె ఇంకా ఎక్కువగాఏడ్చింది. 'నాతల్లివిగా! వూరుకో నీ ఇష్టంవచ్చినవాడినే వివాహం చేసుకుందువుగాని, నాఅభ్యంతరం ఏమీలేదు' అన్నాడు.

పద్మ కొంగుతో కళ్ళుతుడుచుకొని 'కూర్చోండి నాన్నగారూ' అంటూ ఒకకుర్చీ ఆయనవైపుకు తోసింది. నారాయణరాజు కుర్చీలోకూర్చుంటూ 'నీవుకూడా ఇంకో కుర్చీలాక్కో రెండునిముషాలు మాట్లాడుకుందాం' అన్నాడు.

ఆయన పద్మ ప్రేమించానన్న చంద్రశేఖరును గురించిన వివరాలు అడిగాడు. పద్మ తనకు తెలిసింతవరకు వివరాలన్నీ తండ్రికి నివేదించింది. ఆయన నెమ్మదిగా అన్నాడు 'సరేనమ్మా! నీవు అతనినే వివాహం చేసుకుంటానని అంటున్నావు, మరి అతను నీమాదిరిగా గట్టిగా నిలబడగలుగుతాడో, లేదో!'

'యెందుకు నిలబడడు నాన్నగారూ! అతన్ని గురించి నాకు బాగా తెలుసు. యెట్టిపరిస్థితులలోను అతను వెనుకాడడు.'

'ఏమోనమ్మా! నీవు అతనివిషయం అంతగట్టిగా ఎలాచెప్పగలుగుతావు. యీ వర్ణాంతర వివాహాలకు అడుగు అడుగునా అవరోధాలు వాటిల్లుతాయి. మీ అమ్మమాదిరిగానే అతని తల్లిదండ్రులుకూడా మీ వివాహానికి అభ్యంతరం చెప్పవచ్చు'

'నాన్నగారూ! సాంఘికంగా, ఆర్థికంగా సాంస్కృతికంగా వాళ్ళస్థాయికీ, మనస్థాయికీ ఏమీ తేడాలేదు నాన్నగారూ. అలాంటప్పుడు ఏదో వర్ణాంతరమనే భేదం మనం ఎందుకు కల్పించుకోవాలి. ఒకవేళ వాళ్ళ తల్లిదండ్రులు వ్యతిరేకించినా అతనుమాత్రం వెనకాడడు.'

'ఆవిషయం మనం యిప్పుడు నిర్ణయించలేమమ్మా! వాళ్ళ వర్ణంకాని పిల్లను నిన్ను వివాహంచేసుకుంటే అతని తల్లిదండ్రులు రేపు అతనిచదువు మాన్పించవచ్చు. అసలు అతనికి ఆస్థి దక్కకుండా చేసినాచెయ్యవచ్చు. అలాంటి

పరిస్థితులుగనుక వస్తే అతను జారిపోడని నీవు యెలాచెప్ప గలుగుతావు.'

'ఆపరిస్థితులన్నీ మేము ముందుగానే ఆలోచించాం నాన్నగారూ! వాళ్ళూ, మీరూకూడ మాకు పైసాయివ్వక పోయినా స్వతంత్రంగా ఉద్యోగాలుచేసి బ్రతకాలను కున్నాం.'

'ఒకవేళ అతను వాళ్ళబంధువులవత్తిడికిలోనై రేపు నిన్ను వివాహం చేసుకోను అంటాడనుకో! అలాం టప్పుడు మేమునీకు వేరే మంచిసంబంధంచూస్తాం. అది అంగీకరించడానికి నీకు అభ్యంతరంవుండదుగా!'

'నాన్నగారూ! మాటలగారడిలోనన్ను మీరు మభ్యపెట్టడానికి ప్రయత్నించవద్దు. ఒకవేళ చంద్రశేఖర్ వాళ్ళ బంధువుల వత్తిడికిలోనై నన్ను వివాహంచేసుకో డానికి నిరాకరిస్తే నేను ఇంకొకర్ని వివాహంచేసుకునే సమస్యలేదు. జీవితాంతంవరకు అవివాహితగానే వుండి పోతాను. మీరు కాదుకూడదుఅంటే నేను సన్యసించియే ఆశ్రమంలోనన్నా చేరిపోతాను నాన్నగారూ' అంది పద్మ.

నారాయణరాజు దెబ్బతిన్నవాడివలే నిర్ఘాంతపోయి కుమార్తెవైపుచూచాడు

'ఓయి బాబురే! చాలవరకు పోయిందే వ్యవహారం' అనుకున్నాడు. కాని పైకి 'అమ్మా పద్మా, యెవరుఅను కున్నా, కాదనుకున్నా నిశ్రేయస్సు కోరేవాడిని నేను ఒక డిని వున్నాను. అనేవిషయం మనసులో పెట్టుకో. యెట్టి పరిస్థితులలోను నీకు కష్టాలు కల్గడం నేను

సహించలేను, సహించను. మన పరిస్థితులన్నీ సవ్యంగా ఆలోచించి నీకు ఆమోదమైనవాడితోనే నీ వివాహం జరిపిస్తాను. దానిలో సందేహం లేదు."

"మంచిది నాన్నగారూ!"

నారాయణరాజు తన జేబులోనుండి ఒక చిన్న పెట్టె తీసి "నీకు బర్తుడే ప్రజంటు" అన్నాడు.

"యేమిటి నాన్నగారూ అది?"

"యేమిటో చెప్పుకో"

"చెయిన్ అయివుంటుంది"

"కాదమ్మా!"

"మరి!"

ఆయన పెట్టె మూతతీసి చూపెట్టాడు. ముత్యాల నెక్‌లెస్. ఆమె కళ్లు ఆనందంతో మెరిశాయి. కాని ఆమె అంది "నాన్నగారూ! నగలమీద నాకేమంత పెద్ద మోజు లేదు. పాపం! అది మన కమలకు యివ్వండి"

"కమలకుకూడా వేరే ఒకటి తెచ్చానమ్మా! కిందికి పోదాము రా. మీ అమ్మకు చూపెట్టి వద్దువుగాని." అన్నాడాయన.

పద్మ, నారాయణరాజు యిద్దరు కిందికి వెళ్ళేసరికి సూర్యకాంతమ్మ దిళ్ళకు ఆనుకుని కూర్చుని అకౌంట్సు చూస్తూవుంది. పద్మ సరాసరి తల్లిముందుకు పోయి "అమ్మా! నాన్నగారు నాకు పెరల్‌నెక్‌లేసు తీసుకువచ్చారమ్మా!" అంది.

సూర్యకాంతమ్మ తల పైకి యెత్తకుండానే "మీ కే

మమ్మా! మీ నాన్నగారు ఘరానాకాంట్రాక్టరు, పెరల్ నెక్ లేసు కాకపోతే డైమండ్ నెక్ లేసు అయినా తీసుకు రాగల సమర్థులు. నాకు తెచ్చేవారు యెవరూ లేరుగదా!"

"అమ్మా, కమలకుకూడా వేరే తెచ్చానన్నారు నాన్నగారు. అది యెలావుందమ్మా?"

అబ్బే! అదేమంత బాగులేదమ్మా! నీ నెక్ లేసే బాగుంది."

"అయితే యీ నెక్ లేసు కమలకు యివ్వు అమ్మా! అది నేను పెట్టుకుంటాను"

సూర్యకాంతమ్మ తల పైకి యెత్తి బిడ్డవైపు చూచింది. "మాతల్లే! మీ నాన్నగారు నీమీద ప్రేమ కొద్దీ నీ పుట్టినరోజు పండుగకు అది నీకు కానుకగా తీసుకు వచ్చారు. అది నువ్వే పెట్టుకో అమ్మా బాగుంది! కమలకు కావాలంటే నేను వేరే తెప్పిస్తాను" అంది.

కొంతసేపు కబుర్లు చెప్పుకున్న తరువాత సూర్య కాంతమ్మ పద్మవైపు చూస్తూ అంది "పొద్దుపోయింది. ఇక నీవు పోయిపండుకో అమ్మా! మళ్ళీ రేపు చీకటితో లేవాలి" పద్మ మాట్లాడకుండా లేచి మేడమీదికి వెళ్ళి పోయింది.

# 10

ఉదయం కాఫీ తీసుకుంటూ శివరామ్ అడిగాడు. "అంగూర్, పద్మ పుట్టినరోజు విందుకు నీవుకూడా వస్తావు కదూ!"

అంగూర్ అతనివైపు ప్రశ్నార్థకంగా చూచింది. కాని సమాధానం చెప్పలేదు. అతను మళ్ళీ ప్రశ్నించాడు. "అలా చూస్తావేమిటే, అంగూర్, విందుకు రావటం ఇష్టం లేదా నీకు"

"నేను యెందుకులే బాబూజీ! మీరు వెళ్ళిరండి"

"యేం పద్మ నిన్నుకూడా ఆహ్వానించిందిగదా! ఆమె మంచిది అంగూర్"

"పద్మ మంచిదే, ఆహ్వానించింది అనుకోండి కాని అక్కడకు రావడం నాకు యిష్టంలేదు బాబూజీ!"

"కారణం ఏమిటే అంగూర్"

ఆమె సమాధానం చెప్పలేదు. అతను ప్రశ్నించాడు "నీవు అక్కడికి రాకపోవడానికి కారణమేమిటో చెప్పు అంగూర్?"

"వాళ్లు మనుష్యులుకాదు బాబూజీ!"

"వాళ్ళు అంటే యెవరు అంగూర్"

"సూర్యకాంతమ్మ, ఆమెభర్త, తమ్ముడు, అందరూను"

"నీకు యెవరు చెప్పారు అంగూర్"

"ఆ ఇంటికాపలాఅతను సింగు చెప్పాడు, బాబూజీ"

"అతను ఎక్కడ అగుపించాడు నీకు?"

"యీమధ్య ఒకసారి మన యింటికి వచ్చాడు. మీ దగ్గర యేదైనా ఉద్యోగం దొరుకుతుందేమోనని అడగ డానికి వచ్చాడు బాబూజీ"

"యేమి చెప్పాడు అతను?"

"వంటమనిషి నూకరాజును వాళ్ళే చంపేశారట బాబూజీ!"

"ఎలా చంపారో!"

"గుండెల్లో పలుగు దిగేశారట బాబూజీ! శవాన్ని దహనంచేసినవాళ్లు సింగుతో చెప్పారట"

"నూకరాజును యెవరు చంపారని చెప్పాడు?"

"సూర్యకాంతమ్మ తమ్ముడు నరసరాజు"

"ఎందుకుగాను చంపారో!"

"సూర్యకాంతమ్మకు నూకరాజుతో సంబంధంవుందట బాబూజీ!"

"వాళ్ళ సంబంధం కొత్తదేమీ కాదుగా! ఇప్పుడు ఎందుకు చంపినట్లు?"

"సూర్యకాంతమ్మ అతనికి వ్రాసిన జాబులు బయట పెడతానని బెదిరించాడట. సూర్యకాంతమ్మ బయపడి ఆ జాబులు తనకు యిచ్చివేస్తే రెండువేల రూపాయలు యిస్తానందట. అదేమీ బయటపడకుండా నరసరాజు ఆరాత్రి నూకరాజును చంపేశాడు."

శివరామ్ దీర్ఘంగా నిట్టూర్చాడు. "ఎంత ఘోరం" అనుకున్నాడు అతను. అతని ఆలోచనలు పరిపరివిధాల పోయాయి. హంతకులు, దగాకోరులు కూడా నేటి సమాజంలో ఘరానా వ్యక్తులుగా చలామణీ అవుతున్నారంటే అంతకుమించిన వింత మరొకటి వుండబోదు అనుకున్నాడతను.

శివరామ్ ఆలోచనలో మునిగివుండటం గమనించిన అంగూర్ సంభాషణ ప్రారంభించింది. "బాబూజీ, పద్మ మంచిదని అంటున్నారుగదా! మీరు ఆమెను ఎందుకు వివాహం చేసుకోకూడదు.

అతను చిన్నగా నవ్వాడు "నాకు అలాంటి ఆలోచన లేదు అంగూర్"

"ఇంకా యెంతకాలం ఇలా ఒంటరిజీవితం గడుపుతారు బాబూజీ!"

"యేమో! చెప్పలేను అంగూర్, నాకు నచ్చినవాళ్లు దొరికితే చేసుకోవాలనే వుంది 'అంగూర్"

"మీరు ఇంతకాలంనుండీ ప్రపంచమంతా చుట్టి వస్తున్నారుగదా! మీకు నచ్చినవాళ్ళు యెక్కడా తటస్థపడలేదూ!"

"ఎందుకు తటస్థపడలా, పడ్డారు. కాని వాళ్లు నన్ను చేసుకోడానికి అంగీకరించవద్దూ!"

"మీకు యేమితక్కువ బాబూజీ! అందం, ఐశ్వర్యం, చదువు, సంస్కారం అన్నీ వున్నాయిగా, వాళ్లు యెందుకు ఒప్పుకోలేదు."

"ఎందుకు ఒవ్వకో లేదో యదార్థం చెప్పమంటావా! అంగూర్!"

"చెప్పండి బాబూజీ!"

అతను చెప్పుకుపోయాడు "నేను కలకత్తాలో చదువుతూన్న రోజులలో నాకు ఒకామెతో పరిచయం అయ్యింది. ఆమె పేరు "కుసుమ" చాలా అందమైనది. మా పరిచయం స్నేహంగా వృద్ధిపొందింది. నేను ఆమెను ప్రేమించాను. అయినా నేను ఎన్నడూ ఆమె గతజీవితాన్ని గురించి ప్రశ్నించలేదు. ఆమె నన్నూ ప్రశ్నించలేదు. నేను వేసవిలో కాశ్మీర్‌కు పోతూ ఆమెనుకూడా ఆహ్వానించాను. కాని ఆమె తనభర్త నేపీలో ఉన్నాడనీ, అతను వేసవిలో ఇంటికి వస్తున్నాడనీ, కాబట్టి తాను కాశ్మీర్‌కు రాలేననీ చెప్పింది. ఆ రోజున ఆమె యిచ్చిన సమాధానం విని నేనుపడిన మానసిక ఆవేదన నిజంగా యిప్పుడు చెప్పలేను అంగూర్"

అంగూర్ అతనివైపు జాలిగా చూచింది "బాబూజీ, చాలా ఘోరమేజరిగింది బాబూజీ!"

అతను మాట్లాడలేదు. సిగరెట్టుతీసి ముట్టించాడు.

"ఆమె ఒకత్తేనా, మీ దృష్టిలోవుంది బాబూజీ!" అంగూర్ అడిగింది.

"ఇంకొకరుకూడా వున్నారు అంగూర్"

"ఆమె యేమంది బాబూజీ!"

"ఆమెను నేను అడగడానికి అవకాశమే లేదు అంగూర్"

"ఆమె యెవరు బాబూజీ!"

"ఆమె యెవరో కాదు, నీవే అంగూర్!"

"బాబూజీ!" ఆమె బెదురుతూ అతనివైపు చూచింది. అతను చెప్పుకుపోయాడు "అవును, అంగూర్ నీవే, నాజీవితంలో నా దృష్టిని ఆకర్షించిన ఆ రెండో వ్యక్తివి నీవే. నేను ప్రప్రథమంగా బంజారాగుట్టలమీద నిన్ను చూచినప్పుడే నా మనస్సు నీమీద పడింది. నిన్ను చేయిజారిపోనివ్వగూడదనే అనుకున్నా. కాని నీవూ, రామ్‌కూడా చాలా పవిత్రమైన హృదయాలు కలవాళ్ళు. నేను మీకు ద్రోహం తలపెట్టలేను తలపెట్టను అంగూర్. రామ్‌ను, నిన్నూ మించిన ఆత్మీయులు యీ ప్రపంచంలో నాకు ఇంకెవ్వరూ లేరు. అంగూర్. నా జీవితాంతంవరకు మిమ్ములను వదలిపెట్టలేను. వదలిపెట్టను. మనం అందరం కలిసే వుందాం అంగూర్."

అంగూర్ కళ్ళనుండి నీళ్లు ధారగా కారాయి. ఆమె పెదవులు వణికాయి. మాట తడబడింది. ఆమె తల పైకెత్తి అతని ముఖంలోకి చూస్తూ "బాబూజీ!" అంది.

"నువ్వు యేమైనా చెప్పదలుచుకుంటే చెప్పు అంగూర్" అన్నాడతను.

రెండు నిమిషాల తరువాత ఆమె తేరుకుని "పద్మను వివాహం చేసుకోండి బాబూజీ!" అంది.

"లేదు. అంగూర్! నేను పద్మను వివాహం చేసుకునే సమస్యలేదు. పద్మకంటె అందమైన ఆడవాళ్ళను ఎందరినో నేను అనుభవించాను. కాని వారిలో యే ఒకరినీ వివాహం చేసుకోవాలనే కోర్కె నాకు కలుగలేదు. పద్మ

విషయంలోకూడ అంతే అంగూర్. ఈ పరిస్థితులలో ఎవరి నైనా వివాహం చేసుకోడానికి నేను తలపడితే అది కేవలం ఆత్మవంచన అనిపించుకుంటుంది. గ్రీక్ రోమన్ శిల్పాలను, అజంతా కుడ్యచిత్రాలను, తాజ్‌మహల్ సౌందర్యాన్నీ నా హృదయఫలకం నుండి ఏ విధంగా తుడిచివెయ్యలేనో నీ ప్రతిబింబాన్ని కూడా అదేవిధంగా తుడిచివెయ్యలేను అంగూర్"

అంగూర్ తడబడుతూ కేకపెట్టింది. "బా-బూ-జీ!" ఆమె రెండు చేతులతో కళ్ళు మూసుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. శివరామ్ ఆమె దగ్గరకు పోయి ఆమెను సముదాయిస్తూ అన్నాడు "అంగూర్, నువ్వు కంగారుపడకు అంగూర్, నీ శీలాన్ని నేను అపవిత్రం చేయను. నీ పవిత్రతను భగ్నం చెయ్యను అంగూర్. నిన్ను నా తోబుట్టువులాగా చూచుకుంటాను. నేను కేవలం రామ్‌కు ఒక్కడికిమాత్రమే దాదాను కాదు. ఈ క్షణంనుండి నీకూ దాదానే. ఏదీ నీ తల పైకి ఎత్తి ఒక్కసారి నావైపు చూడు. రామ్ మాదిరిగా నువ్వుకూడ "దాదా" అని నోటినిండా పిలువు" అన్నాడు.

అంగూర్ లేచి అతని పాదాలమీద వ్రాలి "బాబూజీ నన్ను క్షమించరూ!" అంది.

అతను ఆప్యాయంగా ఆమె తలనిమిరి "లే అంగూర్, నేను పోయి కారు తీసుకువస్తాను. నీవు కూడా బట్టలు మార్చుకో. రామ్ దగ్గరకు పోయి వద్దాం" అన్నాడు.

అతను వెనుకకు తిరిగాడు. ఎదురుగా నాయర్. నాయర్ కళ్ళమ్మట నీళ్ళు కారుతున్నాయి. బహుశా తమ సంభాషణ అంతా అతను విని వుంటాడనుకున్నాడు శివ రామ్.

"అరే, నాయర్; మీ అక్క అంగూర్ దేవతరా!" అన్నాడు. నాయర్ ఏమీ మాట్లాడలేదు. అంగూర్ వెంటనే అంది "తమ్ముడూ! నేను దేవతను మాత్రంకాదు, దయ్యాన్ని, బాబూజీపాలిట పెనుభూతాన్ని. ఆయనకు మన శ్శాంతి లేకుండా చేస్తున్నాను నాయర్."

శివరామ్ మాట అందుకునేలోపున ఫోన్ మోగింది. అతను పోయి రిసీవర్ తీసుకున్నాడు. అవతలి కంఠ పలుకు తూంది "శివరామ్ బాబేనా మాట్లాడేది?"

"అవును మీరెవరో తెలుసుకోవచ్చా?"

"నేను సూర్యకాంతమ్మను బాబూ! మీ అత్తయ్యను"

"యేమిటి అత్తయ్యా విశేషం!"

"నీకు తెలియని విశేషం ఏముంది బాబూ! ఈరోజు పద్మ పుట్టినరోజు పండుగ. మీ మామయ్య ప్రొద్దుటే బయలుదేరిపోయారు. మళ్ళీ సాయంకాలానికి గాని తిరిగి రారు. ఇంట్లో కాస్త అయినమగవాళ్ళు యెవ్వరూ లేని లోపం అగుపిస్తూంది. నీవు తీరికచేసుకుని కాస్త ఇక్కడికి రావాలి బాబూ! యేదో సాయంకాలం విందు ఏర్పాట్లు చూడాలిగదా! అందుకోసం నీవు తప్పక రావాలి బాబూ! వస్తావుగదూ!"

"నేను ఇంకా స్టూడియోకి పోలేదత్తయ్యా! దానిలో నుండి బయటపడేసరికి మధ్యాహ్నం రెండో, మూడో అవుతుంది. సాయంకాలం నలుగురితో పాటు వస్తానత్తయ్యా!"

"అయ్యొబాబూ! నీవు వస్తావనుకుంటున్నానయ్యా!"

"ఓ సారీ! నేను రాలేనందుకు యేమి అనుకోవద్దత్తయ్యా!"

"సరే నాయనా! ఏమిచేస్తాం"

అతను ఫోన్ క్రింద పెట్టేశాడు. అంగూర్ వైపు చూస్తూ అన్నాడు. "సూర్యకాంతమ్మ ఫోన్ చేసింది అంగూర్."

"తెలుస్తూనేవుంది బాబూజీ!"

"సరేగాని అంగూర్, ఘనేనాయక్ కుటుంబంతో సంబంధాలు పూర్తిగా తెంచుకున్నట్టున్నావు, ఎందుచేతా? పాపం వాళ్ళు మీవాళ్ళేగా!"

"అవును బాబూజీ! వాళ్ళ శివడు నన్ను అవమానం చేశాడు. అప్పటినుండి వాళ్ళ దగ్గరకు పోవటం మానేశాను"

"యేమి చేశాడేమిటి?"

ఆమె మాట్లాడలేదు. సందేహించింది.

"ఫరవాలేదులే, చెప్పు అంగూర్"

"ఒకనాటి రాత్రి నేను నిద్రలోవుండగా వచ్చినన్ను పట్టుకున్నాడు బాబూజీ!"

"ఓరివెధవా! వాడికీ పుట్టిందీ తెగులూ! అప్పుడు నువ్వు ఏమి చేశావు?"

"వాడిని రెండు తన్ని వాళ్ళ నాయన దగ్గరకు పరుగెత్తాను"

"యీ విషయం రామ్‌కు తెలుసా అంగూర్!"

"లేదు బాబూజీ!"

"యేం ఎందుకు చెప్పలేదు?"

"రామ్ జబ్బులో వున్నాడుగా బాబూజీ! ఆయన వ్యాకులపడతాడని చెప్పలేదు బాబూజీ!"

"అంగూర్ నీది బాగా లోతైన మనస్సే! అమాయకురాలివనుకుంటున్నానే!"

"యేమో బాబూజీ!"

"అంగూర్, నేను బయటికి పోతున్నాను. మళ్ళీ రాత్రికిగాని ఇంటికి రాను. నాకు వంట చెయ్యవద్దు. మీరు ఇద్దరు తినేసి పడుకోండి"

అతను బట్టలు మార్చుకోవటానికి మేడపైకి పోయాడు. అంగూర్ డ్రాయింగురూములో కూర్చుంది. పదినిముషాల తరవాత అతను తిరిగివచ్చి "అంగూర్, నీవు కూడా వస్తావా! రామ్ దగ్గర దిగబెట్టి పోతాను"

"రాను బాబూజీ! యీరోజు నేను ఎక్కడకు పోదలచుకోలేదు."

"సరే! నేను పోతాను అంటూ అతను ఆమె ముఖంలోకి చూచి మందస్మితం చేశాడు. ఆమె తల దించుకుంది.

కారులో పోతూ అతను అంగూర్‌ను గురించి ఆలోచించాడు "ఆమె బాధపడుతూన్నట్టు వుంది. నేను అంత

స్పష్టంగా మాట్లాడివుండవలసింది కాదేమో!" అనుకున్నాడు శివరామ్.

శివరామ్ వెళ్ళిన తరువాత అంగూర్ మేడమీదికి పోయి అతని పడకగదిలోకి ప్రవేశించింది. గది అంతా చిందరవందరగా వుంది. టేబుల్‌క్లాత్, పక్కదుప్పట్లు గలీబులు అన్నీ మాసివున్నాయి. ఆమె ఒక్కొక్కటే దులిపి శుభ్రంచేసింది. మంచానికి నల్లులుపట్టినట్లుఉన్నాయి. ఆమె నాయక్‌ను పిలిచి మంచము, పరుపులు అన్నీ డాబాపైన ఎండలో వేయించి నల్లులు దులిపివేసింది. గదిలోఉన్న ఫొటోలు, అలమారులు, బీరువాలు అన్నీ శుభ్రంగా తుడిచింది. మళ్ళా సాయంకాలానికి ఎక్కడివక్కడ అన్నీ యథాస్థానంలో సర్దింది. పక్క దుప్పట్లు, టేబిల్‌క్లాత్ క్రొత్తవితీసి పరిచింది. డోర్‌కర్టెన్లు, విండోకర్టెన్లు అన్నీ మార్చింది.

* * *

శివరామ్ సాయంకాలం అయిదుగంటలకు స్టుడియో నుండి సరాసరి బంజారాహిల్సులో నారాయణరాజుగారి బంగళాకు పోయాడు. అప్పటికే అతిథులు చాలామంది వచ్చారు. నారాయణరాజు స్వయంగా మేనల్లుడిని ఆహ్వానించాడు. "ఇదేమి అన్యాయంరా అబ్బాయి, నీవుకూడా అతిథులతోపాటే వచ్చావా! కొంచం ముందుగా రాకూడదూ!" అన్నాడు.

"ఏమో మామయ్యా, స్టుడియో పని తెముల్చుకునేసరికి యీవేళ అయ్యింది. సరాసరి ఇక్కడికే వచ్చాను మామయ్యా!" అన్నాడు శివరామ్.

పద్మా, కమలా అగుపించారు. పద్మ శివరామ్ అనుకున్నంత ఉత్సాహంగా అగుపించలేదు. తల వదులుగా దువ్వి రెండు జడలు వేసింది. మెడలో ముత్యాలహారమూ, ఖాదీసిల్కు బ్లవుజు, గ్రీన్ బోర్డర్ చేనేతచీర కట్టుకుని సామాన్యంగా వుంది. ఆమెవైపు చూస్తూ అతను అనుకున్నాడు "ఫరవాలేదు, పద్మ బాగానేవుంది. ఆమెది సహజ సౌందర్యం"

కమల చాలా హడావుడిగా వుంది. తలనిండా పువ్వులు, మెడనిండా ఆభరణాలు, కళ్ళకు అద్దాలు, వెల్వెట్ చోళీ, పసుపురంగు కంచి పట్టుచీరా, పదిమందిఆడవాళ్ళ మధ్య నిలబడి సరదాగా కబుర్లు చెబుతూంది.

పద్మ శివరామ్ దగ్గరకు వచ్చి "బావా! పంకజం రాలేదేం?" అని అడిగింది.

"ఏమో పద్మా! ఆమెను నేను రమ్మనమనే చెప్పాను. కాని యిక్కడికి వచ్చేందుకు ఆమె భయపడిందమ్మా" అన్నాడు.

"అవును బావా! ఆవిషయం నాకు తెలుసు"

"నీవు అంత తేలికగా వప్పుకుంటావని నేను అనుకోలేదు పద్మా!"

పద్మ యీసారి కొంచం బింకంగా మాట్లాడింది. "బావా! నేను తేలికగా వప్పుకున్నదేమిటో కాస్త చెప్పు"

"అదే పంకజం భయపడుతూన్నదన్న విషయం"

"అవును బావా! పంకజం కొంతకాలం యీ ఇంట్లో పని చేసిందిగా! ఇప్పుడు మాతో సరిసమాన హోదాలో కలిసి తిరగడానికి ఆమె భయపడితే భయపడవచ్చుగదా!"

"పద్మా! నాదగ్గర దాయడానికి ప్రయత్నించవద్దు. నాకు అంతా తెలుసు"

పద్మ తెల్లబోయిచూచింది. "క్షమించుబావా, ఆ విషయం యింతటితో వదిలేద్దాం"

"నా అభ్యంతరం ఏమీలేదు పద్మా!"

ఆమె సంభాషణ మార్చింది "మళ్ళీ యేమైనా చిత్రాలు వేశారా బావా"

"లేదు పద్మా! నిన్ను చూస్తుంటే యీ పోజులో నీచిత్రం గీస్తే బాగుంటుందేమో అనుకుంటున్నా"

"అదేమిటి బావా! దొరకక దొరకక నేనే దొరికానా నీకు. నువ్వుకూడా నవ్వులాట పట్టిస్తున్నావు"

"లేదు పద్మా, నేను సీరియస్‌గానే అంటున్నా"

"థేంక్సు బావా!"

"పద్మా నీకు ఒక ప్రజంటు తీసుకువచ్చాను"

"అమ్మదొంగా! ఇందాకటినుండి చెప్పవేం!"

"కాని నీకు నచ్చుతుందో, నచ్చదో"

"అదేమిటో బయటపెడితే తెలుస్తుందిగా!"

అతను బ్యాగ్‌లోనుండి ఒక ఆల్బం తీసి అది చూపుతూ అన్నాడు "పద్మా, యిది ప్యారిస్‌లో సంపా

దించాను. కళాభిరుచి ఉన్నవారికి యిది నచ్చుతుందనే అభి ప్రాయంతో యీ ఆల్బం నీకు ప్రజంటు చేస్తున్నాను"

పద్మ ఆల్బం అందుకుని తిరగవేసింది. "బావా! బ్రహ్మాండంగా వుంది. చాలా థేంక్సు బావా!"

నారాయణరాజు వచ్చి వారి ప్రక్కన నిలబడి "యేమిటమ్మా పద్మా! బావదగ్గర యేదో కొట్టేసి నట్టు న్నావు" అన్నాడు.

"ఆఁ, బొమ్మల ఆల్బం మామయ్యా" అన్నాడు శివరామ్.

"సరే, మీరు మాట్లాడుకోండి. నేను అట్లా గేటు లోకి పోయివస్తాను" అని చెప్పి నారాయణరాజు పుస్తకం తీసుకుని అతిధుల మధ్యకు పోయాడు.

సూర్యకాంతమ్మ దూరంగా కూచుని పద్మ, శివ రామ్ జంటగా నిలబడి మాట్లాడుకోవటం గమనిస్తూనే వుంది. శివరామ్ సరాసరి తన ముందుకువచ్చి తనను మర్యాద చెయ్యలేదనే కోపం వున్నా అతను చాలసేపు పద్మతో సంభాషణలో లీనమవడం సూర్యకాంతమ్మకు కొంత సంతృప్తినే కలిగించింది.

అతిధులు చాలవరకు వచ్చేశారు. మల్లీశ్వరి చిత్రం లోని భానుమతి రికార్డులు శ్రావ్యంగా మైక్‌లో వినిపిస్తు న్నాయి. రంగురంగుల దీపాలతో, తోరణాలతో బంగాళా దేదీప్యమానంగా వెలుగుతూంది. క్రొత్త మోడలు అంబా సిడర్ కారులో రామరాజు, నరసరాజు దిగారు. నారా యణరాజు వారికి యెదురుపోయి "మేనకోడలు పుట్టినరోజు

పండుగ చేసుకుంటూంటే మేనమామలు యిప్పుడండీ రావటం?" అన్నాడు.

రామరాజు నవ్వుతూ అన్నాడు "అవును బావగారూ! పెందలకడే రావాలని బయలుదేరానండీ. కాని తీరా సెక్రిటేరియట్‌కి పోయేసరికి అక్కడపని త్వరగా తెమిలింది కాదు. ఇంతలో మన నరసరాజు వచ్చాడు అక్కడికి. ఇద్దరం కలిసి వచ్చేశామండీ!"

బావమరదులు ముగ్గురు ఒకప్రక్కగా కూర్చొని సంభాషణలోకి దిగారు. నారాయణరాజు ప్రశ్నించాడు. "ఏమండీ బావగారూ! సెక్రిటేరియట్ భవనాలు బేగంపేటలో కట్టడం ఖాయమేనా అండీ!"

"నిస్సందేహంగా బావగారూ!" రామరాజుగారు అన్నారు.

"అయితే బావగారూ! బేగంపేట సమీపంలో లోగడ నాకోసం ఖరీదుచేసిన పదకొండు యకరాలు నాపేర క్రయం చేయించండి. ఇంకా ఆలస్యం యెందుకు!" నారాయణరాజు ఆతురతగా అడిగాడు.

"అలాగే, బావగారూ! మన నరసరాజుకూడా అందుకే వచ్చాడు. రాత్రికి మనం ముగ్గురం ఒకచోట కూర్చొని మాట్లాడుకుందాం" రామరాజుగారు చెప్పారు.

"ఈ నరసరాజు యేదో పెడకొలువు తెచ్చిపెట్టేటట్టున్నాడు" అనుకున్నాడు నారాయణరాజు. కాని పైకి "అయితే బావగారూ! ఆ రోజున నాకోసం ఖరీదుచేసిన పదకొండు యకరాల భూమికి యకరం అయిదువందల

చొప్పున పదకొండు అయిదులు యాభైఅయిదు వందలు తమకు యిచ్చుకున్నాను కదండీ" అన్నాడు.

"అవును బావగారూ! ఆరోజున మీరు ఇచ్చారను రనుకోండి. కాని అది అప్పుడు క్రయం కాలేదుకదండీ, సెక్రటేరియట్ భవనాలు అక్కడ కడతారని తేలిపోవ డంతో అక్కడి భూముల విలువలు విపరీతంగా పెరిగి పోయింది. యకరం ఇరవైవేలు యిస్తామన్నా యెవ్వడూ చోటు పెట్టడంలేదు. ఇక యిప్పుడు ఆ వున్నదానిలోనే మనం ముగ్గురం సర్దుకోవాలి బావగారూ!"అన్నారు రామ రాజుగారు.

నారాయణరాజు లోపల అనుకున్నాడు "దొంగలు దొంగలు చేరి వూళ్ళు పంచుకున్నట్టు" కాని పైకి "తమకు యెలా మంచిదనితోస్తే అలా చెయ్యండి బావగారూ"అని చెప్పాడు.

వారు కూర్చున్నచోటుకు పెదబాబు వచ్చి "చిన్న మామయ్యా! మిమ్మల్ని అమ్మ రమ్మంటున్నారు" అన్నాడు నరసరాజువైపు చూస్తూ. నరసరాజు అక్కడ నుండి లేచి వెళ్ళాడు.

"సరే బావగారూ! మనంకూడా వాళ్ళమధ్యకే పోదాము రండీ" అంటూ నారాయణరాజు లేచాడు. రామరాజుగారు ఆయనను అనుసరించాడు.

సరిగ్గా ఎనిమిది గంటలకు విందు ప్రారంభమైంది. పద్మకు ఆశీస్సులు తెలుపుతూ మేనమామలు, ఇద్దరు పెద్దలు మాట్లాడారు. పద్మకు నలువైపులనుండి బహుమతులు అంద

జేశారు. నారాయణరాజుగారు యింతసేపటినుంచీ తన చేతిలోవున్న ఆల్బం సంగతి మరచిపోయాడు. ఆ దీపాల కాంతిలో ఆయన అది తెరచి చూచాడు. మొదటిపేజీలలో ప్రఖ్యాతిచెందినవారి చారిత్రక చిత్రాలు, సుందరాంగుల ఫొటోలు ఆఖరున నగ్నచిత్రాలు వున్నాయి. అవి చూస్తూ ఆయన రామరామ అనుకుని కళ్ళు మూసుకున్నాడు.

ప్రక్కనేవున్న రామరాజుగారు "యేమిటి బావ గారూ అదీ!" అన్నాడు.

"యేమిచెప్పమంటారు బావగారూ! యీ ఆల్బం శివరామ్ పద్మకు ప్రజంటుచేశాడు. దీనినిండా దిశమొల బొమ్మలే, యేమిసంస్కారమో! యేమిమనుషులో" అన్నాడు నారాయణరాజు.

రామరాజు చిన్నగా నవ్వి "రానురాను జాతి నిర్వీర్యం అయిపోతూంది బావగారూ! సరేగాని, శివరామ్ పద్మను వివాహం చేసుకుంటాడా?"

"యేమో బావగారూ! శివరామ్ అభిప్రాయ మేమిటో నాకు యింకా తెలియదు. కాని పద్మమాత్రం అతనిని చేసుకోననని ఖచ్చితంగా చెప్పింది"

"యేం, దానికేం తెగులు. అతనికి బోలెడంత ఆస్తి వుందిగా"

"ఉందనుకోండి, అయినా ఆ యాస్తి విలువ మీకూ, నాకూగాని ప్రేమపిచ్చిలో పడినవాళ్ళకు ఆస్తి విలువలు తెలుస్తాయా బావగారూ!"

"యేం, పద్మ ప్రేమగాథలో పడిందా యేమిటీ?"

"ఆ పడతే, అతను యెవరో మెడికల్ కాలేజీ విద్యార్థట. అతనిని చేసుకుంటానని చెపుతూంది"

"అయితే, చేసుకోనీయండి మరీ మంచిది"

"యేమిచేసుకోవటం బావగారూ, అతను రెడ్డి కులంవాడట"

"చచ్చాం, ఇదొకటా! బావగారూ, యీ విషయం అట్టే మాగవేయవద్దు. ముందుగానే జాగ్రత్త పడటం మంచిది"

"సరే, ఆలోచిద్దాం బావగారూ!"

విందు పూర్తయ్యేసరికి రాత్రి పదిగంటలు దాటింది. కార్లు ఒక్కొక్కటే కదలిపోయాయి. శివరామ్ పద్మకు, నారాయణరాజులకు చెప్పి తన కారు దగ్గరకు పోతుంటే మధ్యలో అతనిని రామరాజు ఆపుజేశాడు.

"యేమయ్యా శివరామ్! యీమధ్య విదేశాలు తిరిగి వచ్చావు కాబోలు, నీకబుర్లు విందామనుకుంటే యెక్కడా అగుపించడమే లేదు" అన్నాడు రామరాజు.

"స్టుడియో పనులవల్ల నేను యెక్కడికీ పోవడమే లేదండీ!"

"రేపు ఒకసారి మా ఇంటికి వస్తావా!"

"ప్రయత్నిస్తానండీ!"

"సరేగాని, యువకుడివి, పైకి రావలసినవాడివి యింకా ఎంతకాలం యిలా ఒంటరిగా జీవితం గడుపుతావయ్యా!"

శివరామ్ చిన్నగా నవ్వాడు "యేమో! ఆ విష

యంలో నాకు ఖచ్చితమైన అభిప్రాయం అంటూ యిప్పటి వరకు కలుగలేదండీ!"

"అయితే వివాహం చేసుకోవా?"

"చేసుకోకూడదనే నియమం యేదీ లేదండీ!"

"దేనికయ్యా ఆలోచన! శుభ్రంగా మీ మేన మామ కుమార్తెల్లో ఒకరిని చేసుకుని నీవూ, మీ మామా కలిసి జాయింటుగా కంట్రాక్టులు చేసుకోండి. ఆ పాడు బొమ్మలు గీస్తూ కాలమంతా వృథాగా యెందుకు పాడు జేసుకుంటావు?"

"తమ సలహా మంచిది కాదని నేను అననుకాని, అది చాలా లోతుగా ఆలోచించవలసిన సమస్య అండీ!"

"అవును మరి. ఆలోచించకుండా యేపనీ చెయ్యకూడదు బాబూ!"

శివరామ్ యింటికి చేరేసరికి పదకొండుగంటలైంది. గేటు మూసివుంది. అతను హారన్ మోగించాడు. అంగూర్ వచ్చి గేటు తెరచింది. అతను కారు గ్యారేజిలో పెట్టి వరండాలోకి వచ్చి నిలబడ్డాడు. అంగూర్ గుమ్మంలో నిలబడి అడిగింది "టీ, తీసుకుంటారా బాబూజీ!"

"నాకు యిప్పుడు యేమీవద్దు అంగూర్. నాయర్ యేమయ్యాడు?"

"సినిమాకు వెళ్లాడు బాబూజీ!"

"అయితే మీ భోజనాలు అయ్యాయా?"

"ఆఁ, సాయంకాలమే తినేశాం బాబూజీ!"

"నాయర్ వచ్చేంతవరకు కూర్చుందామా?"

"మీరు పైకిపోయి పడుకోండి బాబూజీ. నాయర్ వస్తే నేను గేటు తెరుస్తాను."

"ఇప్పుడప్పుడే నాకుమాత్రం నిద్రపడుతుందా! కాసేపు కబుర్లుచెప్పుకుందాం" అంటూ అతను డ్రాయింగు రూములోకిపోయి స్విచ్ వేశాడు. ట్యూబులైట్లు కాంతిలో ఆ హాలుఅంతా ధగధగ మెరిసింది. శివరామ్ బ్యాగ్‌లో నుండి ఒక చిన్న పెట్టె తీసి అంగూర్‌కు చూపుతూ "అంగూర్ దీనిలో యేముందో చెప్పుకో!" అన్నాడు.

ఆమె నవ్వుతూ అంది "నాకెలా తెలుస్తుంది బాబూజీ!"

అతను పెట్టె తెరచి మూడువరుసల ముత్యాలహారం పైకి తీశాడు, ఆమెకళ్ళు ఆనందంతో మెరిశాయి. "ఎవరి కోసం తెచ్చారు బాబూజీ!"

"అదికూడా నేనే చెప్పాలా అంగూర్!"

ఆమె ప్రసంగం మార్చింది. "పద్మ పుట్టినరోజు పండుగకు ఆమెకు మీరు యేమి బహుమతి యిచ్చారు బాబూజీ!"

"ప్యారిస్‌నుండి తెచ్చిన బొమ్మల ఆల్బం యిచ్చాను అంగూర్."

ఆమె చిన్నగా నవ్వింది.

"నవ్వుతున్నావు దేనికి అంగూర్"

"వట్టినే బాబూజీ!"

"నువ్వు వట్టినే నవ్వావని చెబితే నేను నమ్మను అంగూర్"

"మీ బొమ్మల ఆల్బం నేను చూచాను బాబూజీ!"

"యెలా వుందంటావు?"

ఆమె మళ్ళీ నవ్వింది.

యేం, ఆ ఆల్బం బాగుండలేదా అంగూర్!"

"దానినిండా దిశమొలబొమ్మలేగా బాబూజీ! అవి కూడా అన్నీ ఆడవాళ్ళవి"

అతను నవ్వుతూ అడిగాడు "యేం, ఆ బొమ్మలు బాగుండలేదా?"

"మగవారిదృష్టిలో బాగుంటాయేమో!"

"ఆడవాళ్ళదృష్టిలో అవి బాగుండవనేనా నీ అభిప్రాయం."

యేమో! అలాంటిబొమ్మలు, శిల్పాలు చూస్తుంటే నాకు సిగ్గు వేస్తుంది బాబూజీ!"

"సహజమైన సౌందర్యంచూచి ఆనందించాలిగాని సిగ్గుదేనికి అంగూర్"

ఆమె సమాధానం చెప్పలేదు. మందస్మితం చేసింది.

"ఈ హారం మెడలో వేసుకోచూదాం" అంటూ అతను ముత్యాలహారం ఆమెకు అందించాడు. ఆమె జంకుతూ చెయ్యి చాపింది. అతను లేచి నిలబడి హారం ఆమె మెడలో తగిలించాడు. అతని చేతులు ఆమె మెడను తాకినప్పుడు ఆమె శరీరం గగుర్పొడిచింది. అతను ఆమె

గడ్డం పట్టుకుని తల వెనకకు వంచి సూటిగా ఆమె కళ్ళల్లోకి చూచాడు. ఆమె కళ్ళు మూసుకుని సిగ్గుతో తల దించుకుంది.

నాయర్ గేటుదగ్గర నిలబడి చప్పుడుచేశాడు. అంగూర్ లేచి వెలుపలకిపోయి గేటు తెరచింది. శివరామ్ పైకివెళ్ళి తనగదిలో లైటువేశాడు. గదిఅంతా చాలా పరిశుభ్రంగా వుంది. సెంటువాసనతో గది ఘుమఘుమలాడుతూంది" బహుశా యిది అంతా అంగూర్ పనిఅయి వుండాలి" అనుకున్నాడు అతను.

మరుసటి ఉదయం గడియారం ఆరుగంటలు కొడుతూండగా అతనికి మెలుకువ వచ్చింది. గది నాలుగు వైపులకు అతను దృష్టిని పోనిచ్చాడు. గోడలు, వస్తువులు అన్నీ పరిశుభ్రంగా అగుపిస్తున్నాయి. నాయర్ బెడ్ కాఫీ తెచ్చి అందించాడు.

శివరామ్ కాఫీగ్లాసు అందుకుంటూ ప్రశ్నించాడు. "నాయర్, ఈ గదిఅంతా శుభ్రంచేసింది యెవరు?"

"అక్క నిన్నటిరోజంతా ఈ గది తుడిచిందిసార్!"

"ఆ పనినువ్వు యెందుకు చెయ్యలేదు నాయర్?"

"మీరు చెప్పలేదుగదా సార్"

"మీ అక్కకు నేను చెప్పాననుటావా ?"

నాయర్ సమాధానం చెప్పలేదు. అతను తలదించుకున్నాడు. శివరామ్ ఖాళీగ్లాసు అతనికి అందించాడు. ఆ గ్లాసు అందుకుంటూ అతను అన్నాడు "రేపటినుండి అన్నీ నేనే శుభ్రంచేస్తాను సార్!"

భోజనాల సమయంలో అంగూర్ శివరామ్‌ను అడిగింది. "బాబూజీ! సాయంకాలం రామ్ దగ్గరకు పోదామా!"

"తప్పకుండా పోదాము అంగూర్"

"బాబూజీ ! మీ విషయం రామ్‌కు పూర్తిగా తెలియదు"

"యే విషయం ?"

ఆమె నీరసంగా నవ్వింది. సమాధానం చెప్పలేదు. అతను సందేహిస్తూ ఆమెవైపు చూచాడు "అదేమిటో చెప్పు అంగూర్"

"మీరు అనేకమంది ఆడవాళ్ళను అనుభవించారన్న విషయం"

అతను సంతృప్తిగా నవ్వాడు "ఓహో ! అదా ! అంగూర్, నీకంటే ముందు రామ్‌కు నేను ఆ విషయం చెప్పాను."

"యేమన్నారు ఆయనగారు"

"నన్ను అభినందించాడు. నేను అదృష్టవంతుడినని అన్నాడు"

"ఘోరం బాబూజీ !"

"ఎందుకని ?"

"అది పశుత్వం అనిపించుకుంటుందేమో బాబూజీ !"

అతను మళ్ళీ నవ్వాడు "అదేమీ లేదు అంగూర్, ప్రేమించినవాళ్ళనే అనుభవించాలనుకోవడం అందరికీ

సాధ్యం కాదు. అందుచేత అందుబాటులో వున్నవాళ్ళను కొన్ని సమయాలలో అనుభవించడం కొందరికి తప్పనిసరి అవుతుంది. ఒకడికి పరమాన్నమే తినాలని వుంటుంది. కాని అది లభించనప్పుడు ఎంతకాలమని వాడు దానికోరకు యెదురు చూస్తూ కూర్చుంటాడు. ఆకలవుతూంటే అందు బాటులో వున్న పదార్థాలు తినివేస్తాడు. అది పెద్ద నేర మేమీ కాదు అంగూర్"

"అయితే సమాజంలో కట్టుబాట్లు, నియమాలు అవ సరం లేదంటారా బాబూజీ!"

"సమాజంలో కట్టుబాట్లు, నియమాలు అవసరం లేవని నేను అనను. కాని ఆకలితో వటించేవాడు ఆ నియ మాలను వుల్లంఘిస్తూంటాడనే విషయం మనం గమనించాలి అంగూర్"

ఫోన్ మోగుతూంటే శివరామ్ లేచి వెళ్ళి రిసీవరు తీసుకున్నాడు.

# 11

కొద్దిదినాలు గడిచాయి. శివరామ్ ప్రవర్తనలో చాలా మార్పు వచ్చింది. అతను ఇంటిపట్టున వుండటం లేదు. యెప్పుడో ఒకసారి వచ్చిపోతున్నాడు. అతనిలో ఉత్సాహం అడుగంటింది. అతను క్రమంగా కృశించిపో సాగాడు.

శివరామ్‌ను చూస్తూ అంగూర్ వ్యాకులపడసాగింది. మనోవ్యాధితో అతను నీరసించిపోతున్నాడనీ, అందుకు తనే కారణమనీ ఆమె ఊహించింది. ఒకనాటి సాయం కాలం ఆమె స్టుడియోకి వెళ్ళింది. శివరామ్ ఒంటరిగా తన గదిలో కూర్చుని యేదో పుస్తకం చదువుతున్నాడు. ఆమె తలుపు తోసుకుని లోపల ప్రవేశించింది. అతను ఆశ్చర్యంగా ఆమెవైపు చూచాడు.

ఆమె తల వదులుగా దువ్వి రెండుజడలు అల్లింది. నొసట సింధూరం, కళ్ళకు కాటుక, యెర్రని పెదాలు, మెడలో ముత్యాలహారం, వెల్వెట్‌బ్లౌసు, జరీబోర్డరు గులాబీరంగు నైలాన్‌చీరా, ఆమె మోహినీదేవతలా వెలిగి పోతూంది.

అతను చిరునవ్వులు చిందిస్తూ అన్నాడు "ఓ అంగూర్, మిఠీ, మిఠీ అంగూర్, యెందుకు యిక్కడ ప్రత్యక్షమయ్యావు ?"

"మీకోసమే బాబూజీ !"

"అయితే నాకు ఎదురుగా ఆ కుర్చీలో కూర్చుని కాసేపు కబుర్లు చెప్పు. నా జన్మ తరిస్తుంది."

"బాబూజీ !"

"యేమిటి అంగూర్ !"

ఆమె తల కిందికి దించుకుంది. కళ్ళవెంట జలజల నీళ్ళు రాలాయి.

"అంగూర్ నువ్వు యీ విధంగా విచారపడితే నిన్నుచూచి నేను భరించలేను అంగూర్, నా మనస్సు

బేజారై పోతుంది.” అంటూ అతను లేచి కర్చీఫ్‌తో ఆమె కళ్ళు వత్తాడు. రెండు నిముషాల తరువాత ఆమె తేరుకుని అంది “బాబూజీ! మీరు రోజురోజుకీ నీరసించిపోతున్నారు. నేనేమి నేరంచేశాను. మీరు ఇంటికికూడా రావటం మానేస్తున్నారు మీరు మామూలుగా అక్కడకు వస్తూ పోతూ వుండకపోతే నేను ఆ ఇంట్లో వుండలేను బాబూజీ! దేనిలోనైనా పడి ఛస్తాను.”

అతను ఆప్యాయంగా ఆమెతల నిమురుతూ అన్నాడు “అంగూర్ అంతమాట యెందుకు అంటావు అంగూర్! నీవుగనక చనిపోతే నాకిక ప్రపంచమే లేదు. నిన్నుచూస్తూ నేను ఎంతికాలమైనా జీవించి వుండగలను అంగూర్. నాలో ఇటీవల మానసిక వేదన ప్రారంభమైనమాట వాస్తవమే. అది అట్టేకాలం వుండదు అంగూర్. అయినా యీవిషయం రామ్‌కు తెలిస్తే వాడు యెంతబాధపడతాడో ఆలోచించావా?”

“రామ్‌ను గురించి నాకు భయంలేదు బాబూజీ! అతను ఆరోగ్యం కోలుకుంటున్నాడు. కాని మీరు రోజు రోజుకు దిగజారిపోతున్నారు. మీరు యేమైపోతారోనని నేను ఆందోళన పడుతున్నాను బాబూజీ, ఒకసారి డాక్టరుతో పరీక్ష చేయించుకోరూ!”

అతను నీరసంగా నవ్వాడు. “మనోవ్యాధికి మందు లేదు అంటారు అంగూర్.”

ఆమె తల క్రిందికి దించుకుని వలవల విలపించింది. అతను బుజ్జగించాడు. తన కర్చీఫ్‌తో ఆమె కన్నులు

వత్తాడు. ఆమె కన్నులలోకి చూస్తూ అతను నవ్వుతూ అన్నాడు. "అంగూర్! నన్నుగురించి నీవు ఆందోళన పడవద్దు అంగూర్. నీవు కోరిన విధంగా నేను మామూలుగా ఇంటికి వస్తుంటాను. అబ్బే, నీ బుగ్గలనిండా కాటుక చారలు పడ్డాయి. అద్దంలోచూచుకుని మళ్ళీ పవుడరు వేసుకో" అన్నాడు అతను ఆమెను కుర్చీలోనుండి పైకి లేవదీసి.

ఆమె సమాధానం చెప్పలేదు. అతను కుర్చీలో కూర్చుని సిగరెట్టు ముట్టించాడు. ఆమె బాత్‌రూమ్‌లోకి పోయి తిరిగి వచ్చింది, అద్దంముందు నిలబడి పౌడరు అద్దుకుంది. రెండు నిముషాల తరువాత ఆమె తనకుర్చీలో కూర్చుంటూ అతనివైపు చూచి అడిగింది. "బాబూజీ! మీకు యిక్కడ పని యేమైనా వుందా?"

"లేదు అంగూర్, దేనికి?"

"పబ్లిక్ గార్డెన్సుకు పోదాము బాబూజీ!"

అతను గడియారం చూచుకున్నాడు. ఆరుగంటలు కావచ్చింది. "అయితే నాలుగు నిముషాలలో బట్టలు మార్చుకువస్తాను వుండు" అని చెప్పి అతను లేచి మరో గదిలోకి ప్రవేశించాడు.

శివరామ్ అద్దంముందు నిలబడి యెలక్ట్రిక్ షేవర్‌తో గడ్డం చేసుకున్నాడు. బేసిన్‌లో ముఖము, చేతులు శుభ్రం చేసుకుని బట్టలు మార్చుకున్నాడు. నేవీబ్లూ టెర్లిన్ ప్యాంటూ, వైట్ స్లాక్ షర్టు వేసుకున్నాడు. అంగూర్

వున్న గదిలో ప్రవేశించి "పోదామా అంగూర్?" అన్నాడు. ఆమె సమాధానం చెప్పకుండా లేచి నిలబడింది.

శివరామ్ కారు పబ్లిక్ గార్డెన్సుకు పోయేసరికి బాగా చీకటిపడింది. కారు హెల్తుమ్యూజియం ముందు ఆపి కొంచం సేపు అక్కడి ఫౌంటెన్ దగ్గరకుపోయి కూర్చున్నారు. మధ్యతరగతి యువతీయువకులు జంటలుగా ఒకరినొకరు అంటిపెట్టుకుని తిరుగుతూ కబుర్లు చెప్పుకోవడం చూచి నప్పుడు తనుకూడా ఆ విధంగా అంటిపెట్టుకు తిరగాలనే కోర్కె అంగూర్‌కు కలిగింది. శివరామ్‌కు ప్రక్కను నడుస్తూ ఆమె అతనిచేతిని ఒకటిరెండుసార్లు పట్టుకుంది. కాని శివరామ్ ఆమెను దగ్గరకు తీసుకోలేదు. అయినా ఆమె అతనిని అంటిపెట్టుకుని తిరిగింది.

లేక్ దగ్గర శివరామ్‌ను ఆపి ఆమె అంది "బాబూజీ యీరోజు వైశాఖపూర్ణిమ. వెన్నెల హాయిగా వుంది పడవమీద కూర్చుని కొంచెంసేపు ఈ కొలనులో తిరుగుదామా?"

శివరామ్ యేమంత వుత్సాహం చూపలేదు. కాని ఆమెను దగ్గరకుతీసుకుని "అలాగే తిరుగుదాము అంగూర్!" అన్నాడు. ఇద్దరు పడవలో ఎక్కి కూర్చున్నారు. మోటారు దడదడ చప్పుడుచేస్తూ పడవ ముందుకు సాగిపోయింది. అతని నడుంచుట్టూ చెయ్యివేసి ఆమె అడిగింది.

"బాబూజీ! మీరు వివాహం చేసుకోరూ?"

"యెవరిని చేసుకోమంటావు అంగూర్!"

"మీకు నచ్చినవారిని బాబూజీ!"

"నాకు నచ్చినవాళ్ళు నన్ను చేసుకోరని చెప్పాను గదా !"

"యీ విశాల ప్రపంచంలో ఆ ఒక రిద్దరేనా మీకు నచ్చింది, యింకా యెందరో వుండివుంటారు బాబూజీ!"

"అలాంటివాళ్ళు తటస్థపడినప్పుడు ఆలోచిస్తాను అంగూర్"

"బాబూజీ ! మీరు నాకోసం బాధపడుతూంటే నేను భరించలేను బాబూజీ!"

"పోనీ నేను చచ్చిపోతాను అంగూర్"

"బాబూజీ! బాబూజీ ! మీరు అలా అంటే నేను యిప్పుడే యీ కోనేట్లోదూకి చస్తాను."

"రామ్‌కోసం నీవు జీవించాలి అంగూర్"

"బా-బూ-జీ!" ఆమెగుండె పగిలేట్లు వెక్కి వెక్కి యేడ్చింది. డ్రైవరు విస్తుపోయిచూచాడు. శివరామ్ అంగూర్‌ను దగ్గరకు తీసుకుని బుజ్జగించాడు. ఆమె శిరస్సును తన హృదయానికి హత్తుకున్నాడు.

ఆ రాత్రి భోజనాలసమయంలో శివరామ్ అడిగాడు "మరో రెండురోజులలో రామ్ వచ్చేస్తాడుగదా, ఆ తరువాత మీరు క్రొత్తఇంటికి పోతారా అంగూర్!"

ఆమె వెంటనే సమాధానం చెప్పింది. "లేదు బాబూజీ! రామ్‌వచ్చినా నేను ఇక్కడే వుండిపోదలచుకున్నాను. రామ్‌కు యిష్టమైతే ఆయనగారుకూడా ఇక్కడే

వుండిపోతాడు. లేకపోతే వాళ్ళ తల్లిని వాళ్ళను తెచ్చుకుని కొత్తఇంట్లోకి పోతాడు.”

అతను చిన్నగా నవ్వాడు. “అలా ఎంతకాలం ఉంటావు అంగూర్?”

యెంతకాలమైనా వుండగలను బాబూజీ! మీరు వివాహం చేసుకుని మీ ఆవిడ ఇంట్లో గృహిణిగా ప్రవేశించేవరకూ నేను యిక్కడే వుండిపోతాను.”

“అయితే అంగూర్! నీకు నేనుఎక్కువా? లేక రామ్ ఎక్కువా?”

“అలా పోటీ పెట్టవద్దు బాబూజీ! రామ్ నా భర్త. నా జీవితం ఆయనతోటిదే, కాని యీ స్థితిలో మిమ్మల్ని ఒంటరిగా వదలి నేను యెక్కడికీ పోలేను, పోను బాబూజీ!”

“నామీద నీకు యింతటి అభిమానం వున్నదని నేను యెన్నడూ వూహించలేదు అంగూర్! నేను ధన్యుణ్ణి”

“బాబూజీ! అలాంటిమాటలు అనవద్దు బాబూజీ. సమాజంలో ఎక్కడో అట్టడుగున పడివున్న మమ్మల్ని మీరు పైకి తీసుకువచ్చారు. రామ్‌ను మృత్యుముఖంనుండి కాపాడారు. ఈ జన్మలోనేకాదు, యెన్నిజన్మలు ఎత్తినా మీ ఋణం మేము తీర్చుకోలేము బాబూజీ!”

ఆ రాత్రి శివరామ్‌నుగురించి అంగూర్ లోతుగా ఆలోచించింది. అతను తనను సోదరిలాగాచూచుకుంటానని అన్నాడు. తనతో దాదా అని పిలిపించుకోవాలని వుబలాటపడ్డాడు. అతనివల్ల తన శీలానికి హాని జరుగదని రూఢి చేసు

కుంది. కాని ఆయన వివాహం చేసుకుంటే తనకు ఆత్మసంతృప్తి. శివరామ్ ఆరోగ్యం బాగుపడుతుంది. అతను దారిలోకి వస్తాడు, అనుకుంది అంగూర్. ఆమె నిశ్చింతగా నిద్రపోయింది.

శివరామ్ మంచంమీద అటూఇటూ దొర్లాడు. అతనికి నిద్ర రాలేదు. అతని యోచనలు పరిపరి విధాల పోయాయి. తను అనుకోనంతగా అంగూర్ తనకు దగ్గరగా వచ్చింది. ఆమెది ఆధ్యాత్మిక ప్రేమ (ప్లేటానిక్ లవ్) ఆమె శీలాన్ని తను మలినం చెయ్యకూడదు. కాని ఆమె సమక్షంలోవుంటూ ఆమెను అనుభవించకుండా తను నిగ్రహించుకోగలడా ! యేమో ! సందేహమే" అనుకున్నాడతను.

ఆ ఆలోచనలమధ్య అతను అప్రయత్నంగా మేడ దిగి క్రిందికి వచ్చాడు. అంగూర్ గదిముందు నిలబడి తలుపు తట్టాడు. తలుపు లోపలఘుడియ బిగించివుంది. అతను పదినిముషాలు అక్కడే నిలబడ్డాడు. గది తలుపులకు చెవి ఆన్చి ఆలకించాడు. ఆమె శ్వాస స్పష్టంగా వినవస్తూంది. ఆమె గాఢనిద్రలోవుంది. "అంగూర్ ధన్యజీవి" అనుకున్నాడతను. మరుక్షణంలో వెనుకకు తిరిగి మేడమీదికి పోయాడు.

* * *

మరుసటి ఉదయం అంగూర్ ఆలస్యంగా లేచింది. ఆమె గదితలుపులు తెరచి హాలులోప్రవేశించి గడియారం

వైపు చూచింది. యేడున్నర అయ్యింది. బాత్ రూముకు పోతూ నాయర్‌ను పిలిచి అడిగింది.

"నాయర్! బాబూజీ లేచారా?"

"కాఫీతీసుకు వెళ్ళిపోయారు అక్కా!"

"టిఫిన్ యేమిచేశావు తమ్ముడూ?"

"ఇడ్లీ వేశాను అక్కా"

"బాబూజీ తీసుకున్నారా?"

"తీసుకున్నారక్కా. అయ్యగారికి ఒక ఆమ్లెట్టుకూడా వేసి యిచ్చాను అక్కా."

అంగూర్ సంతృప్తిచెందింది. ఆమె త్వరత్వరగా స్నానం వగైరా ముగించుకుని రామ్‌ను కలుసుకోడానికి నర్సింగ్‌హోముకు వెళ్ళింది. ఆమెను చూస్తూనే రామ్ అడిగాడు "అంగూర్ దాదా అసలు అగుపించడంలేదేం!"

ఆమె తాపీగా కుర్చీలోకూర్చుని చెప్పసాగింది. "రామ్, నీవు త్వరలో యిక్కడనుండి బయటకురావటం అవసరం. బాబూజీపని యేమీ బాగుండలేదు. యీమధ్య ఇంటికికూడా సరిగా రావడంలేదు. బాగా తాగుడుకు అలవాటు పడినట్టున్నాడు. నిన్న సాయంకాలం నేను స్టుడియోకిపోయి చూచాను మనిషి చాలా నీరసించిపోయాడు. గడ్డంకూడా చేసుకోలేదు. మాసినబట్టలతో బికారిలా అగుపించాడు. యెంతో ప్రయత్నంమీద నిన్న సాయంకాలం ఆయనగారిని పబ్లిక్ గార్డెన్సుకు తీసుకుపోయి రాత్రి ఇంటికి తీసుకువచ్చాను. కాని తెల్లవారి నాకంటె ముందుగానే

లేచి మళ్ళీ బయటికి వెళ్ళిపోయారు. మనం ఇద్దరముకలసి ఆయనగారిని దారికి తీసుకురావటానికి ప్రయత్నిద్దాంరామ్"

రామ్ ఆమెవైపు నిర్ఘాంతపోయి చూచాడు "దాదాను మనం దారిలో పెట్టడమా! ఆయన అంతస్థు ఎక్కడా! మన తాహతుయెంతా అంగూర్!"

"అవునురామ్! అదినిజమే, కాని బాబూజీ ఇటీవల మానసికఆవేదనలోపడి శారీరకంగా, మానసికంగా దిగ జారిపోతున్నాడు."

"దాదా, మానసికఆవేదనకు కారణం యేమిటం టావు అంగూర్?"

నాకు తెలిసినంతవరకు ఒకటిమాత్రం చెప్పగలను రామ్."

"యేమిటదీ ?"

అంగూర్ వెంటనే సమాధానం చెప్పలేదు.ప్రసంగం మార్చడానికి ప్రయత్నించింది. కాని రామ్ వదిలిపెట్టలేదు.

"దాదా మానసికవేదనకు కారణం యేమింటం టావు ? అంగూర్!"

ఆమె నెమ్మదిగా చెప్పింది. "బాబూజీ ప్రారంభం నుండీ నన్ను అమితంగా ప్రేమిస్తున్నాడు. ఆయనగారి మనస్సు నామీద లగ్నమైంది. ఆయనగారికి మనపట్ల సదభిప్రాయమేవుంది. మనమంటే అపారమైన ఆదరాభి మానాలూ వున్నాయి. వాటిని తోసిపుచ్చి ఆయన నన్ను దగ్గరకు చేర్చుకోలేకపోతున్నాడు. అనుభవించలేకపోతు

న్నాడు. ఇదే ఆయనగారి మానసికఆవేదనకు కారణమని నేను అనుకుంటున్నాను రామ్."

రామ్ మౌనం వహించాడు. అతను తల క్రిందికి దించుకుని యేమేమో ఆలోచించాడు. పదినిముషాలు దొర్లిపోయాయి. అతను ఆమెవైపు చూస్తూ అన్నాడు.

"అంగూర్, దాదా మనలను అమితంగా ప్రేమిస్తు న్నాడు. అందుకు సందేహంలేదు. నిన్ను పొందాలనేకోరిక దాదాకు వుంటే వుండవచ్చు. నేను ప్రారంభంనుండి అది అనుకుంటూనేవున్నా. అయినా దాదా తననుతాను సరి దిద్దుకుంటూ యీ రోజువరకు ఆ విషయంలో యేమీ తొందరపడలేదు. నీవు యిప్పుడు చెపుతూన్నావు కాబట్టి దాదాను సరియైన మార్గంలో పెట్టడానికి మనం కొంత త్యాగం చెయ్యాలి అంగూర్"

"యేమిటటా ఆ త్యాగం"

"నీవు అంగీకరిస్తానంటే చెపుతాను అంగూర్"

ఆమె సందేహిస్తూ భర్తవైపు చూచింది "ఆమోద యోగ్యమైనదైతే నేను అంగీకరిస్తాను రామ్"

"మినహాయింపులు కూడదు అంగూర్"

"అదేమిటో బయటపెట్టు రామ్"

"మనం ఇద్దరం విడాకులు యిచ్చుకుందాం. నీవు దాదాను చట్టరీత్యా వివాహం చేసుకో, నేను మరొకరిని చేసుకుంటావు."

"రామ్!" ఆమె బెదురుతూ అతనివైపు చూచింది.

"అవును అంగూర్"

ఆమె లేచి నిలబడి చెప్పుకుపోయింది. "రామ్, మీ మగవాళ్ళలో ఆ మృగాలలక్షణాలు ఇంకా మిగిలి వున్నాయి రామ్. లేకపోతే నీవు ఆ అభిప్రాయం అంత తేలికగా బయటపెట్టలేవు. అయినా నీ సూచనను నేను అంగీకరించలేను అంగీకరించను. నీవు గనక నన్ను బలవంతంమీద వేరుచేస్తే నేను దేనిలోనైనా పడి చస్తాను కాని మరొకరి ఆలిగా నేను తలయెత్తుకు తిరగలేను. ఇది నా నిశ్చయం"

"మరి దాదా విషయం యేమి ఆలోచించావు అంగూర్"

మనం ఇద్దరం ఆయనకు నచ్చచెప్పి ఆయనను మన దగ్గరే వుంచుకుందా రామ్. యేదైనా మంచి సంబంధం కుదిరితే ఆయనగారు త్వరలో వివాహంచేసుకునేట్టు చూద్దాం."

రామ్ నర్సింగ్‌హోమునుండి డిశ్చార్జి చేయించుకుని టాక్సీలో ఇంటికి చేరారు. అంగూర్ గడియారంవైపు చూచింది. పన్నెండు దాటింది. ఆమె నాయరును పిలిచి "తమ్ముడూ! బాబూజీ ఇంటికి రాలేదూ?" అని అడిగింది.

"రాలేదు అక్కా: మీరు వెళ్ళిన ఒకగంట తరువాత స్టుడియోనుండి ఫోన్ చేశారు."

"యెవరు చేశారంటావు ?"

"బహుశా మేనేజరుజయపాల్‌గారు అనుకుంటాను "

"యేమని చెప్పారు ?"

"మిమ్మలను ఒకసారి స్టుడియోకి రమ్మనమని చెప్పారు."

"దేనికో తమ్ముడూ!"

"తెలియదు అక్కా."

ఆమె ఫోన్ రిసీవరుతీసుకుని నెంబరు చెప్పింది. అవతలి కంఠం అడిగింది. "యెవరూ?"

"నేను అంగూర్‌ను, బాబూజీ అక్కడవున్నారా"

"అయితే మేనేజరుగారు వస్తున్నారు వుండండి"

"యెవరమ్మా! పంకజం!" మేనేజరు జయపాల్ అడిగాడు.

"అవును మేనేజరు సాహెబ్, ఉదయం ఒకసారి మీరు ఫోన్‌లో పిలిచారట"

"అవునమ్మా, మీతో చాలావిషయాలు మాట్లాడాలి. మీభర్త రాంగారు యెక్కడా!"

"నర్సింగ్ హోమునుండి యిప్పుడే ఇంటికి వచ్చారు. ప్రస్తుతం యిక్కడే వున్నారు. అవునుగాని బాబూజీ ఎక్కడవున్నారు మేనేజరు సాబ్."

"నేనుబయలుదేరి వస్తున్నానమ్మా. మిగతావిషయాలన్నీ మీ ఇంటిదగ్గర కూర్చుని మాట్లాడుదాం."

రాం స్నానంచేసి బట్టలు మార్చుకుని డ్రాయింగు రూములో కూర్చున్నాడు. అంగూర్ అతనిప్రక్కగా నిలబడి కబుర్లు చెపుతూంది.

"రాం, యీ ఇంటికి లోగడ యెప్పుడైనా వచ్చావా!"

"ఆఁ, ఒకటి రెండుసారులు వచ్చాను"

"పై గదులు చూచావా! రాం"

"లేదు. అంగూర్"

"ఆ గదులనిండా దిశమొల చిత్రాలు వున్నాయి. రామ్"

అతను చిన్నగా నవ్వాడు "దాదా ఆర్టిస్టుగా అంగూర్"

స్టుడియో మేనేజరు గేటుతోసుకుని లోపలకు వచ్చాడు. రాం అతనికి ఎదురుపోయి "నమస్తే మేనేజర్ సాబ్" అన్నాడు. జయపాల్ ప్రతినమస్కారం చేశాడు.

రాం, జయపాల్‌లు కుర్చీలో కూర్చున్నారు. అంగూర్ రాం కుర్చీవెనుక నిలబడింది. జయపాల్ ఆమె వైపుచూస్తూ అన్నాడు. "మీరుకూడా కూర్చోండమ్మా, చాలావిషయాలు మాట్లాడాలి"

అంగూర్ ఒకకుర్చీ రాం ప్రక్కకులాగి దానిలో కూర్చుంది. జయపాల్ వారిముఖాలలోకి చూస్తూ చెప్పాడు "శివరాంగారు ఈ ఉదయం ప్లేన్‌లో మద్రాసు వెళ్ళారు."

"దేనికో!" అడిగింది అంగూర్.

"ఆయగారు మళ్ళీ విదేశాలకు పోతున్నారు. మద్రాసునుండి కలకత్తాకుపోయి బర్మా, చైనా, జపాన్, మలయా మొదలైన దేశాలు తిరిగివస్తారట"

అంగూర్ నిర్ఘాంతపోయింది. "మాకు మాటమాత్ర

మైనా చెప్పలేదేమండీ. అయితే మళ్ళీ ఎప్పుడు తిరిగి వస్తారటా?"

"ఆవిషయం ఆయనగారు చెప్పలేదమ్మా. అయినా వారిమాటలనుబట్టి సంవత్సరంపైగా పడుతుందని నేను అనుకున్నాను."

"అబ్బ!" అంగూర్ నిర్ఘాంతపోయి అంది.

రాం యేమీ మాట్లాడలేదు. అతనికళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"యీ ప్రయత్నం యెప్పటినుంచి చేస్తున్నారు" అంగూర్ అడిగింది.

"యేమోనమ్మా! రెండువారాలకు పూర్వం ఆయనగారు పాస్‌పోర్టులవీ సరిచేయించుకున్నారు."

"ఇంకా యేమికబుర్లు చెప్పారండీ" అంగూర్ అడిగింది.

"యేమికబుర్లు లేకేం. చాలా వున్నాయమ్మా, ఆయనగారు తిరిగివచ్చేంతవరకు స్టుడియో వ్యవహారాలన్నీ మీ రాంగారిని చూస్తూవుండమన్నారు. మీరు ప్రస్తుతం ఉంటున్న యీ ఇల్లు మీపేర ఖరీదుచేశారు. ఆయనగారు వాడుకుంటున్నకారు అమ్మివేశారు. బహుశ శివరాంగారు ఇప్పట్లో తిరిగిరారనే అనుకోవచ్చు. అప్పటివరకు రాంగారు రోజూ స్టుడియోకి రావలసి ఉంటుంది."

నాలుగునిముషాలు మౌనంగా గడిచాయి. జయపాల్ జేబులోనుండి రెండుజాబులుతీసి ఒకటి రాంకీ, రెండవది అంగూర్‌కీ యిచ్చాడు. అంగూర్ లేచి లోపలికిపోయి

రెండుగ్లాసులతో కాఫీతెచ్చి వారిముందు పెట్టింది. కాఫీ అనంతరం జయపాల్ సెలవుతీసుకుని వెళ్ళిపోయాడు.

గడియారం ఒంటిగంట కొట్టింది. నాయరువచ్చి భోజనాలు వడ్డిస్తానన్నాడు. "నాకు ఆకలిగాలేదు నీవుతిను. అంగూర్" అన్నాడు రాం. "నాకూ ఆకలిలేదు" అంది అంగూర్. ఆమె నాయర్ వైపుతిరిగి "తమ్ముడూ నీవు భోజనంచెయ్యి, మేము తర్వాత చేస్తే చేస్తాము, లేకపోతే లేదు" అని చెప్పింది. నాయర్ జాలిగా వారివైపుచూస్తూ లోపలికి పోయాడు.

"అంగూర్, నామనస్సేమీ బాగులేదు. కాసేపు పరుంటాను. యెక్కడపరుండమంటావు?" అని అడిగాడు రాం. "బాబూజీ గదిలోకిపోయి పడుకో రాం" అని చెప్పింది ఆమె.

అంగూర్ తన గదిలోకిపోయి పండుకుంది. శివరాం వ్రాసినలేఖ ఆమెచేతిలోనేవుంది. పదినిముషాలు తరువాత ఆమె జాబుతీసి చదవడం ప్రారంభించింది.

అంగూర్,

నేను యీ రోజున మిమ్ములనువదలి దూరప్రాంతాలకు పోతున్నాను. నేను పోయేముందు కొన్ని యదార్థవిషయాలు నీదృష్టికి తీసుకురావాలని అనుకున్నాను. కాని నాకు అంతధైర్యం లేదు. మీ భార్యాభర్తల నిష్కల్మష హృదయాలను తెలుసుకున్న పిమ్మట మీకు యేవిధంగానూ, అన్యాయం చెయ్యకూడదనే నిర్ణయానికివచ్చాను. కాని నాకు అది సాధ్యంకాలేదు నీ సమక్షంలో తిరుగుతూ

నిన్ను నాదానినిగా చేసుకోవాలనే ఆరాటంతోనే నీకు అన్నీ సమకూర్చాను. అయినా నీవు నాకు లోబడలేదు. వునీ ధన్యురాలవు అంగూర్. నీవు నన్ను ప్రేమించాలని నేను ఆశించాను. నా ఆశ కొంతవరకు ఫలించింది. కాని నీది భాతృప్రేమ, కేవలం అధ్యాత్మికమైనది. నాకు అంతే చాలు అంగూర్. అయినా నిన్ను చూస్తూ నేను మూగ బాధ అనుభవించాను. కామతృష్ణను జయించలేక పోయాను. రాం ఒకటి రెండు రోజులలో బయటికివస్తాడు. యీ స్థితిలో నేను మీ మధ్యతిరగటం అంటే మీ సంసారానికి చిచ్చుపెట్టక తప్పదు. అందుకే నేను మీకు దూరంగా పోదలచుకొన్నాను.

అంగూర్, మనం కలసివున్నది కొద్దిదినాలే అయినా మనం ఒకరిపట్ల ఒకరం ఆత్మీయత పెంపొందించుకున్నాం. అది చిరకాలం వుండాలనే నా అభిలాష మనం వుంటున్న ఇల్లు నీపేర ఖరీదుచేశాను అమీర్ పేటలో రాంపేర కొన్న ఇల్లు యెవరికైనా అద్దెకు యిచ్చి మీరు యీ ఇంట్లోనే వుండిపోవాలని నా అభిలాష. నాయర్ ఉన్నంత కాలం అతనిని మీదగ్గరే ఉంచుకోండి. నీ చిత్రం అమ్మగా వచ్చినడబ్బులో ఇంకా ఆరువేలుమాత్రం మిగిలింది. ఆ మొత్తం మీ ఇద్దరిపేర బ్యాంకులో జమకట్టాను. మీ బ్యాంకు అకౌంటు పుస్తకాలు నా ఆఫీసుడ్రాయరులో వుంటాయి. అవి తీసుకోండి.''

అంగూర్, మరోవిషయం. రాం చాలా అమాయకుడు. నిష్కల్మషహృదయం కలవాడు. అతను నీఅంత

లోతైన గుండెకలవాడు కాదు. వాడు నీ భర్త. నీ బ్రతుకులో భాగస్వామి. అతనిని జాగ్రత్తగా చూచుకోగలవని ఆశిస్తాను. భార్యవై రాంను నీవు ఆరాధిస్తున్నావు. వాడి పట్లనేనూ, అంతులేని మమకారం పెంపొందించుకున్నాను. సోదరుడికంటే, బిడ్డకంటె యెక్కువగా యీనాడు అతనిని నేను ప్రేమిస్తున్నాను. రాంతో మన ఋణానుబంధం విడి వడనిది అంగూర్. మీరు సుఖప్రదమైన జీవితం గడుపుతూ త్వరలో బిడ్డలను కని వృద్ధిలోకి రావాలని కోరుతున్నాను అంగూర్.

సెలవు,

నీసోదర సమానుడు

శివరాం.

అంగూర్ జాబుపూర్తిచేసి మంచంమీదవాలి విల విల రోదించింది. ఆమెచేతులు రెండూ జోడించి "బాబూజీ నేను మీ పాలిటి రాక్షసిని. నన్నుగురించి మీరు దూరమై పోయారా! బాబూజీ! నేను మీకంటపడకుండాఉంటే మీరు హాయిగా, నిశ్చింతగా జీవించేవారేకదా! నాకు చావు రాలేదు. నారూపం మిమ్ములను తరిమివేసింది. నేను యేనాడో చచ్చివుండవలసింది. అప్పుడు మీరు ఇన్నియిడుమలపాలు అయ్యేవారుకాదు బాబూజీ!" అనుకుని కుమిలి కుమిలి ఏడ్చింది. ఆ ఏడుపులోనే ఆమె నిద్రపోయింది.

సాయంకాలం నాలుగుగంటలైంది. నాయర్ వచ్చి తలుపుతట్టాడు. ఆమెలేచి తలుపు తెరిచింది. అక్కా, కాఫీ తీసుకురానా?" అన్నాడు నాయర్. "పైన రాం ఏమిచేస్తు

న్నారో చూచిరా నాయర్" అంది ఆమె. "నేను పైకి పోయి వచ్చాను. ఆయనగారు తలుపుతియ్యలేదు అక్కా" ఆమె మేడపైకిపోయి తలుపు తట్టింది. లోపలనుండి సమాధానంలేదు. ఆమె నెమ్మదిగా పిలిచింది. "రాం, తలుపు తియ్యవూ!" అతడు తలుపుతీశాడు.

"రాం నీకు ఆకలిగాలేదూ, కిందికిపోదాము రా. కాఫీ తీసుకుందాం"

"దాదా నీజాబులో ఏమిరాశాడు అంగూర్."

"కిందకిపోయి చూదాం రా రాం."

"నువ్వు చదువలేదా అంగూర్."

ఆమె మందస్మితంచేసింది. వివరాలుచెప్పింది. అతని కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి. "అంగూర్ నాజాబుతీశాను. మొదటిరెండువాక్యాలు చదివేసరికి నాకు ఏడుపువచ్చింది. తరువాత ఇక చదవలేకపోయాను. అందులో ఏముందో నీవు చదువు, నేను వింటాను."

"కాఫీ తాగినతరువాత చదువుతాను," అంటూ అతను పరుపుక్రిందనున్న జాబుతీసి ఆమెచేతిలో పెట్టాడు. ఆమె జాబుతీసి చదివింది.

రాం,

నిన్ను ఇక్కడ వదిలేసి నేను దూరదేశాలకు పోతున్నాను. నా యెడబాటు నీవు భరించలేవు. నాకు ఆవిషయంతెలుసు. అయినా నేను ఏముచేయగలను. మీా భార్యా

భర్తల శ్రేయస్సు దృష్టిలో పెట్టుకునే నేను బయలుదేరి పోతున్నాను రాం. అంగూర్‌పై వ్యామోహంతో నేను కావాలని నీతో స్నేహం చేశాను. కాని నీ నిష్కల్మష హృదయం, నీ అవ్యాజప్రేమ నన్ను ముగ్ధుణ్ని చేశాయి. నన్నుగురించి నీవు బాధపడినట్టే నిన్ను గురించి నేను బాధ పడుతూంటాను. మనకు శరీరాలు వేరైనా హృదయాలు ఒక్కటే. ఈ కొద్దికాలంలో మనం ఎంతో సన్నిహితుల మయ్యాము. యీ మధురస్మృతులు మనభావిజీవితాలను తరింపజేస్తాయి రాం.

రాం! మరోవిషయం. అంగూర్‌ను నేను నా దాని నిగా చేసుకోవాలనేవాంఛ నాలో మొదటినుండీ వుంది. అందుకు నేను ఎన్నోప్రయత్నాలు చేశాను. కాని విఫ లుడనయ్యాను. అంగూర్ నిన్ను అమితంగా ప్రేమిస్తోంది. ఆ ప్రేమ కేవలం శారీరకమైనది కాదు. పవిత్రమైనది రాం. అంగూర్‌ను నీవుకూడా ఆ విధంగా ప్రేమించు. ఆమెకు సుఖశాంతులు చేకూర్చు.

స్టుడియో వ్యవహారాలన్నీ నీవే చూచుకోవాలి. మేనేజరు జయపాల్‌తో నేను అన్నివిషయాలు చెప్పాను. ఆయనగారిసలహాలను పాటిస్తే కొద్దికాలంలోనే నీవు కావ లసిన అనుభవం గడిస్తావు. స్టుడియోమీద వచ్చే ఆదా యంలో నాలుగోవంతు మాత్రం నీఖర్చులకు ఉంచుకుని మిగిలినది స్టుడియో అభివృద్ధికి వినియోగించు.

రాం నేను ఎప్పుడుతిరిగి వస్తానో, అసలు వస్తానో

రానో యిప్పుడుఏమీచెప్పలేను. నీవూ, అంగూర్ సుఖ ప్రదంగా జీవించాలనీ, సిరిసంపదలతో తులతూగాలనీ అభిల షిస్తాను.

శెలవురాం
నీ దాదా శివరామ్.

జాబు పూర్తిచేసి అంగూర్ కళ్ళువత్తుకుంది. రాం ఆమెను కౌగలించుకుని "అంగూర్, దాదాఇకమనకు అగు పించదా అంగూర్" అన్నాడు. ఆమె సమాధానం చెప్ప లేదు. గుమ్మంలో నాయర్ నిలబడి "అక్కా కాఫీతీసుకు రానా!" అన్నాడు.

* * * *

సంవత్సరం గడిచింది. అంగూర్ కొడుకునుకంది. ఆ పసివాడిలో ఆమె బాబూజీని చూచింది. "ఆకళ్ళు, ఆ ముక్కు, ఆ పెదవులుఅంతా బాబూజీయే "అనుకునేదామె

ఒకరోజున ఆమెభర్తనుఅడిగింది"రాం,మనబాబుకు. ఏమిపేరుపెడదాము?"

అతను నవ్వుతూ చెప్పాడు"అంగూర్, మనబాబుకు యింకోపేరు ఎందుకు? నేను దాదాఅంటాను, నీవు బాబూజీఅను, బయటివాళ్ళకు మనబాబు శివరాం"

ఉయ్యాలలో కేరింతలుకొడుతున్న బాబుదగ్గరకు "బాబూజీ, ఓ బాబుజీ" అంటూ అంగూర్ వాడిని చేతు లలోకితీసుకుని పైకిఎగరవేసింది. రాం వాడిని అందుకుని "దాదా! దాదా!" అంటూ తనముఖం వాడిపొట్టకేసి రుద్దాడు. బాబు బోసిగా నవ్వాడు.

